శ్రీరస్తు

బమ్మెర పోతనామాత్య ప్రణీతంబైన

# శ్రీమదాంధ్ర భాగవతము

(లఘుటీకా సహితము)

ప్రథమ సంపుటము 1_7 స్కంధములు

శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిచే

పరిష్కరింపఁబడినది



ప్రచురణకర్తలు:

రాయలు అండ్ కో.,

ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్, కడప.

బ్రాంచి : 32, నారాయణముదలి వీథి, మద్రాసు_1



[వెల 10-60

# మనవి మాటలు



1930-వ సంవత్సరమున గ్రంథపఠనముకొఱకై చిన్నమొత్తున పుస్తకముల వ్యాపారమును ప్రారంభించి, కాలక్రమమున అన్నిరకముల పుస్తకములను తెప్పించి 1940-వ సంవత్సరము వఱకును ఆ వ్యాపారమును "శ్రీ గృహసరస్వతీ బుక్ డిపో" యను పేర సాగించి, తదుపరి "రాయలు అండు కో" అను పేర ప్రశస్తమైన "రాయల ప్రచురణలను" వెలువరించి ఆంధ్రపాఠకలోకమున కందఁజేయఁజొచ్చితిని.

నా బాల్యమున నేను కృష్ణశతకము, సుమతీశతకము, రుక్మిణీకల్యాణము, గజేంద్రమోక్షము మున్నగు పుస్తకములఁ జదువునప్పుడు అందలి తప్పులను ఉపాధ్యాయులు సవరించుచుండుటను నేను ఎఱుఁగుదును. పద్యములను కంఠస్థము చేయుటయే గాని భావస్ఫురణకుఁ బ్రాధాన్యము లేకుండెను. శైశవమునఁ బఠించిన పద్యముల భావమును వయసుమీఱిన తర్వాతనే నేను గ్రహింపఁగలిగితిని. పుస్తకములఁ జదువవలసిన విధము, నిలుపవలసిన సన్నివేశములు గల శుద్ధప్రతులు లేకుండుటయే అందులకు కారణము.

ఈ స్వానుభవమును పురస్కరించుకొని, విద్యాశాఖయందనుభవముగల పండితులచే చక్కఁగ సంస్కరింపించి మొదట శతకములు, తదుపరి రామాయణాదిగ కతిపయ కావ్యములఁ బ్రచురింపఁగలిగితిని. అంతట, పోతనరచిత శ్రీమద్భాగవతములోని ఘట్టములు లేని పాఠ్యగ్రంథములే లేనందునను, ఇది అఖిలాంధ్రులకు ఆదరపాత్రమైన దగుటచేతను ఈ గ్రంథమును సక్రమముగ సంస్కరింపించి ప్రచురింపవలయు నను వాంఛ జనించినది. బాలబాలికలు, గృహిణులుగూడ సుకరముగ చదివి గ్రహించునట్టుల తప్పులులేక, విరామచిహ్నములు వగైరాలతో, లఘుటీకా సమేతముగ భాగవతమును ప్రచురింపవలెనని సంకల్పించితిని. పలువురు మిత్రులు కూడ ఇందుకు నన్ను ప్రోత్సహించిరి. నాకును ఇది యొక సత్కార్యముగా పొడగట్టినది. ఇప్పటికే కొందఱు ప్రచురణ లున్నను, వానికన్న విశేషముగా సరిక్రొత్త పద్ధతిని, సర్వాంగసుందరముగా నీ భాగవతమును ప్రచురింపఁ బూనుకొంటిని. కేవలము లాభైకదృష్టిని పెట్టుకొనక, గ్రంథగౌరవదృష్ట్యా, అందఱికిని ఆదరణీయ మగునట్లు దీనిని రూపొందింప నిశ్చయించితిని.

ఈ గ్రంథమును సరిచూచుటకు శ్రీమాన్ తాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారిని అభ్యర్థించగా, అవ్యాజమైన దయతో దీని సంస్కరణకార్యమునకు వారు తక్షణమే సమ్మతించిరి. ఇది యొక శుభశకునముగా భావించి కార్యమున కుపక్రమించితిని. విద్వద్వతంసులు శ్రీ జనమంచి వేంకట సుబ్రహ్మణ్యశర్మ, శ్రీ తిరుమల వేంకట రంగాచార్యులు, శ్రీ బులుసు వెంకట రమణయ్య ప్రభృతి మహాశయులు ఈ ప్రచురణకార్యములో నాకు మిగుల చేయూతనిచ్చిరి. తేజోమూర్తుల కేశవరావుగారు కొన్ని రసవద్ఘట్టములకు చక్కని చిత్రములను సమకూర్చి పెట్టిరి. మహాకార్యమైనందున కొంత కాలవిలంబము జరిగినను, చివరకు పై అందరి అండదండలతో ప్రస్తుతస్వరూపమున దీనిని బయటికి తేగలిగితిని. అనుకొన్న విధముగా దీనిని సాధించితిననియే విశ్వసించుచున్నాను. ఇందులో నేను ఆయవ్యయములకు వెనుదీయలేదనుట ప్రత్యక్షసత్యము. ఇంక ఈ కూర్పులోని విశిష్టతను, ఈ తీర్పుతీరుల చక్కదనమును నిర్ణయింప కర్తలు పాఠకులే. మహాజనము ఇందుకు హర్షించునేని నేను ధన్యుడనగుదును.

అనుకొన్న విధముగ దీనిని ప్రచురించి 16-4-1954 న ఒంటిమిట్ట శ్రీ కోదండరామబ్రహ్మోత్సవ సందర్భమున జరిగిన శ్రీ పోతన వర్ధంత్యుత్సవమున భగవదర్పితము చేసి, పండిత సన్మానము గావించి, ఈ భాగవతగ్రంథ ప్రతులను బహూకరింప గలిగితిని. భాగవతగ్రంథ పఠనపోటీపాఠకులకు రాయల ప్రచురణలు నొసంగితిని. ఇది నాజన్మమున నొక మహత్తమ ఘట్టముగ భావించుచున్నాను.

అడిగినదే తడవుగ ఈ గ్రంథమును పరిష్కరించిన శ్రీమాన్ తాళ్లపల్లి అనంతకృష్ణశర్మ గారికిని, ఉత్సవసమయమున విచ్చేసి కార్యకలాపములలో పాల్గొని ఆశీర్వదించిన పండిత లోకమునకు, పోతనమహాకవి విశిష్టతనుగూర్చి లఘుపరిచయమును, కృతిసమర్పణ మహోత్సవ సమీక్షను వ్రాసి యిచ్చిన శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులు, గడియారం వెంకటశేష శాస్త్రిగార్లకును నా హృదయపూర్వకాభివందనములు. ఇంకను ఇట్టి గ్రంథరాజములను ప్రచురించుటకు ఆంధ్రపాఠకలోకము మాకు సదవకాశమును గల్గింతురని మా ఆశయము.

కడప
16-4-54

ఇట్లు
బుధజన విధేయుడు
ఆంధ్రభాషా సేవాధురంధరుడు
[illegible] సుబ్బరాయుడు
రాయలు అండ్ కో.



శ్రీ కోదండరామస్వామి గోపురద్వారము. ఒంటిమిట్ట, కడపజిల్లా.



గర్భగుడిద్వారము ద్వారపాలకులు, వాసుదాస కృత రామాయణ సమర్పిత శిలాశాసనము.
దాని ప్రక్కనున్నదే పోతన శిలావిగ్రహముగల గుడి.

# పీఠిక

—:o:—

కన్నులకు విందుగా, పదవాక్యములను సుబోధముగా విడఁదీసి, శ్రీ పోతన మహాకవి భాగవతమును శుద్ధముగా ముద్రించి తెలుఁగువారి కందీయవలెనని 'రాయలు' ప్రకటనాలయ సంచాలకులగు శ్రీ జక్కా సుబ్బరాయలుగారి యుదారాశయము. దాని ఫలమే యీ క్రొత్తకూర్పు. వారి కోరికప్రకారము ఈ మహాప్రబంధమును స్థూలముగా సరిచూచిన సామాన్యకైంకర్యముమాత్రమే నాది. ఈపనికి నే నుపయోగించుకొన్న ప్రాఁత కూర్పు లివి :—

(౧) ౧౭౭౦-వ శాలివాహనశక కీలకసంవత్సరమున శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రులవారు ముద్రించినది.

(౨) ౧౮౭౭-వ క్రీస్తుశకవత్సరమున పంచాంగము దేవరాజ పరుసరామయ్యగారు శోధించి వేసిన కూర్పు.

(3) పై రెంటి జాతికే చేరిన మఱొక్క ముద్రణము (ముఖపత్రము చినిగియుండుటచేత దీని కాలము తెలియదు.).

(౪) ౧౮౯౪-వ క్రీస్తుశకవర్షమున కొమాండూరు అనంతాచార్యులు గారు పరిశోధించిన 'ఆనంద'వారి ముద్రణము.

(౫) ౧౯౪౦-వ క్రీస్తువత్సరమున ముద్రించిన 'వావిళ్ళ'వారి కడపటి కూర్పు.

వీనికి తోడు మూల శ్రీభాగవతమునుగూడ సంప్రతింపుల కుపయోగించితిని.

ఈ నా పర్యవేక్షణము చాల స్థూలముగా, బహిరంగముగామాత్రమే చేయఁగల్గితిని. ఇంతకంటె లోఁతుకు దిగి పరీక్షించుటకు వలసిన యవకాశమును, అనుకూలములును – శక్తిమాట యట్లుండనిండు – నా కిప్పటికి చాలవు. ఇవి మూఁడును గలవారికిని ఈ భాగవతశోధనకార్యము ఒకయెత్తున ముగియునదియు, సుకరమును గాదు.

ఆ మహాకవితాతపస్వి పోతన్న తన యమృతభారతిని ఏ విషఘటికలో 'శ్రీకైవల్యపదంబు' అని యుపక్రమించెనో కాని, ఇంచుమించుగా ఈ కడచిన యాఱువందల సంవత్సరాలును అది తిన్న–తినుచున్న–దెబ్బలు అన్ని ఇన్ని కావు. ఇన్ని యాఘాతములకు లోఁగిన తెలుఁగుగ్రంథ మింకొక్కటి లేదు. దీనివలెనే

ఆంధ్రమహాభారతము, భాస్కరరామాయణమును పలువుర రచనల సంహితలే యైనను ఆగ్రంథముల భాగములు నిష్కర్షగా వీరువీరు రచించినవని మన మెఱుఁగుదుము. అందు సామాన్యముగా కానవచ్చు పాఠభేదములు వ్రాసిన, ముద్రించిన వారి అవ్యుత్పత్తినిగాని, పాండిత్యమునుగాని పట్టి యేర్పడినవి. అంతేకాని, దీనివలె పదము, వాక్యము, పద్యము, ఘట్టము, స్కంధము అను సన్నివేశములను లుప్తపూరణమును ఇతరులు చేయవలసిన దురవస్థ కవి పాల్పడలేదు. ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక సిద్ధార్థిసంవత్సరపు ౧-౨ సంచికలో 'ఆంధ్రభాగవత కర్తృత్వము' అని కీ. శే. క్రొత్తపల్లి సూర్యారావుగారు వ్రాసిన వ్యాసము చదివితిమేని ఈ భాగవతరచన ఎంత చిక్కైనదో, దానిని విడఁదీయుట యెంత శ్రమసాధ్యమో తెలిసికొనఁగలము. అప్పుడు వేఱువేఱు దేశములనుండి సంపాదించిన సుమారు ౫౦ వ్రాతప్రతులను పరస్పరము పోల్చి పరిషత్తువారు ఈ విషయమునఁ జేయవలసిన పని యెంత, ఎట్టిది అనిమాత్రము తెల్పుకొన్నారు. తరువాత ఈ ౩౫ సంవత్సరములుగా పరిషత్తువారుగాని, ఇతరులెవ్వరుగాని యీ పనిలో ఆ అంతస్తు దాఁటినట్లు కానరాదు. అధికారము, అవకాశము, పరికరము, ధర్మమును గల సాహిత్యపరిషత్తువారే మరలఁ బూనుకొని, ఈ గ్రంథమును పరిశోధించు పని తలపోలముదాఁకింపఁగలవారు. స్థూలముగా, ముద్రితములైన ప్రతులనుమాత్రము చూచువారికి తోఁచునట్టి కొన్ని చిక్కులకు ఒండురెం డుదాహరణము లిచ్చుచున్నాను :—

(౧) తృతీయస్కంధమందలి కపిలదేవహూతిసంవాదమున మాతృగర్భగతుఁడైన జీవుని పరిచింతనముగా ఈక్రిందిశ్లోకము మూలమైన వ్యాసభాగవతమునఁ గలదు:—

"యన్మాయయోరుగుణకర్మనిబంధనేస్మిన్
సాంసారికే పథి చరం స్తదభిశ్రమేణ,
నష్టస్మృతిః పునరయం ప్రవృణీత లోకం
యుక్త్యా కయా మహదనుగ్రహ మంతరేణ. (౩. ౩౧-౧౫)

ఈశ్లోకార్థమును జీవుని యాత్మగతచింతాంతర్గతమైన సంస్తుతి వాక్యముగానే శ్రీధర వీరరాఘవశుకదేవాదివ్యాఖ్యాతలందఱును నయించినారు. కాని తెలుఁగులో ఇది దేవహూతి కపిలుని నడిగిన ప్రశ్నగా కానవచ్చుచున్నది:—

"సీ. *నాపుడు సుతునికి దేవహూతిటను 'మహితాత్మ యెవ్వని………

ప్రబోధకలితముగఁ బల్కె' మనపుడుఁ గపిలుఁ డనియె……" (౩-[illegible])

---

* ఈ సీసపాద మిట్లే ప్రాంతముద్రణములలోఁ గలదు. ఆనంద, వావిళ్ళ వారి ముద్రలలో 'అనవుడు సుతునకు జనని యిట్లనుఁ దగ' అని మార్పు గలదు. ఈమార్పు వావిళ్ళ రామస్వామి శాస్త్రిగారు మొట్టమొదలు శోధించి ౧౮౫౪ వ సంవత్సరమున [illegible] ముద్రించిన ప్రతిలోనే కలదు.

ఈమార్పు ఎట్లు వచ్చిపడినది? మూలమునందలి 'కయా' అను ప్రశ్నవాచక పదమునకు తాత్పర్యమును గ్రహింపఁజాలక సామాన్యప్రశ్నముగానే భావించి, ఇంకెవ్వరును దగ్గఱ లేరుగనుక, దేవహూతికే దాని నంటఁగట్టినట్లున్నది.

(౨) అష్టమస్కంధమున వామనావతారకథలోని—

క. "ఋద్ధబ్రహ్మర్షిసమా-రాధ్యుండై, విహితమంత్రరాజిఁ జదువుచు
న్నిద్ధంబగు ననలంబున-వృద్ధాచారమున వటుఁడు వేల్చెఁగ గడిమిన్" (౮-౫.౨౯)

అను పద్యము పూర్వముద్రణములందెల్ల - ఆనందవారిముద్రణమునఁగూడ - ఈ పాఠముతోనే యున్నది. కాని వావిళ్ళవారి పాఠ మిట్లున్నది:—

"ఋద్ధ....సమారాద్ధుండై........ప్రోద్ధంబగు ననలంబున...."

'రాధ్య-రాద్ధ'ల కంతగా అర్థభేదము లేదుగావున ప్రాసరక్షణకై రెండవ రూపము నాశ్రయించినను అంత నష్టము లేదుగాని, ఈ 'ప్రోద్ధ' మేమో నాకర్థము కాదు. సంస్కృతమూలమున 'సమిద్ధ మాహితం వహ్నిం' అనియే కలదు.
(౮-౧౮-౧౯)

(౩) వ్యాసభాగవతము అష్టమస్కంధమున దేవాసురయుద్ధమున దెబ్బలు తినిన దేవతలు మొఱవెట్టుకోఁగా వారి నాశ్వాసించు శ్రీమహావిష్ణువువాక్యములలో ఈ క్రిందిశ్లోక మున్నది:—

"న భేతవ్యం కాలకూటా ద్విషా జ్జలధిసంభవాత్,
లోభః కార్యో నవో(వై?)జాతు రోషః కామస్తు వస్తుషు" (౮-౬-౨౫)

ఇందలి యుత్తరార్ధమునకు 'వస్తువులందు లోభము, రోషము, కామము చేయరాదు' అనియే వ్యాఖ్యాతలందఱును అర్థమును వ్రాసిరి. కాని దీని తెలిఁగింపు ప్రాఁతముద్రణములలో—

"ఆ. అలసటయును లేక యఖిలార్థములు గల్గు
విషధిలోన నొక్క విషము పుట్టెఁ
గడఁగి చెఱుపలేవు కామదోషంబులు
వస్తుచయమునందు వలయుఁ జేయ" (౮-౧౩౫)

అనియే కలదు. ఒకదానిలోమాత్రము 'లేక యఖిలార్థములు' అను పాఠము 'లేక'కు కళాత్వమును చూపినది. ఆనందవారి ముద్రణము నిరర్థకమైన సముచ్చయమును గమనించి 'అలసటేమిలేక' అని సవరించి, తక్కిన పద్యార్థమును గమనింపక విడిచినది. వావిళ్ళవారి ప్రతి, యుత్తరార్ధమున

"కలఁగి వెఱవవలదు కామరోషంబులు
వస్తుచయమునందు వలదు చేయ"

అని మూలముతో కొంత యనుకూలించు పాఠము నంగీకరించినది ; కాని యీపాఠ మెక్కడనుండి సంపాదింపఁబడినదో తెలుప లేదు.

(౪) అష్టమస్కంధమందే ౧౮౨-వ వచనమందు 'సురాసురయూథంబులు......యమందగమనంబున మందరనగమునకుం జని' అని వావిళ్ళవారి పాఠము. ప్రాఁత ముద్రణములన్నియు 'మందగమనంబున' అనియే పఠించినవి. మూలమున వారి నడక మందమని కాని అమందమని కాని గమనింపనే లేదు !

(౫) ౭-౪౧ వ పద్యమున యుద్ధమ్మునకుఁ బైనఁ ఉశీనరుని వర్ణించుచో 'రయరోషదంష్ట్రాధరంబుతోడ' అనియే అన్నిముద్రణాల పాఠము. అనన్వితము. మూలమును చూడఁగా అందు 'రభసాద్దష్టదచ్ఛదమ్' (౭-౧-౩౦) అని కలదు. కనుక 'దష్టాధరంబుతోడ' అని సవరింపవలసియున్నది.

(౬) 'ఏని' అను నవ్యయము కళయే యని ప్రాచీనమహాకవి ప్రయోగములన్నియు స్పష్టపఱుచుచున్నవి. 'ఏనిఁ' అను క్వాచిత్క-ప్రయోగములు 'మిక్కిలిఁ - మరిఁ' ఇత్యాదులవలె పాక్షికమైన యువర్ణలోపముచే నేర్పడిన వనియే చెప్పవలసియున్నది. ప్రాఁతభాగవతముద్రణములలో నెల్ల 'ఏనియు' అనియే ఎన్నోచోటులందు పాఠము కానవచ్చును. కాని ఆనంద-వావిళ్ళ వారల ముద్రణములలో సర్వత్ర 'ఏనిని' అని తిద్దుపాటు జరిగినది ! తరువాత ఇంకొక యచ్చు వచ్చెనా మూఁడవ నకారము ప్రత్యక్షము కావలసిన దే !

భాగవతమును తెలిఁగించుటలో పోతనయును, తరువాతి సింగన గంగన నారయలును వ్యాసుల మూలమునే భక్తితో ననుసరించినను రసభావావేశమున్నచోట్ల విస్తరమును, శుష్కవిషయములందు కొంత సంక్షేపమును చేయుచునే రచన సాగించినారే కాని కేవలము మూలశబ్దదాసులుగా రచింప లేదనుట స్పష్టమే. కనుక మూలముతో సంప్రతించినను తెగని చిక్కు లెన్నో ఇందు గలవు. అన్ని ముద్రణములందును ఒకతేవిధముగా నున్నను, మూలము సహాయపడకున్నను పాఠము వేఱువిధముగా నుండవచ్చునని యూహింపవలసిన స్థలములుగూడ కొన్ని లేకపోలేదు. ఉదాహరణముగా ప్రథమస్కంధము ౧౬౬-వ పద్యమున

"భద్రవిమలకీర్తిపారగుఁ డారూఢనయవిశారదుండు నారదుండు"

అనుచోట అంత్యానుప్రాసప్రియుఁడగు పోతన 'కీర్తిపారదుఁడు' అనియే రచించి యుండునని యూహింపవలసియున్నది. కాని ఏముద్రణమందును ఆపాఠము నాకుఁ గానరాలేదు.

ఈగ్రంథ మింత పాఠభేదములకును, అపపాఠములకును, గ్రంథపాతపూరణములకును ఆకరమగుటకు నిర్వివాదముగా అందఱు అంగీకరింపఁగల కారణములు రెండు గలవు :—

(౧) విషయమహత్త్వముచేతను, అసాధారణమైన శైలీమధురిమచేతను ఇది అన్నిగ్రంథములకంటె ఆంధ్రలోకము నంతటిని ఆకర్షించినది. భగవద్భక్తిరసానుభవమునకు తెలుఁగుకావ్యములలో దీనిని మించినదికాని, దీనివంటిదిగాని ఇంకొక గ్రంథము లేదు. సంస్కృతభాగవతముగూడ రసావేశమున దీనికి తరువాతిదే. కనుక తెలుఁగుదేశమున అక్షరాస్యులైన అందఱి యిండ్లలోను ఏగ్రంథ ముండినను లేకున్నను ఇది యుండకతప్పినది గాదు. దీని ప్రతులు వ్రాసికొన్నవారిలో పండితులకన్న పామరులే యెక్కువ. కనుక వేలువేలు లేఖకులచేతి తప్పు లెన్నో ఇందు చేరినవి.

(౨) పండితు లట్టివానినిబట్టి తమ ప్రతులను వ్రాసికొనునప్పుడు వారివారి శక్తివ్యుత్పత్తులకొలఁది సవరణలు చేసియుండుట సహజము. అచ్చు వచ్చిన తరువాతను ఈ సవరింపుపనులు నాఁటినుండి నేఁటిదాఁక జరుగుచునేయున్నవి.

ఇఁక నిర్వివాదముగా అందఱును అంగీకరింపలేని కారణములును రెండు సాంప్రదాయికముగా వచ్చుచున్నవి.

(౧) మొదటిది ఈగ్రంథమును తొలుదొల్త ముద్రించిన శ్రీ పురాణం హయగ్రీవశాస్త్రుగారు తెలిపినది. వారికి 'బమ్మెరపోతనామాత్యుని జన్మకర్మప్రభావాదులఁ దెలిపెడు వచనరూపంబగు ప్రాచీనపండితజనలిఖితగ్రంథంబు'* ఒకటి లభించినదఁట. కాని మఱల ఇంతవఱకు ఆగ్రంథము మనకు లభింపలేదు. దానినుండి వారు సంగ్రహించిన విషయము లివి : 'పోతన తన నిర్యాణకాలమున కొడుకు మల్లన్నను పిలిచి తాను తెలిఁగించిన భాగవతము ముముక్షువులకు తప్ప ఇతరుల కధ్యయనముచేయరాదని చెప్పెను. మల్లన్న దానిని దేవతార్చనపెట్టెలో భద్రముగా దాఁచియుంచి తన యవసానకాలమందు తన సహాధ్యాయియైన నారయ్యకా నిధిని రహస్యముగా నుంచుకొమ్మని యిచ్చెను. నారయ్య కొంతకాలమునకు ఆ కట్టును విచ్చిచూడఁగా అందు చాలభాగము క్రిమిదష్టమై నశించియుండెను. దుఃఖించుచుండిన ఆతని కలలో ఒకనాఁడు పోతనయే కానవచ్చి నష్టభాగములను పూరింపుమని ముదల యీయఁగా అతఁడు గంగనసింగనల సహాయముచే ఆపని నెరవేర్చెను.'

కాని భాగవతభాగములను పూరించిన గంగన్న సింగన్న నారయ్యలలో ఎవరుగాని పై కారణము పేర్కొనలేదు. తక్కిన యిద్దఱి మాట యట్లుండఁగా

* శా. శ. ౧౭౮౦ ముద్రణపు పీఠిక.

పోతన్న సాక్షాత్కారమును, లుప్తపూరణానుజ్ఞను కలలోఁ గాంచనోఁచుకొన్న నారయ్యగూడ ఈ విషయమును సగర్వముగా పేర్కొనక మౌనము వహించుటకు హేతువేమి? నీవు పూర్తిచేయుమని పోతన తన కాజ్ఞచేయఁగా గంగన్న సింగన్నలనుగూడ కలుపుకొను నధికారము నారయ యేల వహించెను? పోతన తన జీవితకాలమంతయు ఈ గ్రంథమును ఏ యాప్తశిష్యునికిని ఉపదేశించక, తన కుమారునికిఁగూడ అట్లే దానిని దాఁచిపెట్టుమని కట్టడచేయుట, కుమారుఁడు పితృవాక్యపరిపాలనమును అక్షరశః నెరవేర్చుట, అతనినుండి క్రమముగా అదే యుపదేశమును పొందిన శిష్యుఁడు నారయ్యమాత్రము దాని నతిక్రమించి కట్టు విచ్చిచూచుట, పోతన్న అతని ననుగ్రహించి స్వప్నములో 'ఇంక నీ వీ మహా గ్రంథమును అనేక ప్రతులుగా నేర్పఱచి సాకల్యంబుగా భ్రష్టంబులయిన ఘట్టంబుల యందు నన్ను ధ్యానింపుచు నవీనముగా రచియించి యీ గ్రంథంబంతయు మత్కృతంబుగా నుండునట్లు ప్రకాశపరచవలయు'నని యాజ్ఞాపించుట, దానికి విరుద్ధముగా నారయ మఱియిద్దఱిని గలుపుకొని ౫, ౬, ౧౧, ౧౨ స్కంధాల నైనను బహిరంగముగా తమతమ రచనలుగానే రచించి ప్రకటించుట—ఇత్యాదులు పై కథలో సుగ్రహముకాని ఘట్టములు. నా కెందు నమ్మకము చాలదు.

(౨) ఇఁక రెండవకారణము రాచకొండ సర్వజ్ఞసింగమనేని కథ: సింగమనాయఁడు భాగవతము తనకంకితముగా చేయుమని పోతనను కోరఁగా-అతఁడు తిరస్కరించుట, రాజు కోపించి ఆగ్రంథమును బలవంతముగా పట్టి తెప్పించి భూమిలో పాఁతిపెట్టించుట, అందుమూలాన మన్నుదిని గ్రంథభాగములు శిథిలముగాఁగా ఆయాభాగములను నారయాదులు పూరించుట, అది కారణముగా అసంస్కృతప్రయోగములును, అందదుకుల శైలియు ఈ సంహితలో చేరుట—ఇవి ఇందలి ముఖ్యవిషయములు. దీనిని ఇన్నూఱేండ్లక్రింద కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహమున నుల్లేఖించినాఁడు.

దీనిని పలువు రంగీకరింపరు. 'సర్వజ్ఞబిరుదాంచితుఁడును, తాను గొప్ప పండితుఁడును, గ్రంథకర్తయు నైన సింగమనాయఁడు పోతనవంటి మహాభక్త కవి విషయమున ఇంత క్రూరముగా వర్తించునా'యని వారి సందేహము. కాని ప్రభువులు పండితులైన గ్రంథకర్తలైన మాత్రాన మనుష్యసహజములైన కోప తాపము లుండవనుట యనుభవవిరుద్ధమైన వాదము. ఆజ్ఞాభంగమును సహింపరాదనుట రాజులందఱును అనూచానముగా నేర్చుకొన్న నీతి. మఱియు అవిధేయుతను ఓర్చుకొని యూరకుండుట ప్రాభవము గలవారి ధర్మమును, కర్మమును గాదు. మఱి పోతన్న అవిధేయుఁడైనందుకు అతనినే పూడ్పింపక ఆరాజు గ్రంథమునుమాత్రము పూడ్పించియుండునా యను నాక్షేపణ గలదు. బ్రహ్మహత్య మహాపాతకముగా సింగమనీఁడు భావించియుండవచ్చును. మఱి పూడ్పిం

చుట యేల, కాల్పించఁగూడదా అనియు నడుగవచ్చును. ఇట్టి ప్రశ్న లెన్నైనను ఏకథవిషయమునకైనను వేయవచ్చును. పోతన్నకు వయస్సులో చిన్నవాఁడై సమకాలికుఁడైనవాఁడు తాళ్ళపాక అన్నమాచార్యుఁడు; అతనికంటె భగవద్భక్తి యందుఁగాని, కవితాకౌశలమందుఁగాని యేమియు తక్కువకాని తపస్వి. అతని పదకవితామాధుర్యమునకు ముగ్ధుఁడై పండితప్రియుఁడైన సాళువ నరసింగరాజు వేయివిధముల నతనిని సన్మానించి 'హితునిగా గురునిగా నెల్లబంధులుగ' [1]భావించి పూజించినవాఁడు. ఇతఁడే పినవీరభద్రుని నఖండముగా సన్మానించిన దాత. తుద కేమైనది? శ్రీవేంకటేశ్వరునిపై వ్రాసిన పదములవంటి దొక్కపదము నాపైఁ జెప్పుమని ప్రార్థింపఁగా అన్నమయ్య

"………… హరిహరీ యనుచు
పరమపతివ్రతాభావంబుఁ బూని
హరి ముకుందుని గొనియాడు నాజిహ్వ
నిను గొనియాడంగ నేర దెంతైన
నను నెట్లు పలికి తీనైచ్యంపుఁ బలుకు."[2]

అని తిరుగఁబడఁగా ఆరాజు అతనిని 'మూరురాయరగండసంకెల' వేయించి చెఱలోఁ ద్రోయించినాఁడు! కనుక ఈ ఆభిమానికవాద మంత విమర్శసహము కాదు. హయగ్రీవశాస్త్రిగారికథ పేర్కొనకపోవుటకు హేతువు ఆకాలమందు తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహము ముద్రితముగాకపోవుట కావచ్చును. సర్వజ్ఞ సింగమనాయని వంశీయు లెవరో ప్రోత్సహించి మొదటి కథను కల్పించి గ్రంథగతముగా చేయించుటచే అసలుకథ జనసామాన్యమందు నిలువక మఱవఁబడి యుండవచ్చును. ఇంతేకాని పోతన్నకవితయందు లక్షణదోషములు లేవని స్థాపించుటకై కూచిమంచి తిమ్మకవియే యీకథ కల్పించి గ్రంథగతము చేసినాఁ డను నభిప్రాయము న్యాయ్యముగాఁ దోఁపదు. కనుక పోతన్నగారి గ్రంథపాతమునకు వ్యవహారమునందున్న పై రెండుకారణములలో ఏమైన సత్య ముండెనేని అది నాకీ రెండవదానియందే గోచరించుచున్నది.

సత్య మెందున్నను ఎందును లేకున్నను, పోతన్నగ్రంథము శిథిలమగుటయు, ఇతరులు యథాసంభవముగా దానిని పూరించుటయు మనకు ప్రకృతమైన సత్యము. ఎవరెవ రేయేభాగములఁ బూర్తిచేసినా రను విషయమున సామాన్యముగ పరంపరాగతమైన, గ్రంథగతమైన నిర్ణయ మున్నది. పంచమస్కంధము గంగన్న, షష్ఠస్కంధము సింగన్న, ఏకాదశద్వాదశస్కంధములు నారయ్య రచించినట్లు ముద్రితపుస్తకములలో నున్నది. ఇదిగాక ద్వితీయస్కంధమందలి

1, 2. అన్నమాచార్యుల మనుమఁడు చిన్నన్న రచించిన అన్నమాచార్యచరిత్రము. పు. ౩౨-౩౬. తిరుమలతిరుపతి దేవస్థానమువారు ప్రకటించినది.

౯౨-వ పద్యముతరువాతి భాగము, దశమస్కంధోత్తర భాగమందు ౨౩౭-వ పద్యమునుండి స్కంధాంతమువఱకును గల గ్రంథమును నారయ రచించినట్లు ప్రవాద మున్నది. మఱి కొత్తపల్లి సూర్యారావుగారి ప్రాచీన ప్రకాశనము సాహిత్య పరిషత్తులోని వ్రాతప్రతులలో ఈవిషయముగూడ నిశ్చయింపరాక యథాయథ ముగా నున్నది. మఱి పోతన్నగారిది కుంటు లేక, ధారాళమ్మై, సర్వస్వమై, భావోద్రేకపూరితమైన పరిశుద్ధరచన యనుకొని మనము గ్రంథమును చదువు నప్పుడు పోతన్న రచించిన వనఁబడు భాగములందును ఎన్నో చోటులందు ఇతరుల కైవాడము తేపలుతేపలుగా గ్రంథమందంతటను గలదని తోఁచును. పోతన్న కుల పుస్తకము పురుగులు దిన్నను మన్నుదిన్నను, ఆలోపము అల్పముగాను, అధికముగాను స్వేచ్ఛగా గ్రంథమునంతటిని వ్యాపించుట అనుభవగమ్యమైనదే. కనుకనే గ్రంథమాద్యంతమును అందందు నిస్సారములు, అసంస్కృతములు, పునరుక్తములు, అనన్వితములు అనవలసిన పదవాక్యపద్యములు చదువరుల రసాను భవధార కడ్డుతగులుచున్నవి. గంగ సింగ నారాయణకవుల కవితాసంస్కారము పోతన్నగారి వరవడిలోనే నడచినది. కాని పోతనకుఁ గల ప్రతిభావిశేషము, సహజమైనను సంస్కృతమైన పాండిత్యము, అసాధారణమైన శ్రద్ధాభక్తి తపస్సులును వారికి చాలవు. కాని గురువుగారియందును, గ్రంథమునందును గల భక్తిచే యథాశక్తిగా పూరించి వారు సంపూర్ణభాగవతమును మనకనిచ్చి నారు. ఇంతేకాని పోతన్నయే గ్రంథభాగములను వేఱువేఱుగా శిష్యులు మువ్వు రికి పంచియిచ్చి భక్తిసారమైన భాగములనుమాత్రము తాను రచించినాఁడనియు, దశమస్కంధము ముగించులోపల అతని యాయువు ముగియుటచే ఏకాదశద్వాదశ ములు నారయ పోతన్నయనుమతిచేతనో, లేకయో రచించియుండుననియు శ్రీ నిడదవోలు వేంకటరావుగారు చేయు నూహ కాధారము చాలదు.* ఇతరుల కవిత్వమని స్పష్టముగా నున్న భాగములలో పోతనరచన లనవలసిన భాగము లెన్నో కలవు. ఉదాహరణముగా నారయరచితమయిన ౧౧-వ స్కంధమునందలి యీపద్యమును జూపవచ్చును :—

> "చ. నగుమొగముఁ సుమధ్యమును నల్లని మేనును లచ్చికాటప
> ట్టగు నురముఁ మహాభుజము లంచితకుండలకర్ణముల్ పదే
> భగతియు నీలవేణియుఁ గృపారసదృష్టియుఁ గల్గు వెన్నుఁ డి
> ట్టుగఁ బొడసూపుఁగాతఁ గనుమూసినయప్పుడు, విచ్చినప్పుడున్." (౧౧ ౧-౨౪)

ఇందు పోతన్నవాక్సౌరభ్యము స్పష్టముగా నున్నది. నారాయణకవివైన ఏకాదశ ద్వాదశములలో ఇట్టి పద్య మింకొకటి కంటఁబడదు. (అసలీపద్యము ప్రాంత ముద్రణములలో కానరాదు!)

---

* వావిళ్లవారి ౧౯౨౮-వ సంవత్సరపు ముద్రణము పీఠిక పు. ౯౩.

ఇట్లే పోతన్నదే అనఁబడు నవమస్కంధమందలి యీ పద్యముఁ జూడుఁడు:-

"ఉ, ఆతతమైన పేర్కి దనుజాధిపమంత్రి సురారినందనో
పేతఁ దనూభవం బిలిచి పెండ్లియొనర్చె మహావిభూతికిం
బ్రీతి మహోగ్రజాతికి నభీతికి సాధువినీతికిన్ సిత
ఖ్యాతికి భిన్నదుఃఖబహుకార్యభియాతికి నయ్యయాతికిన్." (౯-౫౩౯)

ఈ యంత్యప్రాసరచన పోతన ననుకరించిన యపక్వబుద్ధి యెవఁడో చేసిన దనుట ప్రత్యేకముగా చెప్పఁబనిలేదు. ఇట్లే నవమస్కంధమందలి శ్రీరామచరిత్రమున ఇతరుల చేతిపని చాల కలదని నా శంక. దశమస్కంధోత్తరభాగమందు, 'సంతత నిర్మలి నాకుశస్థలిన్' (౩౦౭), 'మున్ను దన చౌల నెన్నఁడు' (౩౨౭), 'కచా కరషణముల్' (౩౩౦), 'చిరయశోల్లాసు' (౩౮౦), 'నిర్వాణమూర్తైన' (౧౦౪౯), 'మిథిలనుపురమున' (౧౧౭౭) — ఇత్యాదిప్రయోగములు నిస్సంశయముగా ఇతరుల చేదూర్పులను చాటుచున్నవి.

వ్రాఁతప్రతు లనేకములు సంపాదించి పోల్చి చూచుట, మూలముతో సరి చూచుట, రేఫఱకారములు, సబిందుకనిర్బిందుకప్రాసయతులు, విశిష్టశబ్దవాక్య ప్రయోగములు మొదలగువాని విషయమున ప్రాచీనులు వహించిన స్వాతంత్ర్య మును నిశ్చయించుట - ఇత్యాది పద్ధతులకుఁ దోడుగా పోతన్నరచనను నిర్ణయిం చుటకు ఆతని సీసపద్యములందలి క్రమబద్ధమైన యతినియమముగూడ సహాయ పడునని శ్రీ కీ. శే. వావిలికొలను సుబ్బరావుగారు శోధించిచూపినారు. దానికిఁ దోడు మఱొక్కవిషయముగూడ పేర్కొనవచ్చునని తోఁచుచున్నది. పోతన్న ఆటవెలఁదులను అద్భుతముగా నడిపించిన తెలుఁగుకవులలో నగ్రగణ్యుఁడు. అతని రచనలం దెల్ల సాధారణముగా కానవచ్చు ధర్మము యతిప్రాసల స్థాన ములలో పులుముడు లేక పదములు, వాక్యములును అప్రయత్నముగా ఛందో గతితో అతుకుకొనియుండుట. ఇది తక్కిన యన్ని పద్యములకన్న ఆయన యాటవెలఁదులలో ఎక్కువగాఁ గానవచ్చును. తేటగీతి నతఁ డెక్కువ యభిమా నింపలేదని తోఁచెడిని. సీసపద్యపు ఎత్తుగీతులలోను ఆటవెలఁదులే చాల ఎక్కువ. ప్రథమస్కంధమందు తేటగీతులు ౨౭, ఆటవెలఁదులు ౪౬. ద్వితీయ మందు తే. గీ. లు ౪౩, ఆ. వె. లు ౧౫. కాని ఈ స్కంధమందు చాలభాగము పోతన్నది కాదను వాద మున్నదిగదా. తృతీయచతుర్థములలో ఆటవెలఁదులు చాల తక్కువ. తేటగీతు లెన్నో. మొత్తముమీఁద ఆ రెండుస్కంధముల రచ నయు అంత తృప్తికరము గాదు. ౭, ౮ స్కంధములలో మరల ఆటవెలఁదుల ప్రాబల్యమును గుర్తింపఁగలము. నవమములో తే. గీ. లు ౪౪, ఆ. వె. లు ౯౯! ఈ స్కంధమున ఈ విషయమున ఇంకొక వింత. ౬౯౪-వ 'సేమమే యని సతుల్' అను సీసపు టెత్తుగీతి ఆనంద-వావిళ్ళవారి ముద్రణములం దిట్లున్నది :—

"నూతనాజినంబు నునుపిది మేలని-గోచి విడిచి పసుపుపటముల మిచ్చి
మౌని మరగఁజేసి మాపర్ణశాలకుఁ-బోదమనుచుఁ గొంచుఁబోయి రతని."

ఈ యాటవెలఁదిచోటనే ప్రాంతప్రతులలో ఈ తేటగీతి యున్నది :—

"చర్మవస్త్రము వదలించి ధర్మ్యకాంతి
మించి వెలఁగు పీతాంబర మిచ్చి వెనసు
మనము సొక్కంగ నతనిఁ జేకొనఁగ వారి
మఱఁగునకుఁ జేరె నతఁడు వేమఱిగి వారి" *

ఈ రెంటిలో పైని యాటవెలఁదియే పోతన్నరచన కాఁగలదని చెప్పనక్కఱలేదు గదా. పోతన్నగారి యాటవెలఁదు లెన్నిటి కిట్టి తేటగీతులను తరువాతివారు ప్రత్యామ్నాయము చేసినారో! పోతన్న పేరిటి తేటగీతులలో ఎన్నో యిట్టి కుంటి నడక గలవి కలవు. ఇట్లే దశమస్కంధపు పూర్వభాగమునకంటె ఉత్తరభాగమున తేటగీతుల ప్రాబల్యము గుర్తింపవచ్చును. పోతన తేటగీతి వ్రాయలేడని కాని, చక్కఁగా రచింపలేఁడని కాని నా యభిప్రాయము గాదు. 'చేతులారంగ శివుని బూజింపఁడేని' అను పద్యము ఆయనది కాదని యెవరనఁగలరు? అట్టివి యెన్నో కలవుగూడ. కాని అతని రుచియు, రచనయు ఆటవెలఁదియందు చక్కఁగా కానవచ్చుననుటమాత్రమే నా యిప్పటి మనవి.

ఇఁక పోతన్న వసించిన దేశమునుగూర్చి వావదూకమహాశయులు కొందఱు 'గగనం గగనాకారం'గా చేసిన యుద్ధము ప్రకృతము శాంతించినది. కాన మరల దానికై కాలుద్రవ్వఁబనిలేదు. నా మట్టుకు ఒంటిమిట్ట—యోరుగల్లులు రెంటితోను పోతన్నకు సంబంధ ముండవచ్చునని నమ్ముచున్నాను. రెండుచోట్లను ఆయన యుండినట్లు ప్రవాద మున్నది గనుక, ఇతరసాక్ష్యములును గలవుగావున, ఇట్టి సన్నివేశము ఆకాలమందును, ఈ కాలమందును సంభావ్యమే యగుటచేత, అక్కడివాఁడు కాఁడనికాని, ఇక్కడివాఁడు కాఁడనికాని కొందఱు చేసినట్లు నికరముగా సిద్ధాంతము నేను చేయలేను. మఱి పై రెండుచోట్లుగాక యింక నేస్థలాంతరములందైనను ఆయన జీవితకాలములో భౌతికదేహముతో సంచారము చేసినాఁడో లేదో తెలియదుగాని ఆయన యాధ్యాత్మికతేజస్సు, ఆయన భగవద్భక్తిసుధ, తెలుఁగుదేశమందు సంచరింపని, పావనము చేయని ప్రదేశము లేదు.

తిరుపతి
1-12-53

రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ

* ఆనందముద్రణము ఈ పాఠభేదము నుద్ధరించినది. వావిళ్ళవారిముద్రణలో ఇది లేదు.



# కృతిసమర్పణసమీక్ష

## మహాకవి శ్రీ గడియారము వేంకటశేషశాస్త్రి

(ప్రొద్దుటూరు)

మొన్న రామనవరాత్రికి (16-4-1954) శ్రీమదొంటిమిట్ట కోదండరాముల బ్రహ్మోత్సవమున జరిగిన పోతనవర్ధంతియందు 'రాయలు' ప్రకటనాలయ సంచాలకులు శ్రీ జక్కా సుబ్బరాయఁడుగారు తాము మిగుల వ్యయప్రయాసలకోర్చి ముద్రింపించిన శ్రీమదాంధ్రభాగవత మహాగ్రంథమును శ్రీ పోతన శిలావిగ్రహము నెదుట సమర్పించి గంధపుష్పాక్షత మాల్యాంబరాదులచేఁ బూజించి యలంకరించి వేదపాఠపురస్సరముగ శ్రీకోదండరాముల కంకితము చేయించిరి. ఆ మహోత్సవమునకు సమాహూతులైన కవులను, పండితులను ఖద్దరు సేలువలచే సత్కరించి తలకొక ప్రతిని సమర్పించిరి.

ఆ వైభవమును జూచినపుడు శ్రీ సుబ్బరాయఁడుగా రెంత పుణ్యాత్ముఁడు-ధన్యాత్ముఁడు ననిపించినది. పోతనకవి శ్రీరాముల కీ కృతిసమర్పణ మింత వైభవోపేతముగఁ జేసెనో లేదో మన మెఱుఁగము. ఆ పరమభాగవతుఁడు తన హృదయపుష్పముతోఁ బాటు శ్రీ భాగవత తాళపత్రగ్రంథమును శ్రీరాము నెదుటఁ బెట్టి చేతులు జోడించియుండును. అది ఐకాంతికము - పరమసాత్త్వికము. అదియు సర్వజ్ఞసింగమనాయనివలని బెదరుతో నింత బహిరంగముగా జరిగియుండదేమో! ఆ లోపమును దీర్చుటయేగాక ఆ వైభవమును గన్నులఁగట్టి యూహారమ్యముఁ జేసినాఁ డీసుకృతి. శ్రీరామునియందును, పోతనయందును, భాగవతమునందును గల భక్తిమాత్రమే యిందుకుఁ బ్రోత్సాహకము కాదు. తెనుఁగుదేశమునందును,

తెనుఁగు భాషయందును, వాని యభివృద్ధి వికాసములయందును శ్రీసుబ్బరాయునికిఁ గల భక్తిశ్రద్ధలే ఆయన నీ మహాకార్యమునకుఁ బ్రేరేచినవి. కానిచో ఇంత ధనవ్యయముచేసి, ఇంత నిర్దుష్టముగాఁ బండితులచేఁ బరిష్కరింపించి, ఇంత సర్వాంగసుందరముగ గ్రంథమును ముద్రించి వెలువరించి యుండఁజాలఁడు. ఆహా! ఈమాత్రపు సహాయము పోతన నాఁడు లేకపోయెఁగదా! ఈ పరికర సామగ్రి అప్పుడు పుట్టకపోయెఁగదా! కవులను, గావ్యములను ఈ మాత్రమైన నాదరించు హృదయధర్మ మానాఁడు ప్రజాసామాన్యమునఁ బ్రచలితమైయుండి నదా! యనిపించును. అట్లుండినచో ఆ భాగవతకవి కా తిరస్కారములు, భాగవత మున కన్ని దశావస్థాంతరావతారములు వచ్చియుండెడివి కావు. తప్పులకుప్పలతో అతుకుల బొంతగా మిగిలిన భాగవతమును మన మిప్పు డిట్లు దిద్దుకోవలసిన దురవస్థయు పట్టియుండెడిది కాదు.

ఏమైనను ఈ ప్రకటనకర్త మిగులఁ బ్రయాసపడి గతచరిత్రలో దొరలిన దొసఁగులన్నియుఁ దుడిచి, శ్రీమద్భాగవతమును బరిశుద్ధముగాఁ బ్రసాధితముఁ జేసి ఆంధ్రలోకమున కందించి కృతార్థుఁడైనాఁడు. పూజ్యులు శ్రీ అనంతకృష్ణ శర్మగారు ప్రత్యేక శ్రద్ధాభక్తులతోఁ, బరిపక్వవివేచనతో గ్రంథమును సంస్కరించి తెనుఁగువారి కృతజ్ఞతకుఁ బాత్రులైనారు. ఇఁక మిగిలిన భాగము తెలుఁగువారిది. ఈగ్రంథమును జక్కఁగ నుపయోగించుకొని, భక్తిప్రపత్తులను, భాషావిజ్ఞానములను బొందుటయేకాక ప్రకటనకర్తకు వలసినంత ప్రోత్సాహమీయవలసి యున్నది. శ్రీ సుబ్బరాయఁడుగారితోఁ ద్విగుణితోత్సాహముతో భాషాసేవ చేయవలయు ననియు, భగవానుఁడు వారి కట్టిశక్తిని, దీర్ఘాయురారోగ్యైశ్వర్యములను బ్రసాదించుఁగాక యనియుఁ గోరుచున్నాను.



# మహాకవి పోతన

'సరస్వతీపుత్ర' పుట్టపర్తి నారాయణాచార్యులు

[భాషాశాస్త్రపరిశోధకుఁడు, తిరువాన్కూరు విశ్వవిద్యాలయము]

శ్రీ ఆంధ్రమహాకవులలో పోతన్న యొక్క విశిష్టవ్యక్తి. నన్నయభట్టులు 'జపహోమతత్పరులే' గావచ్చును. తిక్కనామాత్యుఁడు 'నానాగ్రవిహారరసికుఁడై' 'నాదామృతధారాసారరూపుఁడగు' హరిహరనాథుని యడుగుదమ్ములను సేవించియుండవచ్చును. ఆతఁడు కర్మయోగి. ఈ యిర్వురమహాకవుల యుపాసనలును సాంకేతికమైనవి; శాస్త్రీయములు. పోతన్నభక్తి యట్టిది కాదు. ఆతనికి హృదయమే శాస్త్రము; విశ్వాసమే మంత్రము; ఆత్మార్పణమే పూజ. నన్నయ శాపానుగ్రహసమర్థుఁడు; పోతన్న కరుణాలలితహృదయుఁడు. ఆతనికి శాపమన్న నమితభయము. 'తా నెవరి ననుగ్రహింపఁగల' నన్న యమితవినయము.

పోతన్నకు భక్తి తండ్రితాతలనుండి - తరతరములుగ - సంక్రాంతమైనది. అందుచే దాని లోఁతును ఎక్కువ - పాఁతును దక్కువగాదు.

మూలము ననువదించుటలో పోతన్న యనుసరించిన దారు లనేకములు. ఒక్కొకయెడ మూలమునకు మెఱుఁగు వెట్టెను. వ్యాసమహర్షి యొయ్యారములగు పోకలు పోయినచోట తానును ఆతనితో సమానముగ పందెము వేసికొని నడచెను. కొన్నియెడల మూలమునఁగల కాఠిన్యమును దొలఁగించి - తెనిఁగింపున సౌలభ్యమును నింపెను. వ్యాఖ్యానవిషయముల నక్కడక్కడఁ జొప్పించెను. ఒక్కొకసారి - వ్యాఖ్యానకారులతో భేదించి - స్వాభిప్రాయములను వెల్లడించినాఁడు. దశమస్కంధములోని గోపికల 'యున్మాదభక్తి' మొదలైన వర్ణనములలో నాయనస్వకపోలకల్పితము చాల గలదు.

ముఖ్యముగ పోతన్నది 'ప్రాసాదిక' కవిత్వము. అనఁగా భగవదనుజ్ఞతో - తదీయారాధనారూపముగ వ్రాయఁబడినదన్నమాట! ఆ కవితకు తీరుతీయము లేమితక్కువ! కవి ఋష్యంశజుఁడగుటచే మాటతీండ్రయు, వర్చస్సును నా రచనప్రధానగుణములై యుండును. కావ్యరచనయం దాయన ధ్యేయమే వేఱు. తన కొక్కనికే గాదు - తన గ్రంథమును జదువువారికిఁగూడ జన్మరాహిత్యము నాతఁ డుద్దేశించెను. ఎంత గంభీరమైన ఆదర్శము! ఇంతకన్న నుత్తమమైన విశ్వశ్రేయ మేదిగలదు?

పోతన్నభక్తి పరమసాత్త్వికమైనది. 'దయయు', 'సత్యంబు' నాతనికి రెండు బహిఃప్రాణములు. వీరశైవుల రజోగుణప్రేరితమగు విజృంభణపై నాతని కసహ్య మున్నను - శివునిపై నాయనకు ఎడగన్ను లేదు.

'చేతులారంగ శివునిఁ బూజింపఁడేని, నోరునొవ్వంగ హరికీర్తి నుడువఁడేని'

అన్న యుదాత్తలలితమగు సాదర్శ్యముతో శివకేశవాద్వైతమును బండించికొని యనుభవించిన యదృష్టశాలి యాయన. భాగవతరచనకు ముందుగూడ పోతన్న 'మహేశ్వర'ధ్యానమే సేసెను. 'శ్రీకైవల్యపదంబు సేరుటకునై' విష్ణుభక్తిని పట్టెనఁట. మనస్సునందు శ్రీరామభద్రుని సన్నిధానంబు గల్పించుకొన్న మహాకవి యాతఁడు. షష్ఠ్యంతములను గృష్ణపరముగ వ్రాసినాఁడు.

అనఁగా నాతనికి శివకేశవభేదము లేనట్లే రామకృష్ణాద్యవతారభిన్నదృష్టిగూడ లేదన్నమాట. 'సర్వం విష్ణుమయం జగత్' అనెడు ననుభూతిని చక్కఁగ సమన్వయించుకొని యనుభవించినాఁడనుట కింకేమి సాక్ష్యము గావలెను?

పోతన్న మహాకవి పేరిట నీ మూఁడు గ్రంథములు ప్రచారమున నున్నవి. మొదటిది నారాయణ శతకము. దీని రచన భాగవతశైలిలోనే నడచినది. పోతనామాత్యుని దని చెప్పఁబడు 'వీరభద్ర విజయము' మాత్రము ఆయనదని చెప్ప వీలులేదు. 'భోగినీదండకమున' మహాకవి పోతన్న రచనా రీతులు గుప్పలుతిప్పలుగ నున్నవి.

'మనుష్యులను బొగడరా' దను టాతనికి వయస్సుముదిరినవెనుకఁ గలిగిన యూహా; ఈ 'మనుజేశ్వరాధముల' దుశ్చర్యలను గమనించినపిదపఁ గలిగిన యేవగింపు. పోతనామాత్యునకు జన్మతోనే 'యావర్ణ్యములముద్ర' యని నమ్ముట పొరపాటు. 'మహాత్ములు'ను మనవంటి మనుష్యులే.

విష్ణుభక్తికి ప్రథమయోగ్యత యగు దారిద్ర్యము పోతన్నకు వెన్నంటియేయుండినది. దారిద్ర్యము మానవునిపై నొనర్చు దురాగతములకు లెక్కయే లేదు. కాని, వాని కన్నిటి కతఁడు తాళి నిలచెను. తన నిశ్చయమునుండి చలితుఁడు గానేలేదు. కొండలవంటి కష్టములకు జంకలేదు. సింగభూపాలుఁడు దన గ్రంథమును జాతిపెట్టించినను వీసమూ లొంగలేదు. జీవితాంతమువఱకు ధైర్యముగ నిలచినాఁడు.

"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు వాహనంబులుఁ
సొమ్ములు గొన్ని పుచ్చుకొని చొక్కి శరీరమువాసి కాలుచే
సమ్మెటవ్రేటులఁ బడక సమ్మతితో హరికిచ్చి చెప్పె నీ
బమ్మెర పోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్."

అను పద్యమును బొమ్మువిఱిచి పలికి కీర్తికాయుఁడైనాఁడు. అతఁడు కవి! మహాకవి!!
పోతనశైలి నన్నయరచనవలె ఋషివాణి. ఆ శయ్య-ఆ రచన-ఆతనికే చెల్లినది.
అతఁడు భాగవతమున నీపద్యముఁ బలికెను:

"కం. నీపాదకమలసేవయు,-నీపాదార్చకులతోడి నెయ్యమును, నితాం
తాపారభూతదయయును-దాపసమందార! నాకు దయసేయఁగదే?"

పోతన్న భాగవతమును నిష్ఠతోఁ జదివినవాని కంతయు నీభావముదప్పఁ దక్కిన చాపల్యము లన్నియు వదలిపోవు స్థితి వచ్చితీరును.

ఆతని జీవితము స్వర్గంగ. ఆతని కవిత లాగంగాతీరమున నెలకొన్న యుత్తమక్షేత్రములు. ఆజీవితముచే సృష్టి ధన్యమైన ట్లారచనచే శబ్దమయప్రపంచము ధన్యమైనది.

ఇట్టి ఈ భాగవతమును ఇంత కష్టపడి, నష్టమునకైనను నోర్చి, ఆస్తికబుద్ధితో సర్వాంగ సుందరముగ ముద్రించిన మా 'రాయలు అండ్ కో' జక్కా సుబ్బారాయని జీవితమును ధన్యమైనది. ఈ భాగవతమును జదివి పులకించుటకై తెలుఁగునేల కాచికొన్నది.

'త్యాగేనైకే అమృతత్వ మానశుః.'



# విషయసూచిక

విషయము | పుట.



## చతుర్థస్కంధము



## పంచమస్కంధము — ప్రథమాశ్వాసము

విషయము ... ... పుట.



## పంచమస్కంధము – ద్వితీయాశ్వాసము



## షష్ఠస్కంధము



## సప్తమస్కంధము





శ్రీ ర స్తు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## పీ ఠి క

[శ్రీరామభక్తాగ్రేసరుఁడైన బమ్మెరపోతన మహాకవి యా శ్రీరామచంద్రుని యాదేశానుసారముగా శ్రీమహాభాగవతమును దెనుఁగున రచియింపంబూని, తలపెట్టిన యాకార్యము నిర్విఘ్నముగాఁ బరిసమాప్తిఁ గాంచుటకై యాదినిఁ దన యిష్టదేవతల ప్రార్థనఁ జేయుచున్నాఁడు.]

శ్రీకైవల్యపదంబుఁ జేరుటకునై చింతించెదన్ లోకర
క్షైకారంభకు, భక్తపాలనకళాసంరంభకున్, దానవో
ద్రేకస్తంభకుఁ, గేళిలోలవిలసద్దృగ్జాలసంభూతనా
నాకంజాతభవాండకుంభకు, మహానందాంగనాడింభకున్. 1

ఈశ్వర ప్రార్థన

ఉ. వాలిన భక్తి మ్రొక్కెద నవారితతాండవకేళికిన్, దయా
శాలికి, శూలికిన్, శిఖరిజాముఖపద్మమయూఖమాలికిన్,
బాలశశాంకమౌళికిఁ, గపాలికి, మన్మథగర్వపర్వతో
న్మూలికి, నారదాదిమునిముఖ్యమనస్సరసీరుహాళికిన్. 2

బ్రహ్మ ప్రార్థన

ఉ. ఆతతసేవఁ జేసెద సమస్తచరాచరభూతసృష్టివి
జ్ఞాతకు, భారతీహృదయసౌఖ్యవిధాతకు, వేదరాశిని
ర్ణేతకు, దేవతానికరనేతకుఁ, గల్మషజేతకున్, నత
త్రాతకు, ధాతకున్, నిఖిలతాపసలోకశుభప్రదాతకున్. 3

వ. అని నిఖిలభువనప్రధానదేవతావందనంబుఁ జేసి, 4

గణపతి ప్రార్థన

ఉ. ఆదరమొప్ప మ్రొక్కిడుదు నద్రిసుతాహృదయానురాగసం
పాదికి, దోషభేదికిఁ, బ్రపన్నవినోదికి, విఘ్నవల్లికా
చ్ఛేదికి, మంజువాదికి, నశేషజగజ్జననందవేదికిన్,
మోదకఖాదికిన్, సమదమూషకసాదికి, సుప్రసాదికిన్. 5

## సరస్వతీదేవి ప్రార్థన

ఉ. క్షోణితలంబునన్ నుదురు సోఁకఁగ మ్రొక్కి నుతింతు సైకత
శ్రోణికిఁ, జంచరీకచయసుందరవేణికి, రక్షితామర
శ్రేణికిఁ, దోయజాతభవచిత్తవశీకరణైకవాణికిన్,
వాణికి, నక్షదామశుకవారిజపుస్తకరమ్యపాణికిన్. 6

శా. పుట్టం బుట్ట, శరంబునన్ మొలవ, సంభోగానసాత్రంబునన్
నెట్టం గల్గను, గాలిఁ గ్రోల్వను, బురాణింపన్ దొరంకొంటి; నీ
దె ట్టేవెంటఁ జరింతుఁ, దత్సరణి నా కీవమ్మ! యోయమ్మ! మేల్
పట్టున్ నా కగుమమ్మ! నమ్మితిఁ జుమీ బ్రాహ్మీ! దయాంభోనిధీ! 7

ఉ. శారదనీరదేందుఘనసారపటీరమరాళమల్లికా
హారతుషారఫేనరజతాచలకాశఫణీశకుందమం
దారసుధాపయోధిసితతామరసామరవాహినీశుభా
కారత నొప్పు నిన్ను మదిఁ గానఁగ నెన్నఁడు గల్గు భారతీ! 8

ఉ. [1]అంబ! నవాంబుజోజ్జ్వలకరాంబుజ! శారదచంద్రచంద్రికా
డంబరచారుమూర్తి! ప్రకటస్ఫుటభూషణరత్నదీపికా
చుంబితదిగ్విభాగ! శ్రుతిసూక్తివివిక్తనిజప్రభావ! భా
వాంబరవీథివిశ్రుతవిహారిణి! నన్ గృపఁ జూడు భారతీ! 9

## దుర్గాదేవి ప్రార్థన

ఉ. అమ్మలఁ గన్నయమ్మ, ముగురమ్మల మూలపుటమ్మ, చాలఁ బె
ద్దమ్మ, సురారులమ్మకడుపాఱడిపుచ్చిన యమ్మ, దన్ను లో
నమ్మిన వేల్పుటమ్మల మనమ్ముల నుండెడియమ్మ, దుర్గ, మా
యమ్మ కృపాబ్ధి యిచ్చుత మహత్త్వకవిత్వపటుత్వసంపదల్. 10

## లక్ష్మీదేవి ప్రార్థన

మ. హరికిం బట్టపుదేవి, పున్నెములప్రో, [2]వర్థంపుఁబెన్నిక్క, చం
దురుతోఁబుట్టువు, భారతీగిరిసుతల్ దో నాడు పూఁబోఁడి, తా
మరలం దుండెడి ముద్దరాలు, జగముల్ మన్నించు నిల్లాలు, భా
సురతన్ లేములు వాపు తల్లి, సిరి యిచ్చున్ నిత్యకల్యాణముల్. 11

## కవిజన ప్రార్థన

వ. అని యిష్టదేవతలం జింతించి, దినకరకుమారప్రముఖులం దలంచి, ప్రథమ కవితా విరచనవిద్యావిలాసాతిరేకి వాల్మీకి నుతియించి, హయగ్రీవదనుజకర

1. ఈపద్యము మహాభారతమందును గలదు (ఆర. ౪–౨౧౬). రత్నగోచిరా, విహారనసుత్ - అని యందలి పాఠములు. 2. అర్థంపుఁబెన్నిక్క=ఐశ్వర్యమునకు మహానిలయమైనటువంటిది.

పరిమిళితనిగమనివహవిభాగనిర్ణయనిపుణతాసముల్లాసునకు వ్యాసునకు మ్రొక్కి, శ్రీమహాభాగవతకథాసుధారసప్రయోగికి శుకయోగికి నమస్కరించి, మృదుమధుర వచనవర్గపల్లవితస్థాణునకుం బాణునకుం బ్రణమిల్లి, కతిపయశ్లోకసమ్మోదితసూరు మయూరు నభినందించి, మహాకావ్యకరణకళావిలాసుం గాళిదాసుం గొనియాడి, కవికమలరవిన్ భారవిన్ బొగడి, విదళితాఘు మాఘు వినుతించి, యాంధ్రకవితాగౌరవజనమనోహారి నన్నయసూరిం గైవారంబు సేసి, హరిహరచరణారవిందవందనాభిలాషిం దిక్కనమనీషిన్ భూషించి, మఱియు నితరపూర్వకవిజనసంభావనంబు గావించి, వర్తమానకవులకుం బ్రియంబు వలికి, భావికవుల బహూకరించి, యుభయకావ్యకరణదక్షుండనై, 12

## కృతిపతినిర్ణయము

ఉ. [1]"ఇమ్మనుజేశ్వరాధముల కిచ్చి పురంబులు, వాహనంబులున్,
సొమ్ములుఁ గొన్ని పుచ్చుకొని, చొక్కి, శరీరము వాసి, కాలుచే
సమ్మెటవ్రేటులం బడక, సమ్మతితో హరి కిచ్చి, చెప్పె నీ
బమ్మెరపోతరా జొకఁడు భాగవతంబు జగద్ధితంబుగన్. 13

తే. చేతులారంగ శివునిఁ బూజింపఁడేని - నోరు నొవ్వంగ హరికీర్తి నుడువఁడేని
దయయు సత్యంబు లోనుగాఁ దలఁపఁడేని - గలుగ నేటికిఁ దల్లుల కడుపుఁ జేటు?"

## శ్రీరామసాక్షాత్కారము

వ. అని మఱియు మదీయపూర్వజన్మసహస్రసంచితతపఃఫలంబున శ్రీమన్నారాయణ కథాప్రపంచవిరచనాకుతూహలుండనై, యొక్క రాకానిశాకాలంబున సోమోపరాగంబురాకం గని, సజ్జనానుమతంబున నభ్రంకషశుభ్రసముత్తుంగ భంగ యగు గంగకుం జని, క్రుంకులిడి, వెడలి, మహనీయమంజులపులినతలంబున మహేశ్వరధ్యానంబు సేయుచుఁ గించిదున్మీలితలోచనుండనై యున్న యెడ, 15

సీ. మెఱుఁగు చెంగట నున్న మేఘంబుకైవడి నువిద చెంగట నుండ నొప్పువాఁడు,
చంద్రమండలసుధాసారంబుపోలిక ముఖమునఁ జిఱునవ్వు మొలచువాఁడు,
వల్లీయుతతమాలవసుమతీజముభంగి బలువిల్లు మూఁపునఁ బరఁగువాఁడు,
నీలనగాగ్రసన్నిహితభానునిభంగి ఘనకిరీటము దలఁ గలుగువాఁడు,

ఆ. పుండరీకయుగముఁ బోలు కన్నులవాఁడు - వెడఁదయురమువాఁడు, విపులభద్ర
మూర్తివాఁడు, రాజముఖ్యుఁ డొక్కరుఁడు నా - కన్నుఁగవకు నెదురఁ గానఁబడియె.

1. ఈ పద్యము బమ్మెరపోతరాజు వ్రాసినది కాదందురు. చాటువులలోనుండి వచ్చినదని కొందఱి యభిప్రాయము.

వ. ఏను నారాజశేఖరుం దేఱిచూచి, భాషింప యత్నంబు సేయునెడ, నతఁడు “నే రామభద్రుండ, మన్నామాంకితంబుగా శ్రీమహాభాగవతంబుఁ దెనుంగు సేయుము, నీకు భవబంధంబులు దెగు” నని యానతిచ్చి తిరోహితుం డయిన, సమున్మీలితనయనుండ నై, వెఱఁగుపడి, చిత్తంబున, 17

క. “పలికెడిది భాగవత మఁట, – [1]పలికించు విభుండు రామభద్రుం డఁట, నేఁ
బలికిన భవహర మగు నఁట; – పలికెద; వేఱొండుగాథ పలుకఁగ నేలా ? 18

ఆ. భాగవతము దెలిసి పలుకుట చిత్రంబు – శూలికైనఁ, దమ్మిచూలికైన
విబుధజనులవలన విన్నంతఁ గన్నంతఁ – దెలియ వచ్చినంతఁ దేటపఱతు. 19

క. కొందఱకుఁ దెనుఁగు [2]గుణమగుఁ;–గొందఱకును సంస్కృతంబు గుణమగు; రెండుం
గొందఱకు గుణములగు; నే–నందఱ మెప్పింతుఁ గృతుల నయ్యైయెడలన్. 20

మ. ఒనరన్ నన్నయతిక్కనాదికవు లీయుర్విం బురాణావళుల్
దెనుఁగుం జేయుచు మత్పురాకృతశుభాధిక్యంబు దా నెట్టిదో
తెనుఁగుం జేయరు మున్ను భాగవతమున్; దీనిం దెనింగించి నా
జననంబున్ సఫలంబుఁ జేసెదఁ బునర్జన్మంబు లేకుండఁగన్. 21

మ. లలితస్కంధము, కృష్ణమూలము, శుకాలాపాభిరామంబు, మం
జులతాశోభితమున్, సువర్ణసుమనస్సుజ్ఞేయమున్, సుందరో
జ్జ్వలవృత్తంబు, మహాఫలంబు, విమలవ్యాసాలవాలంబు నై
వెలయున్ భాగవతాఖ్యకల్పతరు వుర్విన్ సద్ద్విజశ్రేయ మై. 22

వ. ఇట్లు భాసిల్లెడు శ్రీమహాభాగవతపురాణపారిజాతపాదపసమాశ్రయంబునను, హరికరుణావిశేషంబునను గృతార్థత్వంబు సిద్ధించె”నని బుద్ధి నెఱింగి, లేచి, మరలి కొన్నిదినంబులకు నేకశిలానగరంబునకుం జనుదెంచి, యందు గురువృద్ధ బుధ బంధుజనానుజ్ఞాతుండ నై, 23

## కృతికర్తృవంశవర్ణన

సీ. కౌండిన్యగోత్రసంకలితుఁ, డాపస్తంబసూత్రుండు, పుణ్యుఁడు, సుభగుఁ డైన
భీమనమంత్రికిఁ బ్రియపుత్త్రుఁ డన్నయ; కలకంఠి తద్భార్య గౌరమాంబ
కమలాప్తు వరమునఁ గనియె సోమనమంత్రి; వల్లభ మల్లమ; వారి తనయుఁ
డెల్లన; యతనికి నిల్లాలు మాచమ; వారిపుత్త్రుఁడు వంశవర్ధనుండు,
ఆ. లలితమూర్తి, బహుకళానిధి కేసన – దానమాననీతిధనుఁడు, ఘనుఁడు
దనకు లక్కమాంబ ధర్మగేహిని గాఁగ – మనియె; శైవశాస్త్రమతముఁ గనియె.

1. ‘పలికించెడువాఁడు’ అని పాఠాంతరము. 2. గుణమగున్ = ఇష్టమగును.

క. నడవదు నిలయము వెలువడి; – తడవదు పరపురుషు గుణముఁ; దనపతినుడువుం
గడవదు; వితరణకరుణలు – విడువదు లక్కాంబ విబుధవిసరము వొగడన్. 25

ఉ. మానిను లీడు గారు బహుమాననివారితదీనమానస
గ్లానికి, దానధర్మమతిగౌరవమంజులతాగభీరతా
స్థానికి, ముద్దుసానికి, సదాశివపాదయుగార్చనానుకం
పానయవాగ్భవానికిని బమ్మెర కేసయలక్కసానికిన్. 26

క. ఆమానినికిం బుట్టితి – మే మిరువుర; మగ్రజాతుఁ డీశ్వర సేవా
కాముఁడు తిప్పన; పోతన – నామవ్యక్తుండ సాధునయయుక్తుండన్. 27

వ. అయిన నేను నాచిత్తంబున శ్రీరామచంద్రునిసన్నిధానంబుఁ గల్పించుకొని, 28

షష్ఠ్యంతములు

ఉ. హారికి, నందగోకులవిహారికిఁ, జక్రసమీరదైత్యసం
హారికి, భక్తదుఃఖపరిహారికి, గోపనితంబినీమనో
హారికి, దుష్టసంపదపహారికి, ఘోషకుటీపయోఘృతా
హారికి, బాలకగ్రహమహాసురదుర్వనితాప్రహారికిన్. 29

ఉ. శీలికి, నీతిశాలికి, వశీకృతశూలికి, బాణహస్తని
ర్మూలికి, ఘోరనీరదవిముక్తశిలాహతగోపగోపికా
పాలికి, వర్ణధర్మపరిపాలికి, నర్జునభూజయుగ్మసం
చాలికి, మాలికిన్, విపులచక్రనిరుద్ధమరీచిమాలికిన్. 30

ఉ. క్షంతకుఁ, గాళియోరగవిశాలఫణావళినర్తనక్రియా
రంతకు, నుల్లసన్మగధరాజచతుర్విధఘోరవాహినీ
హంతకు, నింద్రనందననియంతకు, సర్వచరాచరావళీ
మంతకు, నిర్జితేంద్రియసమంచితభక్తజనానుగంతకున్. 31

ఉ. న్యాయికి, భూసురేంద్రమృతనందనదాయికి, రుక్మిణీమనః
స్థాయికి, భూతసమ్మదవిధాయికి, సాధుజనానురాగసం
ధాయికిఁ, బీతవస్త్రపరిధాయికిఁ, బద్మభవాండభాండని
ర్మాయికి, గోపికానివహమందిరయాయికి, శేషశాయికిన్. 32

వ. సమర్పితంబుగా నే నాంధ్రంబున రచియింపం బూనిన శ్రీమహాభాగవతపురాణం
బునకుం గథాప్రారంభం బెట్టి దనిన. 33



శ్రీరస్తు

శ్రీకృష్ణాయ నమః

# శ్రీమదాంధ్రభాగవతము

## ప్రథమస్కంధము

### కథాప్రారంభము

సీ. విశ్వజన్మస్థితివిలయంబు లెవ్వనివలన నేర్పడు నను వర్తనమున
వ్యావర్తనమునఁ గార్యములం దభిజ్ఞుఁడై తాన రాజగుచుఁ జిత్తమునఁ జేసి
వేదంబు లజునకు విదితముల్ గావించె నెవ్వఁడు; బుధులు మోహింతు రెవ్వ
నికి; నెండమావుల నీళ్లఁ గాచాదుల నన్యోన్యబుద్ధి దా నడరునట్లు
ఆ. త్రిగుణసృష్టి యెందు దీపించి సత్యము - భంగిఁ దోఁచు; స్వప్రభానిరస్త
కుహకుఁ డెవ్వఁ డతనిఁ గోరి చింతించెద-ననఘు, సత్యుఁ, బరుని ననుదినంబు. 1

వ. ఇట్లు "సత్యం పరం ధీమహి" యను గాయత్రీప్రారంభంబున గాయత్రీనామ
బ్రహ్మస్వరూపంబై మత్స్యపురాణంబులోనగాయత్రి నధికరించి ధర్మవిస్తరంబును,
వృత్రాసురవధంబును నెందుఁ జెప్పంబడు నదియ భాగవతం బని పలుకుటం జేసి
యీపురాణంబు శ్రీమహాభాగవతం బన నొప్పుచుండు. 2

సీ. శ్రీమంతమై మునిశ్రేష్ఠకృతంబైన భాగవతంబు సద్భక్తితోడ
వినఁ గోరువారల విమలచిత్తంబులఁ జెచ్చెర నీశుఁడు చిక్కుఁ గాక;
యితరశాస్త్రంబుల నీశుండు చిక్కునే; మంచివారలకు, నిర్మత్సరులకుఁ
గపటనిర్ముక్తులై కాంక్ష సేయకయును దగిలి యుండుట మహాతత్త్వబుద్ధిఁ
తే. బరఁగనాధ్యాత్మికాదితాపత్రయంబు-నడఁచి పరమార్థభూతమై యధికసుఖద
మైనసమస్తంబుఁ గాకయు నయ్యునుండు-వస్తువెఱుఁగంగఁ దగు భాగవతమునందు.
ఆ. వేదకల్పవృక్షవిగళితమై శుక-ముఖసుధాద్రవమున మొనసియున్న
భాగవతపురాణఫలరసాస్వాదన-పదవిఁ గనుఁడు రసికభావవిదులు! 4

క. పుణ్యంబై, మునివల్లభ-గణ్యంబై, కుసుమఫలనికామోత్థితసా
ద్గుణ్యమయి, నైమిశాఖ్యా-రణ్యంబు నుతింపఁ దగు నరణ్యంబులలోన్. 5

వ. మఱియును మధువైరిమందిరంబునుంబోలె మాధవీమన్మథహితంబై, బ్రహ్మ
గేహంబునుంబోలె శారదాన్వితంబై, నీలగళసభానికేతనంబునుంబోలె వహ్ని
వరుణ సమీరణ చంద్ర రుద్ర హైమవతీ కుబేర వృషభ గాలవ శాండిల్య పాశు
పత జటిపటలమండితంబై, బలభేదిభవనంబునుంబోలె నైరావతామృతరంభా
గణికాభిరామంబై, మురాసురనిలయంబునుంబోలె నున్మత్తరాక్షసవంశసంకు

లం బై, ధనదాగారంబునుంబోలె శంఖపద్మకుందముకుందసుందరంబై, రఘురాము యుద్ధంబునుంబోలె నిరంతరశరానలశిఖాబహుళంబై, పరశురాము భండనంబునుంబోలె నర్జునోద్భేదం బై, దానవసంగ్రామంబునుంబోలె నరిష్టజంభనికుంభశక్తియుక్తం బై, కౌరవసంగరంబునుంబోలె ద్రోణార్జునకాంచనస్యందనకదంబసమేతంబై, కర్ణు కలహంబునుంబోలె మహోన్నతశల్యసహకారం బై, సముద్రసేతుబంధనంబునుంబోలె నలనీలపనసాదిప్రదీపితంబై, భర్గు [1]భజనంబునుంబోలె [2]నానాశోకలేఖాఫలితంబై, మరుని కోదండంబునుంబోలెఁ బున్నాగశిలీముఖభూషితంబై, నరసింహరూపంబునుంబోలెఁ గేసరకరజకాంతంబై, నాట్యరంగంబునుంబోలె నటనటీసుషిరాన్వితంబై, శైలజానిటలంబునుంబోలెఁ జందనకర్పూరతిలకాలంకృతంబై, వర్షాగమంబునుంబోలె నింద్రబాణాసనమేఘకరకకమనీయంబై, నిగమంబునుంబోలె గాయత్రీవిరాజితంబై, మహాకావ్యంబునుంబోలె సరళమృదులతాకలితంబై, వినతానిలయంబునుంబోలె సుపర్ణరుచిరంబై, యమరావతీపురంబునుంబోలె సుమనోలలితంబై, కైటభోద్యోగంబునుంబోలె మధుమానితంబై, పురుషోత్తమసేవనంబునుంబోలె నమృతఫలదంబై, ధనంజయసమీకంబునుంబోలె నభ్రంకషపరాగంబై, వైకుంఠపురంబునుంబోలె ఖడ్గపుండరీకవిలసితంబై, నందఘోషంబునుంబోలెఁ గృష్ణసారసుందరంబై, లంకానగరంబునుంబోలె రామమహిషీవంచకసమంచితంబై, సుగ్రీవసైన్యంబునుంబోలె గజగవయశరభశోభితంబై, నారాయణస్థానంబునుంబోలె నీలకంఠహంసకౌశికశుకభరద్వాజతిత్తిరిభాసురంబై, మహాభారతంబునుంబోలె నేకచక్ర బకకంకధార్తరాష్ట్రశకునినకులసంచారసమ్మిళితంబై, సూర్యరథంబునుంబోలె నురుతరప్రవాహంబై, జలదకాలసంధ్యాముహూర్తంబునుంబోలె బహువితతజాతిసౌమనస్యంబై యొప్పు నైమిశారణ్యంబను శ్రీవిష్ణుక్షేత్రంబునందు శౌనకాదిమహామునులు స్వర్లోకగీయమానుం డగు హరిం జేరుకొఱకు సహస్రవర్షంబు లనుష్ఠానకాలంబుగాఁగల సత్త్రసంజ్ఞికంబైన యాగంబు సేయుచుండి; రం దొక్కనాఁడు వారలు రేపకడ నిత్యనైమిత్తిక హోమంబు లాచరించి, సత్కృతుం డై, సుఖాసీనుండై యున్న సూతుం జూచి,

క. ఆ తాపసు లిట్లనిరి వి-నీతున్, విజ్ఞానఫణితనిఖిల పురాణ
వ్రాతున్, నుతహరిగుణసం-ఘాతున్, సూతున్, నితాంతకరుణోపేతున్ : 7

మ. "సమతం దొల్లి పురాణ పంక్తు లితిహాసశ్రేణులున్, ధర్మశా
స్త్రములున్ నీవ యుపన్యసింపుదువు; వేదవ్యాసముఖ్యుల్ మునుల్
సుమతుల్ సూచిన వెన్ని యన్నియును దోఁచున్ నీమదిం; దత్ప్రసా
దమునం జేసి యెఱుంగ నేర్తువు సమస్తంబున్ బుధేంద్రోత్తమా! 8

1. భజనము=సేవ. 2. అశోకము=శోకము కానిది; సుఖము. (ఆ సుఖముల) లేఖ=సమూహము.

క. గురువులు ప్రియశిష్యులకుం - బరమరహస్యములు దెలియఁ బలుకుదు; రచల
స్థిరకల్యాణం బెయ్యది - పురుషులకును? నిశ్చయించి బోధింపు తగన్. 9

క. మన్నాఁడవు చిరకాలము; - గన్నాఁడవు పెక్కులైన గ్రంథార్థంబుల్;
విన్నాఁడవు వినఁదగినవి; - యున్నాఁడవు పెద్దలొద్ద నుత్తమగోష్ఠిన్. 10

చ. అలసులు, మందబుద్ధిబలు, లల్పతరాయువు, లుగ్రరోగసం
కలితులు, మందభాగ్యులు, సుకర్మము లెవ్వియుఁ జేయఁజాల రీ
కలియుగమందు మానవులు; గావున నెయ్యది సర్వసౌఖ్యమై
యలవడు? నేమిటం బొడము నాత్మకు శాంతి? మునీంద్ర! చెప్పవే. 11

సీ. ఎవ్వని యవతార మెల్లభూతములకు సుఖమును, వృద్ధియు సొరిదిఁ జేయు?
నెవ్వని శుభనామ మేప్రొద్దు నుడువంగ సంసారబంధంబు సమసిపోవు?
నెవ్వని చరితంబు హృదయంబుఁ జేర్పంగ భయమంది మృత్యువు పరువువెట్టు?
నెవ్వని పదనది నేపారు జలముల సేవింప నైర్మల్యసిద్ధి గలుగుఁ?
తే. దపసు లెవ్వని పాదంబు దగిలి శాంతి - దెరువుఁ గాంచిరి? వసుదేవదేవకులకు
నెవ్వఁ డుదయించెఁ? దత్కథ లెల్ల వినఁగ - నిచ్చపుట్టెడు; నెఱిఁగింపు మిద్ధచరిత!

క. భూషణములు వాణికి, నఘ - పేషణములు, మృత్యుచిత్తభీషణములు, హృ
త్తోషణములు, కల్యాణవి - శేషణములు, హరిగుణోపచితభాషణముల్. 13

క. కలిదోషనివారణమై - యలఘుయశుల్ వొగడునట్టి హరికథనము ని
ర్మలగతిఁ గోరెడు పురుషుఁడు - వెలయఁగ నెవ్వాఁడు దగిలి వినఁడు? మహాత్మా!

ఆ. అనఘ! విను, రసజ్ఞులై వినువారికి - మాటమాట కధికమధురమైన
యట్టి కృష్ణుకథన మాకర్ణనము సేయఁ - దలఁపు గలదు; మాకుఁ దనివి సనదు.

మ. వరగోవిందకథాసుధారసమహావర్షోరుధారాపరం
పరలం గాక బుధేంద్రచంద్ర! యితరోపాయానురక్తిం బ్రవి
స్తరదుర్దాంతదురంతదుస్సహజనుస్సంభావితానేకదు
స్తరగంభీరకఠోరకల్మషకనద్దావానలం బాఱునే? 16

సీ. హరినామకథనదావానలజ్వాలలఁ గాలవే ఘోరాఘకాననములు?
వైకుంఠదర్శనవాయుసంఘములచేఁ దొలఁగవే భవదుఃఖతోయదములు?
కమలనాభధ్యానకంఠీరవంబుచేఁ గూలవే సంతాపకుంజరములు?
నారాయణస్మరణప్రభాకరదీప్తిఁ దీఱవే షడ్వర్గతిమిరతతులు?
ఆ. నలిననయనభక్తినావచేఁ గాక సం - సారజలధి దాఁటి చనఁగ రాదు;
వేయు నేల? మాకు విష్ణుప్రభావంబుఁ - దెలుప వయ్య! సూత! ధీసమేత! 17

వ. మఱియుఁ గపటమానవుండును, గూఢుండునైన మాధవుండు రామసహితుండై యతిమానుషంబులైన పరాక్రమంబులు సేసె నఁట, వాని వివరింపుము.

కలియుగంబు రాఁగల దని వైష్ణవక్షేత్రంబున దీర్ఘసత్త్రనిమిత్తంబున హరికథలు విన నెడ గలిగి నిలిచితిమి; దైవయోగంబున, 18

క. జలరాశి దాఁటఁ గోరెడి - [1]కలముజనుల్ కర్ణధారుఁ గాంచినభంగిం
గలిదోషహరణవాంఛా - కలితుల మగు మేము నిన్నుఁ గంటిమి సూతా! 19

క. చారుతరధర్మరాశికి - భారకుఁ డగు కృష్ణుఁ డాత్మపదమున కేఁగన్
భారకుఁడు లేక యెవ్వనిఁ - జేరెను ధర్మంబు బలుపు సెడి మునినాథా!" 20

సూతుని నారాయణకథాప్రశంస

వ. అని యిట్లు మహనీయగుణగరిష్ఠు లయిన శౌనకాదిమునిశ్రేష్ఠు లడిగిన, రోమహర్షణపుత్త్రుం డయి, యుగ్రశ్రవసుం డను పేర నొప్పి, నిఖిలపురాణవ్యాఖ్యాన వైఖరీసమేతుం డైన సూతుండు, 21

మ. "సముఁ డై, యెవ్వఁడు, ముక్తకర్మచయుఁ డై, సన్న్యాసి యై, యొంటి వో
వ [2]మహాభీతి 'నోహో కుమార' యనుచున్ వ్యాసుండు చీరంగ వృ
క్షములుం దన్మయతం బ్రతిధ్వనులు చక్కం జేసె ము; న్నట్టి భూ
తమయున్ మ్రొక్కెద బాదరాయణిఁ దపోధన్యాగ్రణిన్, ధీమణిన్. 22

సీ. కార్యవర్గంబును, గారణసంఘంబు నధికరించి చరించు నాత్మతత్త్వ
మధ్యాత్మ మనఁబడు; నట్టియధ్యాత్మ్ముఁ దెలియఁజేయఁగఁ జాలు దీపమగుచు
సకలవేదములకు సారాంశ మై, యేక మై, యసాధారణ మగు ప్రభావ
రాజకం బైన పురాణమర్మంబును గాఢసంసారాంధకారపటలి

తే. దాఁటఁ గోరెడివారికి దయ దలిర్ప - నేతపోనిధి వివరించె నేర్పడంగ;
నట్టి శుకనామధేయు, మహాత్మగేయు-విమలవిజ్ఞానరమణీయు వేడ్కఁ గొలుతు.

క. నారాయణునకు, నరునకు, - భారతికిని మ్రొక్కి, వ్యాసు పదములకు నమ
స్కారము సేసి, వచింతు ను - దార గ్రంథంబు దళితతనుబంధంబున్." 24

వ. అని యిట్లు దేవతాగురునమస్కారంబు సేసి యి ట్లనియె: "మునీంద్రులారా! నన్ను మీరలు నిఖిలలోక మంగళం బయిన ప్రయోజనం బడిగితి; రేమిటం గృష్ణసంప్రశ్నంబు సేయంబడు? నెవ్విధంబున నాత్మ ప్రసన్నం బగు?నిర్విఘ్నయు, నిర్హేతుకయు నైన హరిభక్తి యేరూపంబునం గలుగు? నది పురుషులకుఁ బరమ ధర్మం బగు; వాసుదేవునియందుఁ బ్రయోగింపఁబడిన భక్తియోగంబు వైరాగ్య విజ్ఞానంబులఁ బుట్టించు; నారాయణకథల నెయ్యేధర్మంబులు దగులువడ వవి నిరర్థకంబు; లపవర్గపర్యంతంబయిన యీ పరధర్మంబునకు దృష్టశ్రుతప్రపంచా ర్థంబు ఫలంబు గాదు; ధర్మంబునం దవ్యభిచారి యైన యర్థంబునకుఁ గామంబు ఫలంబు గాదు; విషయభోగంబైన కామంబున కింద్రియప్రీతి ఫలంబు గా;

1. కలముజనులు = ఓడప్రయాణికులు. 2. పాఠాంతరము : మహాప్రీతి.

దెంతతడవు జీవించు నంతియ కామంబునకు ఫలంబు; తత్త్వజిజ్ఞాస గల జీవునకుఁ
గర్మంబులచేత నెయ్యది సుప్రసిద్ధం బది నిరర్థకంబు; తత్త్వజిజ్ఞాస యనునది ధర్మ
జిజ్ఞాస యగుటఁ గొందఱు ధర్మంబే తత్త్వంబని పలుకుదురు; తత్త్వవిదులు జ్ఞానం
బను పేర నద్వయంబైన యది తత్త్వం బని యెఱుంగుదురు; ఆ తత్త్వంబు నౌపనిష
దులచేత బ్రహ్మమనియు, హైరణ్యగర్భులచేతం బరమాత్మ యనియు, సాత్వతుల
చేత భగవంతుం డనియును బలుకంబడు; వేదాంతశ్రవణంబున గ్రహింపంబడి
జ్ఞానవైరాగ్యంబులతోడం గూడిన భక్తిచేతఁ దత్పరులైన పెద్దలు క్షేత్రజ్ఞుండైన
యాత్మయందుఁ బరమాత్మం బొడగందురు; ధర్మంబునకు భక్తి ఫలంబు; పురుషులు
వర్ణాశ్రమధర్మభేదంబులం జేయు ధర్మంబునకు మాధవుండు సంతోషించుటయె
సిద్ధి; యేకచిత్తంబున నిత్యంబును గోవిందు నాకర్ణింపను, వర్ణింపనుం దగుఁ; జక్రా
యుధధ్యానం బను ఖడ్గంబున వివేకవంతు లహంకారనిబద్ధంబైన కర్మంబు ద్రుంచి
వైతురు; భగవంతునియందలి శ్రద్ధయు, నపవర్గదంబగు తత్కథాశ్రవణాదులయం
దత్యంతాసక్తియుఁ బుణ్యతీర్థావగాహనమహత్సేవాదులచే సిద్ధించు కర్మనిర్మూలన
హేతువులైన కమలలోచను కథలం దెవ్వండు రతిసేయు, విన నిచ్ఛగించు వాని
కితరంబు లెవ్వియు రుచిపుట్టింప నేరవు; పుణ్యశ్రవణకీర్తనుండైన కృష్ణుండు
దనకథలు వినువారి హృదయంబులందు నిలిచి శుభంబు లాచరించు; నశుభం
బులు పరిహరించు; నశుభంబులు నష్టంబు లయిన భాగవతసేవావిశేషంబున
నిశ్చలభక్తి యుదయించు; భక్తి గలుగ రజస్తమోగుణప్రభూతంబులైన కామ
లోభాదులకు వశంబుగాక చిత్తంబు సత్త్వగుణంబునఁ బ్రసన్నం బగుఁ; బ్రసన్న
మనస్కుండైన ముక్తసంగుం డగు; ముక్తసంగుం డైన నీశ్వరతత్త్వజ్ఞానంబు
సిద్ధించు; నీశ్వరుండు గానంబడినఁ జిజ్జడగ్రథనరూపంబైన యహంకారంబు
భిన్నంబగు; నహంకారంబు భిన్నంబైన నసంభావనాదిరూపంబులగు సంశయం
బులు విచ్ఛిన్నంబులగు; సంశయవిచ్ఛేదంబైన ననారబ్ధఫలంబులైన కర్మంబులు
నిశ్శేషంబులై నశించుం గావున, 25

క. గురుమతులు తపసు లంతః-కరణంబుల శుద్ధి సేయ ఘనతరభక్తిన్
హరియందు సమర్పింతురు-పరమానందమున భిన్నభవబంధనులై. 26

తరలము. పరమపూరుషుఁ డొక్కఁ డాఢ్యుఁడు పాలనోద్భవనాశముల్
సొరిదిఁ జేయ ముకుంద పద్మజ శూలి సంజ్ఞలఁ బ్రాకృత
స్ఫురితసత్త్వరజస్తమంబులఁ బొందు; నందు శుభస్థితుల్
హరి చరాచరకోటి కిచ్చు ననంతసత్త్వనిరూఢుఁ డై. 27

వ. మఱియు నొక్క విశేషంబు గలదు : కాష్ఠంబుకంటె ధూమంబు, ధూమంబుకంటెఁ
ద్రయీమయం బయిన వహ్ని యెట్లు విశేషం బగు; నట్లు తమోగుణంబుకంటె
రజోగుణంబు, రజోగుణంబుకంటె బ్రహ్మప్రకాశకం బగు సత్త్వగుణంబు విశిష్టం

బగుచు; దొల్లి మునులు సత్త్వమయుం డని భగవంతు హరి నధోక్షజుం గొలిచిరి; కొందఱు సంసారమందలి మేలుకొఱకు నన్యుల సేవింతురు; మోక్షార్థు లయిన వారలు ఘోరరూపు లయిన భూతపతుల విడిచి దేవతాంతరనింద సేయక శాంతు లయి నారాయణకథలయందుం బ్రవర్తింతురు; కొందఱు రాజసతామసు లయి సిరియు, నైశ్వర్యంబును, బ్రజలనుం గోరి పితృభూతప్రజేశాదుల నారాధింతురు; మోక్ష మిచ్చుటం జేసి నారాయణుండు సేవ్యుండు; వేద యాగ యోగ క్రియా జ్ఞాన తపోగతి ధర్మంబులు వాసుదేవపరంబులు; నిర్గుణుం డయిన పరమేశ్వరుండు గలుగుచు లేకుండుచుఁ ద్రిగుణంబులతోడం గూడిన తన మాయచేత నింతయు సృజియించి గుణవంతునిచందంబున నిజమాయావిలసితంబు లయిన గుణంబులలోఁ బ్రవేశించి విజ్ఞానవిజృంభితుండై వెలుంగు; నగ్ని యొక్కరుం డయ్యుఁ బెక్కు మ్రాఁకులందుఁ దేజరిల్లుచుఁ బెక్కండ్రై తోఁచుతెఱంగున విశ్వాత్మకుండైన పురుషుం డొక్కండ తనవలనం గలిగిన నిఖిలభూతంబులందు నంతర్యామిరూపంబున నెసంగు; నతండు మనోభూతసూక్ష్మేంద్రియంబుల తోడంగూడి, గుణమయంబులగు భావంబులం దనచేత నిర్మితంబులైన భూతంబు లందుఁ దగులువడక తద్గుణంబు లనుభవంబు సేయు; లోకకర్తయైన యతండు దేవతిర్యఙ్మనుష్యాదిజాతులందు లీల నవతరించి లోకంబుల రక్షించు" నని మఱియు సూతుం డిట్లనియె : 28

సీ. "మహదహంకారతన్మాత్రసంయుక్తుఁడై చారుషోడశకళాసహితుఁ డగుచుఁ,
బంచమహాభూతభాసితుండై, శుద్ధసత్త్వుఁడై, సర్వాతిశాయి యగుచుఁ,
జరణోరుభుజముఖశ్రవణాక్షినాసాశిరములు నానాసహస్రములు వెలుఁగ,
నంబర కేయూర హార కుండల కిరీటాదులు పెక్కువే లమరుచుండఁ,

తే. బురుషరూపంబు ధరియించి పరుఁ డనంతుఁ-డఖిలభువనైకవర్తనయత్నమమర,
మానితోదారజలరాశిమధ్యమునను-యోగనిద్రావిలాసి యై యొప్పుచుండు. 29

## భగవంతుని ఇరువదియొక యవతారములు

వ. అది సకలావతారంబులకు మొదలిగని యైన శ్రీమన్నారాయణదేవుని విరాజమానం బయిన దివ్యరూపంబు; దానిం బరమయోగీంద్రులు దర్శింతురు; రప్పరమేశ్వరు నాభికమలంబువలన సృష్టికర్తలలోన శ్రేష్ఠుండైన బ్రహ్మ యుదయించె; నతని యవయవస్థానంబులయందు లోకవిస్తారంబులు గల్పింపంబడియె; మొదల నద్దేవుండు కౌమారాఖ్యసర్గంబు నాశ్రయించి బ్రహ్మణ్యుండై దుశ్చరంబైన బ్రహ్మచర్యంబు చరియించె; రెండవమాఱు జగజ్జననంబుకొఱకు రసాతలగత యయిన భూమి నెత్తుచు యజ్ఞేశుం డయి వరాహదేహంబు దాల్చె; మూఁడవ తోయంబున నారదుం డను దేవర్షి యై కర్మనిర్మోచకంబైన నైష్ణవతంత్రంబు

సెప్పె; నాలవపరి ధర్మభార్యాసర్గంబునందు నరనారాయణాభిధానుండై దుశ్చరంబైన తపంబు సేసెఁ; బంచమావతారంబునం గపిలుం డను సిద్ధేశుం డయి, యాసురి యను బ్రాహ్మణునకుఁ దత్త్వగ్రామనిర్ణయంబు గల సాంఖ్యంబు నుపదేశించె;నాఱవశరీరంబున ననసూయాదేవియందు నత్రిమహామునికిం గుమారుండై, యలర్కునికిఁ బ్రహ్లాదముఖ్యులకు నాత్మవిద్యఁ దెలిపె; నేడవ విగ్రహంబున నాకూతియందురుచికిజన్మించి,యజ్ఞుం డనఁ బ్రకాశమానుండై యామాదిదేవతలతోడం గూడ స్వాయంభువమన్వంతరంబు రక్షించె; నష్టమమూర్తిని మేరుదేవియందు నాభికి జన్మించి, యురుక్రముం డనం బ్రసిద్ధుండై విద్వజ్జనులకుఁ బరమహంసమార్గంబుం బ్రకటించె; ఋషులచేతఁ గోరంబడి తొమ్మిదవజన్మంబునఁ బృథుచక్రవర్తియై, భూమిని ధేనువుం జేసి, సమస్తవస్తువులం బిదికెఁ; జాక్షుషమన్వంతర సంప్లవంబున దశమం బయిన మీనావతారంబు నొంది, మహీమయం బగు నావ నెక్కించి వైవస్వతమనువు నుద్ధరించె; సముద్రమథనకాలంబునం బదునొకండవ మాఱు కమఠాకృతిని మందరాచలంబుఁ దన పృష్ఠకర్పరంబున నేర్పరియై నిలిపె; ధన్వంతరి యనఁ బండ్రెండవతనువున సురాసురమథ్యమాన క్షీరపాథోధి మధ్యభాగంబున నమృతకలశహస్తుండై వెడలెఁ; బదుమూఁడవది యయిన మోహిని వేషంబున సురాసురుల మోహితులం జేసి, సురల నమృతాహారులం గావించెఁ; బదునాలుగవది యైన నరసింహరూపంబునం గనకకశిపుని సంహరించెఁ; బదునేనవది యైన కపటవామనావతారంబున బలిని బదత్రయంబు యాచించి, మూఁడులోకంబుల నాక్రమించెఁ; బదునాఱవది యైన భార్గవరామాకృతిని గుపిత భావంబుఁ దాల్చి, బ్రాహ్మణద్రోహు లయిన రాజుల నిరువదియొక్కమాఱు వధియించి భూమి నిఃక్షత్త్రంబుఁ గావించెఁ; బదునేడవది యైన వ్యాసగాత్త్రంబున నల్పమతు లయిన పురుషులం గరుణించి వేదవృక్షంబునకు శాఖ లేర్పఱిచెఁ; బదునెనిమిదవ దైన రామాభిధానంబున దేవకార్యార్థంబు రాజత్వంబు నొంది, సముద్రనిగ్రహాదిపరాక్రమంబు లాచరించె; నేకోనవింశతి వింశతితమంబు లైన రామకృష్ణరూపంబులచే యదువంశంబునందు సంభవించి, విశ్వంభరాభారంబు నివారించె; నేకవింశతితమం బైన బుద్ధనామధేయంబునం గలియుగాద్యవసరంబున రాక్షససమ్మోహనంబుకొఱకు మధ్యగయాప్రదేశంబున [1]జినసుతుం డయి తేజరిల్లు; యుగసంధియందు వసుంధరాధీశులు చోరప్రాయులై సంచరింప విష్ణుయశుం డను విప్రునికిఁ గల్కి యను పేర నుద్భవింపంగలం'' డని యిట్లనియె: 30

మ. ''సరసిం బాసినఁ బాఱు కాలువలయోజన్ విష్ణునం దైన శ్రీ
కరనానాప్రకటావతారము లసంఖ్యాతంబు; లుర్వీశులున్,

---

1. మూలమున జినసుత, అజినసుత, అంజనసుత అను పాఠభేదములు గలవు.

సురలున్, బ్రాహ్మణసంయమీంద్రులు, మహర్షుల్ విష్ణునంశాంశజుల్;
హరి కృష్ణుండు బలానుజన్ముఁ డెడ లే; దావిష్ణుఁ డౌ నేర్పడన్. 31

క. భగవంతుం డగు విష్ణుఁడు - జగముల కెవ్వేళ రాక్షసవ్యథ గలుగుం,
దగ నవ్వేళలఁ దడయక - యుగయుగమునఁ బుట్టి కాచు నుద్యల్లీలన్. 32

ఆ. అతిరహస్యమైన హరిజన్మకథనంబు-మనుజుఁ డెవ్వఁ డేని మాపు రేపుఁ
జాల భక్తితోడఁ జదివిన సంసార-దుఃఖరాశిఁ బాసి తొలఁగి పోవు. 33

వ. వినుం డరూపుం డయి చిదాత్మకుం డయి పరఁగు జీవునికిం బరమేశ్వరు మాయాగుణంబులైన మహదాదిరూపంబులచేత నాత్మస్థానంబుగా విరచితం బైన స్థూలశరీరంబు గగనంబునందుఁ బవనాశ్రిత మేఘసమూహంబును, గాలియందుఁ బార్థివధూళిధూసరత్వంబును నేరీతి నారీతి ద్రష్ట యగు నాత్మయందు దృశ్యత్వంబై బుద్ధిమంతులు గానివారిచేత నారోపింపంబడు; నీస్థూలరూపంబుకంటె నదృష్టగుణం బయి యశ్రుతం బైన వస్తువగుటం జేసి వ్యక్తంబు గాక సూక్ష్మంబై కరచరణాదులు లేక జీవునికి నొండొకరూపంబు విరచితం బై యుండు; సూక్ష్ముఁ డయిన జీవునివలన నుత్క్రాంతిగమనాగమనంబులం బునర్జన్మంబు దోఁచు; నెప్పు డీస్థూలసూక్ష్మరూపంబులు రెండు స్వరూపసమ్యగ్జ్ఞానంబునం బ్రతిషేధింపంబడు ననియు, నవిద్యం జేసి యాత్మకుఁ గల్పింపంబడు ననియుం దెలియు, నప్పుడు జీవుండు బ్రహ్మదర్శనంబున కధికారి యగు; దర్శనం బన జ్ఞానైకస్వరూపంబు; విశారదుం డైన యీశ్వరుని దై క్రీడించుచు నవిద్య యనంబడుచున్న మాయ యుపరత యై యెప్పుడు దాన విద్యారూపంబునం బరిణత యగు, నప్పుడు జీవోపాధి యయిన స్థూలసూక్ష్మరూపంబు దహించి జీవుండు కాష్ఠంబు లేక తేజరిల్లు వహ్నిచందంబునం దాన యుపరతుం డయి బ్రహ్మస్వరూపంబునం బొంది, పరమానందంబున విరాజమానుం డగు; నిట్లు తత్త్వజ్ఞులు సెప్పుదు''రని సూతుం డి ట్లనియె: 34

చ. ''జననము లేక, కర్మముల జాడలఁ బోక, సమస్తచిత్తవ
ర్తనుఁ డగు చక్రికిం గవు లుదారపదంబుల జన్మకర్మముల్
వినుతులు సేయుచుండుదురు; వేదరహస్యములందు నెందుఁ జూ
చిన మఱి లేవు జీవునికిఁ జెప్పినక్రైవడి జన్మకర్మముల్. 35

మ. భువనశ్రేణి నమోఘలీలుఁ డగుచుం బుట్టించు, రక్షించు, నం
తవిధిం జేయు; మునుంగఁ డందు; బహుభూతవ్రాతమం దాత్మతం
త్రవిహారస్థితుఁడై షడింద్రియసమస్త ప్రీతియుక్ దవ్వులన్
దివిభంగిం గొనుఁ; జిక్కఁ; డింద్రియములం ద్రిప్పున్ నిబంధించుచున్. 36

చ. జగదధినాథుఁ డైన హరి సంతతలీలల నామరూపముల్
దగిలి, మనోవచోగతులఁ దార్కికచాతురి యెంత గల్గినన్
మిగిలి కుతర్కవాది దగ మేరలు సేసి యెఱుంగ నేర్చునే?
యగణితనర్తనక్రమము నజ్ఞుఁ డెఱింగి నుతింప నోపునే? 37

ఉ. ఇంచుక మాయ లేక, మది నెప్పుడుఁ బాయని భక్తితోడ వ
ర్తించుచు నెవ్వఁ డేని హరిదివ్యపదాంబుజగంధరాశి సే
వించు; నతం డెఱుంగు నరవిందభవాదుల కైన దుర్లభో
దంచిత మైన యాహరియుదారమహాద్భుతకర్మమార్గముల్. 38

మ. హరిపాదద్వయభక్తి మీవలన నిట్లారూఢ మై యుండె నే?
తిరుగం బాఱదు చిత్తవృత్తి హరిపై దీపించి మీలోపలన్
ధరణీదేవతలార! మీరలు మహాధన్యుల్, సమస్తజ్ఞులున్;
హరిచింతన్ మిముఁ జెంద దెన్నఁడును జన్మాంతవ్యథాయోగముల్. 39

## శ్రీమహాభాగవతరచనాదివృత్తాంతము

సీ. పుణ్యకీర్తనుఁ డైన భువనేశు చరితంబు బ్రహ్మతుల్యం బైన భాగవతము;
సకలపురాణరాజము దొల్లి లోకభద్రముగ, ధన్యముగ, మోదముగఁ శ్రీని
భగవంతుఁ డగు వ్యాసభట్టారకుఁ డొనర్చి శుకుఁ డనియెడు తన సుతునిచేతఁ
జదివించె; నింతయు సకలవేదేతిహాసములలోపల నెల్ల సార మైన
ఆ. యీపురాణ మెల్ల నెలమి నాశుకయోగి - గంగనడుమ నిల్చి ఘనవిరక్తి
యొదవి మునులతోడ నుపవిష్టుఁ డగు పరీక్షిన్నరేంద్రుఁ డడుగఁ జెప్పె; వినుఁడు.

వ. కృష్ణుఁడు ధర్మజ్ఞానాదులతోడం దనలోకంబునకుం జనినపిమ్మటం గలికాలదో
షాంధకారంబున నష్టదర్శను లయిన జనులకు నిప్పు డీపురాణంబు కమల
బంధుని భంగి నున్నది; నాఁ డందు భూరితేజుం డయి కీర్తించుచున్న విప్రర్షి
వలన నేఁ బఠించినక్రమంబున నామదికి గోచరించినంతయు వినిపించెద'' ననిన
సూతునకు మునివరుం డైన శౌనకుం డి ట్లనియె: 41

శా. ''సూతా! యేయుగవేళ, నేమిటికి, నెచ్చోటన్, మునిశ్రేష్ఠు నే
శ్రోతల్ గోరిరి? యేమి హేతువునకై శోధించి లోకైకవి
ఖ్యాతిన్ వ్యాసుఁడు మున్న భాగవతముం గల్పించెఁ? దత్పుత్త్రుఁ డే
ప్రీతిన్ రాజున కీపురాణకథఁ జెప్పెం? జెప్పవే యంతయున్. 42

వ. బుధేంద్రా! వ్యాసపుత్త్రుం డైన శుకుం డను మహాయోగి సమదర్శనుం, డేకాంత
మతి, మాయాశయనంబువలనం దెలిసినవాఁడు, గూఢుండు, మూఢునిక్రియ
నుండు; నిరస్తఖేదుం; డదియునుం గాక. 43

తరలము. శుకుఁడు గోఁచియు లేక పైఁ జనఁ జూచి, తోయములందు ల
జ్జకుఁ జలింపక, చీర లొల్లక, చల్లు లాడెడి దేవక
న్యకలు 'హా శుక' యంచు వెన్కఁ జనంగ, వ్యాసునిఁ జూచి యం
శుకములన్ ధరియించి, సిగ్గున స్రుక్కి రందఱు ధీనిధీ! 44

వ. మఱియు నగ్నుండుఁ, దరుణుండు నైన తను తన కొడుకుం గని వస్త్రపరిధానం బొనరింపక, వస్త్రధారియు, వృద్ధుండును నైన తనుం జూచి చేలంబులు ధరియించు దేవరమణులం గని వ్యాసుండు కారణం బడిగిన వారలు "నీ పుత్త్రుండు స్త్రీ పురుష లనెడు భేదదృష్టి లేక యుండు; మఱియు నతండు నిర్వికల్పుండు గాన నీకు, నతనికి మహాంతరంబు గల"దని; రట్టి శుకుండు కురుజాంగలదేశంబులు సొచ్చి, హాస్తినాపురంబునఁ బౌరజనంబులచే నెట్లు జ్ఞాతుం డయ్యె? మఱియు నున్మత్తుని క్రియ, మూఁగ తెఱంగున, జడునిభంగి నుండు నమ్మహాయోగికి రాజర్షి యైన పరీక్షిన్మహారాజుతోడ సంవాదం బెట్లు సిద్ధించె? బహుకాలకథ నీయం బయిన శ్రీభాగవతనిగమవ్యాఖ్యానం బేరీతి సాగె? నయ్యోగి ముఖ్యుండు గృహస్థుల గృహంబుల గోవును బిదికినయంతతడవు గాని నిలువం బడం; డతండు గోదోహన మాత్రకాలంబు సంచరించిన స్థలంబులు తీర్థంబు లగు నండ్రు, పెద్దకాలం బేక ప్రదేశంబున నెట్లుండె? భాగవతోత్తముం డైన జనపాలుని జన్మకర్మంబు లేప్రకారంబులు? వివరింపుము. 45

సీ. పాండవవంశంబు బలము, మానంబును వర్ధిల్లఁ గడిమి నెవ్వాఁడు మనియెఁ?
బరిపంథిరాజులు భర్మాదిధనముల నర్చించి రెవ్వని యంఘ్రియుగముఁ?
గుంభజకర్ణాదికురుభటవ్యూహంబు సొచ్చి చెండాడె నేశూరు తండ్రి?
గాంగేయసైనికాక్రాంతగోవర్గంబు విడిపించి తెచ్చె నేవీరు తాత?

ఆ. యట్టి గాఢకీర్తి యగు పరీక్షిన్మహా-రాజు విడువరాని రాజ్యలక్ష్మిఁ
బరిహరించి, గంగఁ బ్రాయోపవిష్టుఁ డై-యసువు లుండ నేల యడఁగి యుండె?

ఉ. ఉత్తమకీర్తు లైన మనుజోత్తము లాత్మహితంబు లెన్నఁడుం
జిత్తములందుఁ గోరరు; హసించియు లోకుల కెల్ల నర్థసం
పత్తియు, భూతియున్, సుఖము, భద్రముఁ గోరుదు; రన్యరక్షణా
త్యుత్తమ మైన మేను విభుఁ డూరక యేల విరక్తిఁ బాసెనో? 47

క. సారముల నెల్ల నెఱుఁగుదు - పారగుఁడవు; భాషలందు బహువిధకథనో
దారుఁడవు; మాకు సర్వముఁ - బారము ముట్టంగఁ దెలియఁ బలుకు మహాత్మా!"

వ్యాసుఁడు వ్యాకులచిత్తముతో చింతించుట

వ. అని యడిగిన శౌనకాదిమునిశ్రేష్ఠులకు సూతుం డిట్లనియెఁ: "దృతీయం బైన ద్వాపరయుగంబు దీఱుసమయంబున నుపరిచరవసువువీర్యంబున జన్మించి, వాసవి

నాఁ దగు సత్యవతియందుఁ బరాశరునికి హరికళంజేసి విజ్ఞాని యయిన వేదవ్యాసుండు జన్మించి, యొక్కనాఁడు బదరికాశ్రమంబున సరస్వతీజలంబుల స్నానాది కర్మంబులం దీర్చి, శుచియై, పరులు లేనిచోట నొంటి గూర్చుండి, సూర్యోదయ వేళ నతీతానాగతవర్తమానజ్ఞుం డయిన యాఋషి వ్యక్తంబు గానివేగంబుగల కాలంబునంజేసి యుగధర్మంబులకు భువి సాంకర్యంబు వొందు; యుగయుగంబుల భౌతికశరీరంబులకు శక్తి సన్నం బగుఁ; బురుషులు నిస్సత్త్వులు, ధైర్య శూన్యులు, మందప్రజ్ఞు,లల్పాయువులు, దుర్బలులు నయ్యెద రని తన దివ్యదృష్టిం జూచి, సర్వవర్ణాశ్రమంబులకు హితంబు సేయం దలంచి, నలువురు హోతల చేత ననుష్ఠింపం దగి ప్రజలకు శుద్ధికరంబు లయిన వైదికకర్మంబులగు యజ్ఞంబు లెడతెగకుండుకొఱకు నేకంబైన వేదంబు ఋగ్యజుస్సామాథర్వణంబు లను నాలుగునామంబుల విభాగించి, యితిహాసపురాణంబు లన్నియుఁ బంచమవేదం బని పల్కె; నందు. 49

సీ. పైలుండు ఋగ్వేదపఠనంబు దొరఁకొనె; సామంబు జైమిని సదువుచుండె;
యజువు వైశంపాయనాఖ్యుండు గైకొనెఁ; దుది నథర్వము సుమంతుఁడు సదివెఁ;
నఖిలపురాణేతిహాసముల్ మాతండ్రి రోమహర్షణుఁడు నిరూఢిఁ దాల్చెఁ;
దమతమ వేద మాతపసులు భాగించి శిష్యసంఘములకుఁ జెప్పె; రంత

తే. శిష్యు లెల్లను నాత్మీయశిష్యజనుల-కంతబహుమార్గములఁ ద్రుంచి యనుమతింపఁ
బెక్కుశాఖలు గలిగి యీపృథివిలోన-నిగమ మొప్పారె భూసురనివహమందు.

వ. ఇట్లు మేధావిహీను లయిన పురుషులచేత నట్టివేదంబులు ధరియింపంబడుచున్నవి; మఱియు దీనవత్సలుం డయిన వ్యాసుండు స్త్రీశూద్రులకుం, ద్విజవర్గ కాధములకు వేదంబులు విన నర్హంబులుగావు గావున మూఢుల కెల్ల మే లగు నని భారతాఖ్యానంబు సేసియు, నమ్ముని భూతహితంబునందుఁ దనహృదయంబు సంతసింప కున్న సరస్వతీతటంబున నొంటి నుండి, హేతువు వితర్కించుచుఁ దనలో ని ట్లనియె: 51

సీ. "వ్రతధారి నై వేదవహ్నిగురుశ్రేణి మన్నింతు; విహితకర్మములఁ గొఱంత
వడకుండ నడపుదు; భారతమిషమునఁ బలికితి వేదార్థభావ మెల్ల;
మునుకొని స్త్రీశూద్రముఖ్యధర్మము లందుఁ దెలిపితి నేఁ జెల్ల; దీనఁ జేసి
యాత్మ సంతస మంద; దాత్మలో నీశుండు సంతసింపక యున్నజాడ దోఁచెఁ;

ఆ. హరికి యోగివరుల కభిలషితం బైన-భాగవతవిధంబుఁ బలుక నైతి;
మోసమయ్యెఁ; దెలివి మొనయదు; మఱచితి"-ననుచు వగచుచున్న యవసరమున.

వ్యాసునికడకు నారదుని ఆగమనము

సీ. తనచేతి వల్లకీతంత్రీచయంబున సతతనారాయణశబ్ద మొప్ప,
నానవసంభూతహరిగీతరవసుధాధారల యోగీంద్రతతులు సొక్కఁ,

గపిలజటాభారకాంతిపుంజంబుల దిశలు ప్రభాతదీధితి వహింపఁ,
దనులగ్నతులసికాదామగంధంబులు గగనాంతరాళంబు గప్పికొనఁగ,

ఆ. వచ్చె మింటనుండి వాసవీనందను - కడకు మాటలాడఁ గడఁకతోడ
భద్రవిమలకీర్తిపారగుఁ, డారూఢ - నయవిశారదుండు నారదుండు. 53

క. కనియెన్ నారదుఁ డంతన్ - వినయైకవిలాసు, నిగమవిభజనవిద్యా
జనితోల్లాసున్, భవదుః - ఖనిరాసున్, గురుమనోవికాసున్, వ్యాసున్. 54

వ. ఇట్లు నిజాశ్రమంబునకు వచ్చిన నారదు నెఱింగి, లేచి, వ్యాసుండు వివిధక్రమం
బులం బూజించిన, నతండు లేనగవు నెగడెడి మొగంబుతోడ విపంచికాతంత్రి
వ్రేల మీటుచు ని ట్లనియె : 55

ఉ. "ధాతవు, భారతశ్రుతివిధాతవు, వేదపదార్థజాలవి
జ్ఞాతవు, [1]కామముఖ్యరిపుషట్కవిజేతవు, బ్రహ్మతత్త్వని
ర్ణేతవు, యోగినేతవు, వినీతుఁడ వీవు చలించి చెల్లరే!
[2]కాతరుకైవడిన్ వగవఁ గారణ మేమి పరాశరాత్మజా!" 56

వ. అనినఁ బారాశర్యుం డి ట్లనియె : 57

క. "పుట్టితి వజుతనువునఁ; జే-పట్టితివి పురాణపురుషు భజనము; పదముల్
మెట్టితివి దిక్కులం; దుది - ముట్టితివి మహాప్రబోధమున మునినాథా! 58

వ. అదియునుం గాక నీవు సూర్యునిభంగి మూఁడులోకంబులం జరింతువు; వాయువు
పగిది నఖిలజనులలోనన్ మెలంగుదువు; సర్వజ్ఞుండ వగుటం జేసి, 59

క. నీ కెఱుఁగ రాని ధర్మము - లోకములను లేదు ; బహువిలోకివి నీ; వీ
నా కొఱంత యెట్టి; దంతయు-నాకున్ వివరింపవయ్య! నారద! కరుణన్." 60

వ. అనిన నారదుం డి ట్లనియె: 61

ఉ. "అంచిత మైన ధర్మచయ మంతయుఁ జెప్పితి ; వందులోన నిం
చించుక గాని విష్ణుకథ లేర్పడఁ జెప్పవు ; ధర్మముల్ ప్రపం
చించిన మెచ్చునే గుణవిశేషము లెన్నినఁ గాక, నీకు నీ
కొంచెము వచ్చుటెల్ల హరిఁ గోరి నుతింపమి నార్యపూజితా! 62

మ. హరినామస్తుతి సేయు కావ్యము సువర్ణాంభోజహంసావళీ
సురుచిభ్రాజిత మైన మానససరస్స్ఫూర్తిన్ వెలుంగొందు; శ్రీ
హరినామస్తుతి లేని కావ్యము విచిత్రార్థాన్వితం బయ్యు శ్రీ
కర మై యుండ దయోగ్యదుర్మలినవత్కాకోలగర్తాకృతిన్. 63

1. కామ, క్రోధ, లోభ, మోహ, మద, మాత్సర్యములు. 2. కాతరుఁడు=భయశీలుఁడు ; అధీరుఁడు.

మ. అపశబ్దంబులఁ గూడియున్ హరిచరిత్రాలాపముల్ సర్వపా
పపరిత్యాగము సేయుఁ గావున హరిన్ భావించుచుం, బాడుచున్,
జపముల్ సేయుచు, వీనులన్ వినుచు, నశ్రాంతంబుఁ గీర్తించుచుం
దపసుల్, సాధులు ధన్యు లౌదురు గదా! తత్త్వజ్ఞ! చింతింపుమా. 64

వ. మునీంద్రా! నిర్గతకర్మం బై నిరుపాధికం బైన జ్ఞానంబు హరిభక్తి లేకున్న విశేషంబుగ శోభితంబు గాదు; ఫలంబు గోరక కర్మం బీశ్వరునకు సమర్పణంబు సేయకున్న నది ప్రశస్తం బై యుండదు; భక్తిహీనంబు లయిన జ్ఞానవాచాకర్మకౌశలంబులు నిరర్థకంబులు; గావున మహానుభావుండవు, యథార్థదర్శనుండవు, సకల దిగంతధవళకీర్తివి, సత్యరతుండవు, ధృతవ్రతుండవు గావున నీవు నిఖిలబంధమోచనంబుకొఱకు వాసుదేవుని లీలావిశేషంబులు భక్తితోడ వర్ణింపుము ; హరివర్ణనంబు సేయక ప్రకారాంతరంబున నర్థాంతరంబులు వివక్షించి, తద్వివక్షాకృతరూపనామంబులం జేసి పృథగ్దర్శనుం డగు నవాని మతి పెనుగాలిచేతం ద్రిప్పంబడి తప్పంజను నావచందంబున నెలవు సేర నేరదు; కామ్యకర్మంబులందు రాగంబు గల [1]ప్రాకృతజనులకు నియమించిన ధర్మంబులు సెప్పి శాసకుండవగు నీ వడవడి దగ; దది యెట్లనిన, వార లదియె ధర్మంబని జుగుప్సితంబు లగు కామ్యకర్మంబులు సేయుచుఁ దత్త్వజ్ఞానంబు మఱతురు; గావున బుద్ధిమోహంబు జనియింపక తత్త్వప్రదుండ వై వ్యథావియోగంబు సేయు"మని మఱియు ని ట్లనియె : 65

చ. "ఎఱిఁగినవాఁడు కర్మచయ మెల్లను మాని హరిస్వరూపమున్
నెఱయ నెఱుంగుఁ దాను ; మది నేరుపుఁ జూపు ; గుణానురక్తుఁ డై
[2]తెఱువ లేక భ్రమించుచు దేహధనాద్యభిమానయుక్తుఁ డై
యెఱుఁగనివానికిం దెలియ నీశ్వరలీల మునీంద్ర! చెప్పుమా. 66

చ. తన కులధర్మమున్ విడిచి దానవవైరిపదారవిందముల్
పనివడి సేవసేసి పరిపాకము వొందక యెవ్వఁ డేనిఁ జ
చ్చిన మఱుమేన నైన నది సిద్ధి వహించుఁ; దదీయసేవఁ బా
సినఁ గులధర్మగౌరవము సిద్ధి వహించునె యెన్ని మేనులన్? 67

వ. అదిగావున నెఱుక గలవాఁడు హరిసేవకుం బ్రయత్నంబు సేయందగుఁ; గాలక్రమంబున సుఖదుఃఖంబులు ప్రాప్తంబు లయినను హరిసేవ విడువం దగదు; దానం జేసి యూర్ధ్వంబున బ్రహ్మపర్యంతంబుఁ, గ్రింద స్థావరపర్యంతంబుఁ దిరుగుచున్న జీవులకు దుఃఖంబులట్ల సుఖంబులుఁ బ్రాకృతకర్మాధీనంబు లై సిద్ధించు; నెయ్యది వొంద రా దట్టిమేలు సిద్ధించుకొఱకు హరిసేవ సేయవలయు;

1. ప్రాకృతజనులు = పామరులు. 2. తెఱువ = వివేకము.

హరిసేవకుం డగువాఁడు జననంబు నొందియు నన్యునిక్రియ సంసారంబునం
జిక్కండు ; క్రమ్మఱ హరిచరణస్మరణంబుఁ జేయు ; భక్తిరసవశీకృతుండయి
విడువ నిచ్ఛగింపండు. మఱియును, 68

సీ. విష్ణుండు విశ్వంబు; విష్ణునికం టెను వేఱేమియును లేదు; విశ్వమునకు
భవ వృద్ధి లయములా పరమేశుచే నగు; నీ వెఱుంగుదుగాదె నీ ముఖమునను
నెఱిఁగింపఁబడ్డది యేకదేశమున నీ భువనభద్రమునకై పుట్టినట్టి
హరికళాజాతుండ వని విచారింపుము రమణతో హరిపరాక్రమము లెల్ల;

ఆ. వినుతి సేయు మీవు; వినికియుఁ జదువును–దాన మతులనయముఁ దపము ధృతియుఁ
గలిమి కెల్ల ఫలము గాదె పుణ్యశ్లోకుఁ–గమలనాభుఁ బొగడఁ గలిగెనేని. 69

### నారదుని పూర్వజన్మవృత్తాంతము

వ. మహాత్మా! నేను బూర్వకల్పంబునం దొల్లింటిజన్మంబున వేదవాదుల యింటి
దాసికిం బుట్టి, పిన్ననాఁడు వారలచేఁ బనుపంబడి యొక్క వానకాలంబునఁ
[1]జాతుర్మాస్యంబున నేకస్థలనివాసంబు సేయ నిశ్చయించిన యోగిజనులకుం బరి
చర్య సేయుచోట, 70

క. ఓటమితో నెల్లప్పుడుఁ – బాటవమునఁ బనులు సేసి బాలురకడ కే
యాటలకుఁ బోక యొకజం – జాటంబును లేక భక్తి సలుపుదు ననఘా! 71

క. మంగళ మనుచును వారల – యెంగిలి భక్షింతు; వాన కెండకు నోడన్;
ముంగల నిలుతును నియతిని; – వెంగలిక్రియఁ జనుదు నురువివేకముతోడన్.

వ. ఇట్లేను వర్షాకాలశరత్కాలంబులు సేవించితి; వారును నాయందుఁ గృప
సేసి; రంత, 73

శా. వారల్ కృష్ణచరిత్రముల్ చదువఁగా, వర్ణింపఁగాఁ, బాడఁగా
నా రావంబు సుధారసప్రతిమమై, యశ్రాంతమున్ వీనులం
దోరంబై, పరిపూర్ణమైన మది సంతోషించి నే నంతటం
బ్రారంభించితి విష్ణుసేవ కితర [2]ప్రారంభదూరుండనై. 74

వ. ఇట్లు హరిసేవారతిం జేసి ప్రపంచాతీతుండనై బ్రహ్మరూపకుండనయిన నాయందు
స్థూలసూక్ష్మం బయిన యీ శరీరంబు నిజమాయాకల్పితం బని యమ్మహాత్ము
లగు యోగిజనుల మూలంబున రజస్తమోగుణపరిహారిణి యయిన భక్తి సంభ
వించె; నంతఁ జాతుర్మాస్యంబు నిండిన నయ్యోగిజనులు యాత్ర సేయువారలై;
రివ్విధంబున, 75

1. చాతుర్మాస్యము = ప్రతిసంవత్సరము ఆషాఢశుద్ధము మొదలు కార్తిక శుద్ధమువఱకు నాలుగు నెలలపాటు చేసెడి యొక యజ్ఞము. 2. ప్రారంభము = ప్రయత్నము; కడఁక.

మ. అపచారంబులు లేక, నిత్యపరిచర్యాభక్తియుక్తుండనై,
చపలత్వంబును మాని నేఁ గొలువఁగా, సంప్రీతులై వారు ని
ష్కపటత్వంబున, దీనవత్సలతతోఁ గారుణ్యసంయుక్తులై
యుపదేశించిరి నాకు నీశ్వరరహస్యోదారవిజ్ఞానమున్, 76

వ. ఏనును వారియుపదేశంబున వాసుదేవుని మాయానుభావంబుఁ దెలిసితి; నీశ్వరుని యందు సమర్పితం బయిన కర్మంబు తాపత్రయంబు మానుప నౌషధం బగు; నేద్రవ్యంబువలన నేరోగంబు జనియించె నాద్రవ్యం బా రోగంబు మానుప నేరదు; ద్రవ్యాంతరంబులచేత నైన చికిత్స మానుప నోపు; నవ్విధంబునఁ గర్మంబులు సంసారహేతుకంబు లయ్యు నీశ్వరార్పితంబులై తాము తమ్ముఁ జెఱుచుకొన నోపి యుండు; నీశ్వరునియందుఁ జేయంబడు కర్మంబు విజ్ఞానహేతుకంబై యీశ్వరసంతోషణంబును, భక్తియోగంబునుం బుట్టించు; నీశ్వరశిక్షం జేసి కర్మంబులు సేయువారలు కృష్ణగుణనామవర్ణనస్మరణంబులు సేయుదురు; ప్రణవపూర్వకంబులుగా వాసుదేవ ప్రద్యుమ్న సంకర్షణానిరుద్ధమూర్తినామంబులు నాలుగు భక్తిం బలికి నమస్కారంబు సేసి మంత్రమూర్తియు, మూర్తిశూన్యుండు నయిన యజ్ఞపురుషుం బూజించు పురుషుండు సమ్యగ్దర్శనుం డగు. 77

క. ఏ నివ్విధమునఁ జేయఁగ-దానవకులవైరి నాకుఁ దనయందలి వి
జ్ఞానము నిచ్చెను; మదను-స్థానము నతఁ డెఱుఁగు; నీవు సలుపుము దీనిన్. 78

క. మునికులములోన మిక్కిలి-[1]వినుకులు గలవాఁడ వీవు; విభుకీర్తులు నీ
వనుకూలతఁ బొగడుము; విను-జనములకుఁ దుఃఖ మెల్ల శాంతిం బొందున్." 79

వ. ఇట్లు నారదు జన్మకర్మంబులు విని క్రమ్మఱ వ్యాసుం డిట్లనియె: 80

మ. "విను మాభిక్షులు నీకు నిట్లు కరుణన్ విజ్ఞానముం జెప్పి పో
యిన బాల్యంబున వృద్ధభావమున నీ కేరీతి [2]సంచారముల్
సనె? నీ కిప్పుడు పూర్వకల్పమతి యేజాడం బ్రదీపించెఁ? ద
త్తనువుం బాసినచంద మెట్లు చెపుమా దాసీసుతత్వంబుతోన్." 81

వ. అని యిట్లు వ్యాసుం డడిగిన నారదుం డిట్లనియె: "దాసీపుత్త్రుండ నయిన యేను భిక్షులవలన హరిజ్ఞానంబు గలిగి యున్నంత, 82

సీ. మమ్ము నేలినవారి మందిరంబునఁ గలపనులెల్లఁ గ్రమమున భక్తిఁ జేసి
తనపరాధీనతఁ దలఁపదు; సొలసితి నలసితి నాఁకొంటి ననదు; వచ్చి
మాపును రేపును మాతల్లి మోహంబు సొంపార ముద్దాడుఁ; జంచు దువ్వు;
దేహంబు నివురు; మోదించుఁ; గౌఁగిటఁ జేర్చు; నర్మిలి న న్నిట్లు లరసి మనుప

1. వినుకులు = విషయజ్ఞానములు. 2. సంచారములు = పనిపాటులు, కాలక్షేపములు.

ఆ. నేను విడిచి పోక యింట నుండితి నయ్య-మోహిఁగాక, యెఱుక మోసపోక,
మాఱుచింత లేక, మౌని నై యేనేండ్ల-వాఁడ నగుచుఁ గొన్ని వాసరములు. 83

క. సదనము వెలువడి తెరువునఁ-జెదరక మాతల్లి రాత్రిఁ జీఁకటివేళన్
మొదవుం బిదుకఁగ నొకఫణి-పదభాగముఁ గఱచెఁ ద్రొక్కఁబడి మునినాథా!

క. నీలాయతభోగఫణా-వ్యాళాననవిషమహోగ్రవహ్ని జ్వాలా
మాలావినిపాతిత యై-వ్రాలెన్ ననుఁ గన్న తల్లి వసుమతిమీఁదన్. 85

ఉ. తల్లి ధరిత్రిపై నొఱగి, తల్లడపాటునఁ జెంది, చిత్తముం
[1]బల్లటిలంగఁ బ్రాణములు వాసినఁ జూచి, కలంగ కేను నా
యుల్లములోన మోహరుచి నొందక, సంగము వాసె, మేలు రా
జిల్లె నటంచు విష్ణుపదచింత యొనర్చుచు బుద్ధిఁ దేర్చుచున్. 86

వ. ఉత్తరాభిముఖుండ నై యేను వెడలి, జనపదంబులుఁ, బురంబులుఁ, బట్టణంబులు, గ్రామంబులుఁ, బల్లెలు, [2]మందలుఁ, గిరాత[3]పుళిందనివాసంబులు, వనంబులు, నుపవనంబులుఁ, జిత్రధాతువిచిత్రితంబు లయిన పర్వతంబులు, సమదకరికరవిదళితశాఖలు గల శాఖులు, నవారితనివారితపథికజనశ్రమాతిరేకంబు లైన తటాకంబులు, బహువిధవిహంగనినదమనోహరంబు లై వికచారవిందమధుపానపరవశపరిభ్రమద్భ్రమరసుందరంబు లైన సరోవరంబులు దాఁటి చనుచు క్షుత్పిపాసాసమేతుండ నై, యొక్క నదీహ్రదంబునఁ గ్రుంకు లిడి, శుచి నై, నీరు ద్రావి, గతశ్రముండ నై. 87

క. సాలావృక కపి భల్లుక - కోలేభ లులాయ శల్య ఘూక శరభ శా
ర్దూల శశ గవయ ఖడ్గ - వ్యాళాజగరాదిభయదవనమధ్యమునన్. 88

వ. దుస్తరంబు లైన నవవేణుకీచకగుల్మలతాగహ్వరంబులపొంత నొక్క రావి మ్రానిడగ్గఱఁ గూర్చుండి, యే విన్న చందంబున నాహృదయగతుం బరమాత్మ స్వరూపు హరిం జింతించితి. 89

శా. ఆనందాశ్రులు గన్నులన్ వెడల, రోమాంచంబుతోఁ దత్పద
ధ్యానారూఢుఁడ నైన నాతలఁపులో నద్దేవుఁడుం దోఁచె; నే
నానందాబ్ధిగతుండ నై యెఱుఁగ లే నైతిన్ నను న్నీశ్వరున్
నానాశోకహ మైన యత్తనువు గానన్ లేక యట్లంతటన్. 90

వ. లేచి నిలుచుండి, క్రమ్మఱ నద్దేవుని దివ్యాకారంబుఁ జూడ నిచ్ఛించుచు హృదయంబున నిలుపుకొని, యాతురుండునుంబోలెఁ జూచియుం గానలేక, నిర్మనుష్యం బైన వనంబునం జరియించుచున్న నన్ను నుద్దేశించి వాగగోచరుం

---

1. పల్లటిలుట = చలించుట. 2. మందలు = గొల్లపల్లెలు. 3. పుళిందుఁడు = ఒకజాతి అడవిబోయ.

డైన హరి గంభీరమధురంబు లైన వచనంబుల శోకం బుపశమింపం జేయు చందంబున నిట్లనియె : 91

ఉ. "ఏల కుమార! శోషిలఁగ? నీజననంబున నన్నుఁ గానఁగాఁ
జాలవు నీవు; కామముఖషట్కము నిర్దళితంబు సేసి ని
ర్మూలితకర్ముఁ డైన మునిముఖ్యుఁడు గాని కుయోగి గానఁగాఁ
జాలఁడు; నీదుకోర్కి కొనసాగుటకై నిజమూర్తిఁ జూపితిన్. 92

క. నావలనికోర్కి యూరక - పోవదు; విడిపించు దోషపుంజములను; మ
త్సేవం బుట్టును వైళమ - భావింపఁగ నాదుభక్తి బాలక! వింటే? 93

క. నాయందుఁ గలుగు నీమది - వాయదు జన్మాంతరములు; బాలక! నీ నీ
కాయంబు విడిచి మీఁదట - మాయనుమతిఁ బుట్టఁగలవు మద్భక్తుఁడవై. 94

మ. విను మీసృష్టి లయంబు నొంది యుగముల్ వేయైన కాలంబు యా
మిని యై పోయెడిఁ; బోవఁగాఁ గలుగుఁ జూ మీఁదం బునస్సృష్టి; యం
దు నిరూఢస్మృతితోడఁ బుట్టెదవు; నిర్దోషుండ వై నాకృపన్
ఘనతం జెందెదు శుద్ధసాత్త్వికులలో గణ్యుండ వై యర్భకా!" 95

వ. అని యిట్లాకాశంబు మూర్తియు, ఋగ్వేదాదికంబు నిశ్వాసంబును గా నొప్పి సర్వనియామకం బైన మహాభూతంబు పలికి యూరకున్న, నేను మస్తకంబు వంచి మ్రొక్కి, తత్కరుణకు సంతసించుచు,మదంబు దిగనాడి,మత్సరంబు విడిచి, కామంబు నిర్జించి, క్రోధంబు వర్జించి, లోభమోహంబుల నెడలఁ ద్రోచి, సిగ్గు విడిచి యనంతనామంబులు పఠించుచుఁ, బరమభద్రంబు లయిన తచ్చరిత్రంబు లం జింతించుచు నిరంతరసంతోషుండ నై కృష్ణునిం బుద్ధి నిలిపి,నిర్మలాంతఃకరణం బులతోడ విషయవిరక్తుండ నై కాలంబున కెదురుసూచుచు భూమిం దిరు గుచు నుండునంతం గొంతకాలంబునకు మెఱుంగు మెఱసిన తెఱంగున మృత్యువు దోఁచినం,బంచభూతమయం బయి కర్మస్వరూపం బైన పూర్వదేహంబు విడిచి, హరికృపావశంబున శుద్ధసత్త్వమయం బైన భాగవతదేహంబు సొచ్చితి; నంతం ద్రైలోక్యంబు సంహరించి ప్రళయకాలపయోరాశిమధ్యంబున శయ నించు నారాయణమూర్తియందు నిదురవోవ నిచ్చగించు బ్రహ్మనిశ్వాసంబు వెంట నతనిలోపలం బ్రవేశించితి; నంత సహస్రయుగపరిమితం బయిన కాలంబు సనిన, లేచి, లోకంబులు సృజియింప నుద్యోగించు బ్రహ్మప్రాణంబువలన మరీచి ముఖ్యు లగు మునులును నేనును జన్మించితిమి; యందు నఖండితబ్రహ్మచర్యుండ నై యేను మూఁడులోకంబుల బహిరంతరంబులందు మహావిష్ణుని యనుగ్రహం బున నడ్డంబు లేక, యీశ్వరదత్తయై, బ్రహ్మాభివ్యంజకంబు లైన సప్తస్వరంబులు

దమయంతన మ్రోయుచున్న యీవీణాలాపనరతిం జేసి నారాయణకథా గానంబు సేయుచుఁ జరియించు చుండుదు. 96

ఆ. [1]తీర్థపాదుఁ డయిన దేవుండు విష్ణుండు - దనచరిత్ర మేను దవిలి పాడఁ
జీరఁబడ్డవాని చెలువున నేతెంచి - ఘనుఁడు నా మనమునఁ గానవచ్చు. 97

క. విను మీ సంసారం బను - [2]వననిధిలో మునిఁగి, కర్మవాంఛలచే వే
దనఁ బొందెడువానికి వి-ష్ణుని గుణవర్ణనము తెప్ప సుమ్ము మునీంద్రా! 98

చ. యమనియమాదియోగముల నాత్మ నియంత్రిత మయ్యుఁ గామరో
షములఁ బ్రచోదితంబ యగు; శాంతి వహింపదు; విష్ణుసేవచేఁ
గ్రమమున శాంతి గైకొనినకై వడి, నాదుశరీరజన్మక
ర్మముల రహస్య మెల్ల మునిమండన! చెప్పితి నీవు గోరినన్." 99

వ. అని యిట్లు భగవంతుం డగు నారదుండు వ్యాసమునీంద్రుని వీడ్కొని, వీణ వాయించుచు, యదృచ్ఛామార్గంబునం జనియె"నని సూతుం డిట్లనియె: 100

క. "వాయించు వీణ నెప్పుడు;-మ్రోయించు ముకుందగీతములు; జగములకుం
జేయించుఁ జెవులపండువు;-మాయించు నఘాళి; నిట్టి [3]మతకరి గలఁడే?" 101

వ. అని నారదుం గొనియాడిన సూతునిం జూచి, "నారదుమాటలు విన్న వెనుక భగవంతుం డైన బాదరాయణుం డేమిసేసె"నని శౌనకుం డడిగిన సూతుం డి ట్లనియె: "బ్రహ్మదైవత్య యైన సరస్వతి పడమటి తీరంబున ఋషులకు సత్త్రకర్మవర్ధనం బై, బదరీతరుషండమండితం బై, శమ్యాప్రాసం బనం బ్రసిద్ధం బగు నాశ్రమంబు గల; దందు జలంబుల వార్చి కూర్చుండి వ్యాసుండు దనమదిఁ దిరంబు సేసికొని, భక్తియుక్తం బైన చిత్తంబునం బరిపూర్ణం బైన యీశ్వరుం గాంచి, యీశ్వరాధీనమాయావృతం బైన జీవుని సంసారంబుఁ గని, జీవుండు మాయచేత మోహితుం డై గుణవ్యతిరిక్తుం డయ్యు మాయా సంగతిం దాను ద్రిగుణాత్మకుం డని యభిమానించుచుఁ, ద్రిగుణాభిమానం బునం గర్తయు భోక్తయు నను ననర్థంబు నొందు ననియు, నయ్యనర్థంబునకు నారాయణభక్తియోగంబు గాని యుపశమనంబు వేఱొకటి లే దనియు నిశ్చయించి, 102

మ. అవనీచక్రములోన నేపురుషుఁ డేయామ్నాయముల్ విన్న మా
ధవుపై, లోకశరణ్యుపై భవములం దప్పింపఁగాఁ జాలు భ
క్తివిశేషంబు జనించు; నట్టి భువనక్షేమంకరం బైన భా
గవతామ్నాయము బాదరాయణుఁడు దాఁ గల్పించె నేర్పొప్పఁగన్. 103

---

1. తీర్థపాదుఁడు=పూజ్యపాదుఁడు. 2. వననిధి = సముద్రము. 3. మతకరి = మాయావి.

వ. ఇట్లు భాగవతంబు నిర్మించి, మోక్షార్థియైన శుకునిచేఁ జదివించె" నని చెప్పిన,
విని, శౌనకుండు "నిర్వాణతత్పరుండును, సర్వోపేక్షకుండును నైన శుకయోగి
యేమిటికి భాగవతం బభ్యసించె"ననవుడు సూతుం డి ట్లనియె: 104

క. "ధీరులు, నిరపేక్షులు, నా-త్మారాములు నైన మునులు హరిభజనము ని
ష్కారణము చేయుచుందురు-నారాయణుఁ డట్టివాఁడ సవ్యచరిత్రా! 105

క. హరిగుణవర్ణనరతుఁ డై-హరితత్పరుఁ డైన బాదరాయణి శుభత
త్పరతం బఠించెఁ ద్రిజగ-ద్వరమంగళ మైన భాగవతనిగమంబున్. 106

క. నిగమములు వేయుఁ జదివిన-సుగమంబులు గావు ముక్తిసుభగత్వంబుల్;
సుగమంబు భాగవత మను-నిగమంబుఁ బఠింప ముక్తినివసనము బుధా!"107

### అర్జునుఁడు పుత్త్రఘాతి యైన యశ్వత్థామ నవమానముచేయుట

వ. అని పలికి, రాజర్షి యైన పరీక్షిన్మహారాజు "జన్మకర్మముక్తులును, పాండవుల
[1]మహాప్రస్థానంబును, గృష్ణకథోదయంబును జెప్పెదం, గౌరవధృష్టద్యుమ్నా
దుల యుద్ధంబున వీరు లైనవారలు స్వర్గంబునకుం జనినవెనుక భీము గదా
ఘాతంబున దుర్యోధనుండు దొడలు విఱిగి కూలిన, నశ్వత్థామ దుర్యోధనున
కుం బ్రియంబు సేయువాఁ డై, నిదురవోవు ద్రౌపదీపుత్త్రుల శిరంబులు ఖండించి
తెచ్చి సమర్పించె; నది క్రూరకర్మం బని లోకులు నిందింతురు. 108

ఉ. బాలుర చావు కర్ణములఁ బడ్డఁ గలంగి, [2]యలంగి, యోరువం
జాలక, బాష్పతోయకణజాలము చెక్కుల రాల నేడ్చి, పాం
చాలతనూజ నేలఁ బడి జాలిఁ బడం, గని, యెత్తి, మంజువా
చాలతఁ జూపుచుం, జికురజాలము దువ్వుచుఁ గ్రీడి యి ట్లనున్: 109

మ. "ధరణీశాత్మజ వీవు; నీకు వగవన్ ధర్మంబె? యాద్రౌణి ని
ష్కరుణుం డై విదళించె బాలకుల; మద్గాండీవనిర్ముక్తభీ
కరబాణంబుల నేఁడు వానిశిరమున్ ఖండించి నేఁ దెత్తుఁ; ద
చ్ఛిరముం ద్రొక్కి జలంబు లాడు మిచటన్ శీతాంశుబింబాననా!" 110

వ. అని యిట్లోడంబఱిచి, తనకు మిత్త్రుండును, సారథియు నైన హరి మేలను
చుండం గవచంబు దొడిగి, గాండీవంబు ధరియించి, కపిధ్వజుం డై గురుసుతుని
వెంట రథంబు దోలించిన, 111

శా. తన్నుం జంపెద నంచు వచ్చు విజయున్ దర్శించి, తద్ద్రౌణి, యా
పన్నుం డై, శిశుహంత గావున, నిజప్రాణేచ్ఛఁ బాఱెన్ వడిన్
ము న్నాబ్రహ్మ మృగాకృతిం దనయకున్ మోహించి క్రీడింప నా
సన్నుం డౌ హరుఁ జూచి పాఱుపగిదిన్ సర్వేంద్రియభ్రాంతితోన్. 112

1. మహాప్రస్థానము = మహాయాత్ర, లేక అంతిమయాత్ర. 2. అలంగి = శోకించి.

వ. ఇట్లోపినంతదూరంబు బరువిడి, వెనుకఁ జూచి, రథతురంగంబు లలయుటం దెలిసి, నిలిచి, ప్రాణరక్షణంబునకు నొం డుపాయంబు లేమి నిశ్చయించి, జలంబులవార్చి ద్రోణనందనుండు సమాహితచిత్తుం డై ప్రయోగంబ కాని యుపసంహారంబు నేరకయుఁ బ్రాణసంరక్షణార్థంబు పార్థునిమీఁద బ్రహ్మశిరోనామకాస్త్రంబుం బ్రయోగించిన, నది ప్రచండతేజంబున దిగంతరాళంబు నిండి, ప్రాణిభయంకరం బై తోఁచిన, హరికి నర్జునుం డి ట్లనియె: 113

సీ. "పద్మలోచన! కృష్ణ! భక్తాభయప్రద! వినుము సంసారాగ్ని వేఁచుచున్న
జనులసంసారంబు సంహరింపఁగ నీవు దక్క నన్యులు లేరు దలఁచి చూడ;
సాక్షాత్కరించిన సర్వేశ్వరుండవు; ప్రకృతికి నవ్వలి ప్రభుఁడ; వాద్య
పురుషుండ వగు నీవు బోధముచే మాయ నడఁతువు; నిశ్శ్రేయసాత్మయందు
ఆ. మాయచేత మునిఁగి మనువారలకుఁ గృప-సేసి ధర్మముఖ్యచిహ్నమయిన
శుభము సేయు దీవు; సుజనుల నవనిలోఁ-గావఁ బుట్టుదువు జగన్నివాస! 114

క. ఇది యొక తేజము భూమియుఁ,-[1]జదలును, దిక్కులును నిండి సర్వంకష మై
యెదు రై వచ్చుచు నున్నది-విదితముగా నెఱుఁగఁ జెప్పవే దేవేశా!" 115

వ. అనిన హరి యి ట్లనియె : 116

శా. "జిహ్మత్వంబునఁ బాఱి ద్రోణజుఁడు దుశ్శీలుండు ప్రాణేచ్ఛమై
బ్రహ్మాస్త్రం బదె యేసె; వచ్చె నిదె తద్బాణాగ్ని బీభత్స! నీ
బ్రహ్మాస్త్రంబునఁ గాని దీని మరలింపన్ రాదు; [2]సంహార మీ
బ్రహ్మాపత్య మెఱుంగఁ; డేయుము వడిన్ బ్రహ్మాస్త్రమున్ దీనిపై." 117

వ. అనిన నర్జునుండు జలంబుల వార్చి, హరికిం బ్రదక్షిణంబు వచ్చి, ద్రోణనందనుండేసిన బ్రహ్మాస్త్రంబుమీఁదఁ దన బ్రహ్మాస్త్రంబుం బ్రయోగించిన, 118

మ. అవనివ్యోమములందు నిండి తమలో నా రెండు బ్రహ్మాస్త్రముల్
రవివహ్నిద్యుతిఁ బోరుచుం ద్రిభువనత్రాసంబుఁ గావింపఁగా,
వివశభ్రాంతి యుగాంతమో యని ప్రజల్ వీక్షింప, నావేళ మా
ధవునాజ్ఞన్ విజయుండు సేసె విశిఖద్వంద్వోపసంహారమున్. 119

వ. ఇ ట్లస్త్రద్వయంబు నుపసంహరించి, ధనంజయుండు, ద్రోణనందనుం గూడ నరిగి, పట్టుకొని, రోషారుణితలోచనుం డై, యాజకుండు రజ్జువునం బశువుఁ గట్టిన చందంబున బంధించి, శిబిరంబుకడకుం గొనిచని, హింసింతునని తిగిచినం జూచి, హరి ప్రకుపితుండై యి ట్లనియె :



1. చదలు = ఆకాశము. 2. సంహారము = ఉపసంహారము, మఱలించుట, వెనుకకు దీసికొనుట.

ఉ. "[1]మాఱుపడంగ లేని యసమర్థుల, సుప్తుల, శస్త్రవిద్యలం
దేఱని పిన్నపాపల వధించె నిశీథమునందుఁ గ్రూరుఁడై;
పాఱుఁడె వీఁడు? పాతకుఁడు; ప్రాణభయంబున వెచ్చ నూర్చుచుం
బాఱెడి వీనిఁ గావకు కృపామతి సజ్జన! పాపవర్జనా! 121

చ. వెఱచినవాని, దైన్యమున [2]వేఁదుఱు నొందినవాని, నిద్ర మై
మఱచినవాని, సౌఖ్యమున మద్యముఁ ద్రావినవాని, భగ్నుఁడై
పఱచినవాని, సాధుజడభావమువానిని, గావు మంచు [3]వా
చఱచినవానిఁ, గామినులఁ జంపుట ధర్మము గాదు ఫల్గునా! 122

శా. స్వప్రాణంబుల నెవ్వఁడేనిఁ గరుణాసంగంబు పాలించి య
న్యప్రాణంబులచేత రక్షణము సేయన్ వాఁ డధోలోకదుః
ఖప్రాప్తుం డగు; రాజదండమున సత్కల్యాణుఁ డౌ; నైన నీ
విప్రుం దండితుఁ జేయు; మేటికి మహావిభ్రాంతిచే నుండఁగన్?" 123

వ. అని యివ్విధంబునఁ గృష్ణుం డానతిచ్చిన, బ్రాహ్మణుండు కృతాపరాధుం డయ్యు వధ్యుండు గాఁ డనుధర్మంబుఁ దలంచి, చంపక, ద్రుపదరాజపుత్రికిం దనచేసిన ప్రతిజ్ఞం దలంచి, బద్ధుం డైన గురునందనుం దోడ్కొని, కృష్ణుండు సారథ్యంబు సేయ శిబిరంబుకడకు వచ్చి, 124

క. సురరాజసుతుఁడు చూపెను - దురవధిసుతశోకయుతకు, ద్రుపదుని సుతకుం
బరిచలితాంగశ్రేణిం - బరుషమహాపాశబద్ధపాణిన్ ద్రౌణిన్. 125

### ద్రౌపది యశ్వత్థామల సంభాషణము

వ. ఇట్లర్జునుండు దెచ్చిచూపిన, కాలవధజనితలజ్జాపరాఙ్ముఖుం డైన కృపిసొడుకుం జూచి, మ్రొక్కి, సుస్వభావ యగు ద్రౌపది యిట్లనియె: 126

మ. "పరఁగన్ మా మగవార లందఱును మున్ బాణప్రయోగోపసం
హరణాద్యాయుధవిద్య లన్నియును ద్రోణాచార్యుచే నభ్యసిం
చిరి; పుత్త్రాకృతి నున్న ద్రోణుఁడవు; నీ చిత్తంబులో లేశముం
గరుణాసంగము లేక శిష్యసుతులన్ ఖండింపఁగాఁ బాడియే? 127

క. భూసురుఁడవు; బుద్ధిదయా - భాసురుఁడవు; శుద్ధవీరభటసంఘోషా
గ్రేసరుఁడవు; శిశుమారణ-మాసురకృత్యంబు ధర్మ మగునే తండ్రీ! 128

శా. ఉద్రేకంబున రారు; శస్త్రధరులై యుద్ధావనిన్ లేరు; కిం
చిద్ద్రోహంబును నీకుఁ జేయరు; బలోత్సేకంబుతోఁ జీకటిన్

1. మాఱుపడు = ఎదుర్కొను. 2. వేఁదుఱు = ఉన్మాదము. 3. వాచఱచు = మొఱపెట్టు.

భద్రాకారులఁ, బిన్న పాపల, రణప్రౌఢక్రియాహీనులన్,
నిద్రాసక్తుల సంహరింప నకటా! నీచేతు లెట్లాడెనో? 129

ఉ. అక్కట! పుత్త్రశోకజనితాకులభారవిషణ్ణచిత్త నై
పొక్కుచు నున్నభంగి నినుఁ బోరఁ గిరీటి నిబద్ధుఁ జేసి నేఁ
డిక్కడ కీడ్చి తెచ్చుట సహింపని దై భవదీయమాత నేఁ
డెక్కడ నిట్టిశోకమున నేక్రియ నేడ్చుచుఁ బొక్కుచున్నదో?" 130

వ. అని, కృష్ణార్జునులం జూచి యి ట్లనియె: 131

ఉ. "ద్రోణునితో శిఖిం బడక ద్రోణకుటుంబిని యున్న దింట; న
క్షీణతనూజశోకవివశీకృత నై విలపించుభంగి నీ
ద్రౌణిఁ [1]దెరల్చి తెచ్చుటకు దైన్యము నొందుచు నెంత పొక్కునో;
ప్రాణవియుక్తుఁ డైన నతిపాపము; బ్రాహ్మణహింస మానరే. 132

క. భూపాలకులకు విప్రులఁ-గోపింపం జేయఁ దగదు; కోపించినఁ ద
త్కోపానలంబు మొదలికి-భూపాలాటవులఁ గాల్చు భూకంపముగాన్." 133

వ. అని యిట్లు ధర్మ్యంబును, సకరుణంబును, [2]నిర్వ్యళీకంబును, సమంజసంబును, శ్లాఘ్యంబునుంగాఁ బలుకు ద్రౌపదిపలుకులకు ధర్మనందనుండు సంతసిల్లె; నకుల సహదేవ సాత్యకి ధనంజయ కృష్ణులు సమ్మతించిరి; సమ్మతింపక భీముం డి ట్లనియె:

చ. "కొడుకులఁ బట్టి చంపె నని కోపము నొందదు; బాలఘాతకున్
విడువు మటంచుఁ జెప్పెడిని; వెఱ్ఱిది ద్రౌపది; వీఁడు విప్రుఁడే?
విడువఁగ నేల? చంపుఁ; డిటు వీనిని మీరలు సంప రేని నా
పిడికిటిపోటునన్ శిరము భిన్నము సేసెదఁ జూడుఁ డిందఱున్." 135

వ. అని పలికిన నశ్వత్థామకు ద్రౌపది యడ్డంబు వచ్చె; భీముని సంరంభంబు సూచి హరి చతుర్భుజుం డయి, రెండుచేతుల భీముని వారించి, కడమ రెంటను ద్రుపదపుత్త్రికను దలంగించి, నగుచు భీమున కి ట్లనియె: 136

ఉ. "అవ్యుఁడు గాఁడు వీఁడు; శిశుహంత; దురాత్మకుఁ; డాతతాయి; హం
తవ్యుఁడు; [3]బ్రహ్మబంధుఁ డగుఁ; దప్పదు; నిక్కము; 'బ్రాహ్మణో నహం
తవ్య' యటంచు వేదము శ్రుతం బగుఁ గావున ధర్మదృష్టిఁ గ
ర్తవ్యము వీనిఁ గాచుట; యథాస్థితిఁ జూడుము పాండవోత్తమా!" 137

వ. అని సరసాలాపంబు లాడి, పవననందను నోడంబఱిచి, యర్జునుం జూచి, "ద్రౌపదికి, నాకు, భీమసేనునకు సమ్మతంబుగ మున్ను నీచేసిన ప్రతిజ్ఞయు

---

1. తెరల్చితెచ్చు = పట్టితెచ్చు. 2. నిర్వ్యళీకము = వ్యళీకములు (అప్రియములు) లేనిది.
3. బ్రహ్మబంధుఁడు = నామమాత్రబ్రాహ్మణుఁడై దూఱఁబడువాఁడు.

సిద్ధించునట్లు నాపంపు సేయు'' మని నారాయణుం డానతిచ్చిన, నర్జునుండును
దదనుమతంబున, 138

శా. విశ్వస్తుత్యుఁడు, శక్రసూనుఁడు, మహావీరుండు ఘోరాసిచే
నశ్వత్థామశిరోజముల్ దఱిఁగి, చూడాంతర్మహారత్నముల్
శశ్వత్కీర్తి వెలుంగఁ బుచ్చుకొని, పాశవ్రాతబంధంబులన్
విశ్వాసంబున నూడ్చి, త్రోచె శిబిరోర్వీభాగముం బాసిపోన్. 139

క. నిబ్బరపు బాలహంతయు - గొబ్బునఁ దేజంబు, మణియుఁ గోల్పడి, నతుఁ డై,
[1]ప్రబ్బినవగచే విప్రుఁడు - [2]సిబ్బితితో నొడలిగబ్బు సెడి వడిఁ జనియెన్. 140

ఆ. ధనముఁ గొనుట యొండెఁ, దల గొఱుగుట యొండె - నాలయంబు వెడలనడుచు
గాని చంపఁదగినకర్మంబు సేసిన - జంపఁ దగదు విప్రజాతిఁ బతికి. [టొండెఁ,

వ. ఇట్లశ్వత్థామం బ్రాణావశిష్టుం జేసి, వెడల నడిచి, పాండవులు పాంచాలీసహితు
లై పుత్త్రులకు శోకించి, మృతు లైన బంధువుల కెల్ల దహనాదికృత్యంబులు సేసి,
యుదకప్రదానంబు సేయుకొఱకు స్త్రీల ముందట నిడికొని గోవిందుండునుం
దారును గంగకుం జని తిలోదకంబు వోసి, క్రమ్మఱ విలపించి, హరిపాదపద్మ
జాతపవిత్త్రంబు లయిన భాగీరథీజలంబుల స్నాతు లయి యున్నయెడం బుత్త్ర
శోకాతురు లయిన గాంధారీధృతరాష్ట్రులను, గుంతీద్రౌపదులను జూచి మాధ
వుండు మునీంద్రులుం దానును బంధుమరణశోకాతురు లయిన వారల వగపు
మానిచి మన్నించె; నివ్విధంబున. 142

శా. పాంచాలీకబరీవికర్షణమహాపాపక్షతాయుష్కులం,
జంచద్గర్వుల, ధార్తరాష్ట్రుల ననిం జంపించి గోవిందుఁ డి
ప్పించెన్ రాజ్యము ధర్మపుత్త్రునకుఁ; గల్పించెన్ మహాఖ్యాతిఁ; జే
యించెన్ మూఁడు తురంగమేధములు దేవేంద్రప్రభావంబునన్. 143

### ఉత్తరాగర్భస్థుండైన యర్భకుని శ్రీకృష్ణుఁడు రక్షించుట

వ. అంత వాసుదేవుండు వ్యాసప్రముఖభూసురపూజితుం డయి, యుద్ధవసాత్యకులు
గొలువ, ద్వారకాగమనప్రయత్నంబునం బాండవుల వీడ్కొని రథారోహ
ణంబు సేయు సమయంబునం, దత్తఱపడుచు నుత్తర సనుదెంచి కల్యాణ
గుణోత్తరుండైన హరి కిట్లనియె: 144

మ. ''ఇదె కాలానలతుల్య మైన విశిఖం బేతెంచె దేవేశ! నే
డుదరాంతర్గతగర్భదాహమునకై యుగ్రప్రభన్ వచ్చు చు
న్నది; [3]దుర్లోక్యము: మానుపన్ శరణ మన్యం బేమియున్ లేదు నీ
పదపద్మంబులె కాని; యొండెఱుఁగ నీ బాణాగ్ని వారింపవే? 145

1. ప్రబ్బిన = అతిశయించిన. 2. సిబ్బితి = సిగ్గు. 3. దుర్లోక్యము = చూడశక్యము గానిది.

క. దుర్భర బాణానలమున - గర్భములో నున్న శిశువు ఘనసంతాపా
విర్భావంబునఁ బొరలెడి - నిర్భరకృపఁ గావవయ్య! నిఖిలస్తుత్యా! 146

క. చెల్లెలికోడల; నీమే - నల్లుఁడు శత్రువులచేత హతుఁడయ్యెను; సం
ఫుల్లారవిందలోచన! - భల్లాగ్ని నడంచి శిశువు బ్రతికింపఁగదే? 147

ఆ. గర్భమందుఁ గమలగర్భాండశతములు - నిముడుకొన వహించు నీశ్వరేశ!
నీకు నొక్క మానినీగర్భరక్షణ - మెంతబరువు? నిర్వహింతుగాక!" 148

వ. అనిన నాశ్రితవత్సలుం డగు నప్పరమేశ్వరుండు సుభద్రకోడలి దీనాలాపంబు లాలించి, యిది ద్రోణనందనుండు లోక మంతయు నపాండవం బయ్యెడు మని యేసిన దివ్యాస్త్రం బని యెఱింగె; నంతఁ బాండవుల కభిముఖం బయి, ద్రోణ నందనదివ్యాస్త్రనిర్గతనిశితమార్గణంబులు డగ్గఱిన [1]బెగ్గడిలక వారును బ్రత్యస్త్రంబు లందికొని పెనంగు సమయంబున, 149

మ. తన సేవారతిచింత గాని పరచింతాలేశముం లేని స
జ్జనులం బాండుతనూజులం మనుచు వాత్సల్యంబుతో ద్రోణనం
దను బ్రహ్మాస్త్రము నడ్డపెట్టఁ బనిచెం, దైత్యారి, సర్వారిసా
ధన[2]నిర్వక్రము, రక్షితాఖిలసుధాంధశ్చక్రముం, జక్రముం. 150

మ. సకలప్రాణిహృదంతరాళముల భాస్వజ్జ్యోతి యై యుండు సూ
క్ష్మకళుం డచ్యుతుఁ డయ్యెడం విరటుచూలి గర్భంబు దాఁ జక్రహ
స్తకుఁ డై, వైష్ణవమాయఁ గప్పి, కురుసంతానార్థి యై, యడ్డ మై
ప్రకటస్ఫూర్తి నడంచె ద్రోణతనయు బ్రహ్మాస్త్రముం లీలతోన్. 151

వ. ఇట్లు ద్రోణతనయుం డేసిన ప్రతిక్రియారహితం బయిన బ్రహ్మశిరం బనియెడి దివ్యాస్త్రంబు వైష్ణవతేజంబున నిరర్థకం బయ్యె; నిజమాయచే సకలలోక [3]సర్గస్థితి సంహారంబు లాచరించునట్టి హరికి ధరణీసురబాణనివారణంబు విచిత్రంబు గాదు; తత్సమయంబున సంతసించి పాండవపాంచాలీసహిత యై గొంతి గమ నోన్ముఖుం డయిన హరిం జేర వచ్చి యిట్లనియె: 152

## కుంతీదేవి శ్రీకృష్ణుని స్తోత్రము చేయుట

క. "పురుషుం డాద్యుఁడు ప్రకృతికిఁ-బరుఁ డవ్యయుఁ డఖిలభూత బహిరంతర్భా
సురుఁడును లోకనియంతయుఁ-బరమేశ్వరుఁ డైన నీకుఁ బ్రణతు లగు హరీ!

వ. మఱియు జవనికమఱువున నాట్యంబు సలుపు నటుని చందంబున మాయా యవనికాంతరాళంబున నిలువంబడి, నీ మహిమచేఁ బరమహంసలు నివృత్త

1. బెగ్గడిల్లక = భయపడక. 2. నిర్వక్రము = తిరుగులేనిది. 3. సర్గము = సృష్టి.

రాగద్వేషులు, నిర్మలాత్ములు నయిన మునులకు నదృశ్యమానుండవయి పరిచ్ఛిన్నుండవు గాని నీవు మూఢదృక్కులుఁ, గుటుంబవంతులు నగు మాకు నెట్లు దర్శనీయుండ వయ్యెదు? శ్రీకృష్ణ! వాసుదేవ! దేవకీనందన! నందగోపకుమార! గోవింద! పంకజనాభ! పద్మమాలికాలంకృత! పద్మలోచన! పద్మసంకాశచరణ! హృషీకేశ! భక్తియోగంబునం జేసి నమస్కరించెద నవధరింపుము. 154

సీ. తనయులతోడ నే దహ్యమానం బగు జతుగృహంబునయందుఁ జావకుండఁ,
గురురాజు వెట్టించు ఘోరవిషంబున మారుతపుత్త్రుండు మడియకుండ,
ధార్తరాష్ట్రుఁడు సముద్ధతిఁ జీర లొలువంగ ద్రౌపదిమానంబు దలఁగకుండ,
గాంగేయకుంభజకర్ణాదిఘనులచే నా బిడ్డ లనిలోన నలఁగకుండ,

తే. విరటుపుత్త్రిక కడుపులో వెలయుచూలు-ద్రోణనందనుశరవహ్నిఁ [1]ద్రుంగకుండ
మఱియు రక్షించితివి పెక్కుమార్గములను-నిన్ను నే నుతి వర్ణింతు నీరజాక్ష!

మత్తకోకిల. బల్లిదుం డగు కంసుచేతను బాధ నొందుచు నున్న మీ
తల్లిఁ గాచినభంగిఁ గాచితి ధార్తరాష్ట్రులచేత నేఁ
దల్లడంబునఁ జిక్కకుండఁగఁ దావకీనగుణవ్రజం
బెల్ల సంస్తుతి సేసి చెప్పఁగ నెంతదాన జగత్పతీ! 156

క. జననము, నైశ్వర్యంబును,-ధనమును, విద్యయును గల మదచ్ఛన్నులకిం
చనగోచరుఁ డగు నిన్నుఁ-వినుతింపఁగ లేరు నిఖిలవిబుధస్తుత్యా! 157

వ. మఱియు భక్తధనుండును, నివృత్తధర్మార్థకామవిషయుండును, నాత్మారాముండును, రాగాదిరహితుండును, కైవల్యదానసమర్థుండును, కాలరూపకుండును, నియామకుండును, నాద్యంతశూన్యుండును, విభుండును, సర్వసముండును, సకలభూతనిగ్రహానుగ్రహకరుండును నైన నిన్నుఁ దలంచి నమస్కరించెద నవధరింపుము; మనుష్యుల [2]విడంబించు భవదీయ విలసనంబు నిర్ణయింప నెవ్వఁడు సమర్థుండు? నీకుం బ్రియాప్రియులు లేరు; జన్మకర్మశూన్యుండ వయిన నీవు తిర్యగాదిజీవులయందు వరాహాదిరూపంబులను, మనుష్యులందు రామాదిరూపంబులను, ఋషులయందు వామనాదిరూపంబులను, జలచరంబులయందు మత్స్యాదిరూపంబులను నవతరించుట లోకవిడంబనార్థంబుగాని జన్మకర్మసహితుండ వగుటం గాదు. 158

ఉ. కోపముతోడ నీవు దధికుంభము భిన్నము సేయుచున్నచోఁ
గోపిక త్రాటఁ గట్టిన, వికుంచితసాంజనబాష్పతోయధా
రాపరిపూర్ణవక్త్రముఁ గరంబులఁ [3]బ్రాముచు, వెచ్చనూర్చుచుం
బాపఁడ వై నటించుట కృపాపర! నా మదిఁ జోద్యమయ్యెడిన్. 159

1. త్రుంగుట = నశించుట. 2. విడంబించుట = అనుకరించుట. 3. ప్రాముచు = తుడుచుచు.

క. మలయమునఁ జందనము క్రియ-వెలయఁగ ధర్మజునికీర్తి వెలయించుటకై
యిలపై నభవుఁడు హరి యదు-కులమున నుదయించె నండ్రు గొంద ఱనంతా!

క. వసుదేవదేవకులు తా-పసగతి [1]గతభవమునందుఁ బ్రార్థించిన సం
తసమునఁ బుత్త్రత నొందితి-వసురుల మృతికొంచుఁ గొంద ఱండ్రు మహాత్మా! 161

క. జలరాశినడుమ మునిఁగెడు-కలముక్రియన్ భూరిభారకర్శిత యగు నీ
యిలఁ గావ నజుఁడు గోరినఁ-గలిగితి వని కొంద ఱండ్రు గణనాతీతా! 162

తే. మఱచి యజ్ఞానకామ్యకర్మములఁ దిరుగు-వేదనాతురులకుఁ దన్నివృత్తిఁ జేయ
శ్రవణచింతనవందనార్చనము లిచ్చు-కొఱకు నుదయించితం డ్రు నిన్గొంద ఱభవ!

మ. నినుఁ జింతించుచుఁ, బాడుచుం, బొగడుచున్, నీ దివ్యచారిత్రముల్
వినుచుం జాతురు గాక! లోకు లితరాన్వేషంబులం జాతురే
ఘనదుర్జన్మపరంపరాహరణదక్షం బై మహాయోగివా
గ్వినుతం బైన భవత్పదాబ్జయుగముల్ విశ్వేశ! విశ్వంభరా! 164

వ. దేవా! నిరాశ్రయుల మై భవదీయచరణారవిందంబు లాశ్రయించి నీవారలమైన మమ్ము విడిచి విచ్చేయ నేల? నీ సకరుణావలోకనంబుల నిత్యంబును జూడవేని యాదవసహితు లైన పాండవులు జీవునిం బాసిన యింద్రియంబులచందంబునఁ గీర్తిసంపదలు లేక తుచ్ఛత్వంబు నొందుదురు; కల్యాణలక్షణలక్షితంబు లయిన నీయడుగులచేత నంకితం బైన మదీయధరణీమండలంబు నీవు వాసిన శోభితంబు గాదు; నీకృపావీక్షణామృతంబున నిక్కడి జనపదంబులు గుసుమఫలభరితంబు లై యోషధితరులతాగుల్మనదనదీసమేతంబు లై యుండు. 165

ఉ. యాదవులందుఁ, బాండవులయందు నధీశ్వర! నాకు మోహవి
చ్ఛేదము సేయుమయ్య! ఘనసింధువుఁ జేరెడి గంగభంగి నీ
పాదసరోజచింతనముపై ననిశంబు మదీయబుద్ధి న
త్యాదరవృత్తితోఁ గదియునట్లుగఁ జేయఁగదయ్య! యీశ్వరా! 166

శా. శ్రీకృష్ణా! యదుభూషణా! నరసఖా! శృంగారరత్నాకరా!
లోకద్రోహినరేంద్రవంశదహనా! లోకేశ్వరా! దేవతా
నీకబ్రాహ్మణగోగణార్తిహరణా! [2]నిర్వాణసంధాయకా!
నీకున్ మ్రొక్కెదఁ; ద్రుంపవే భవలతల్ నిత్యానుకంపానిధీ!" 167

వ. అని యిట్లు కలభాషణంబుల నుతియించు గొంతిమాటకు నియ్యకొని, గోవిందుండు, మాయానిరూఢమందహాసవిశేషంబున మోహంబు నొందించి, రథా

1. గతభవము = పోయిన జన్మము. 2. నిర్వాణము = ముక్తి, సుఖము.

రూఢుండై [1]కరినగరంబునకు వచ్చి, కుంతీసుభద్రాదుల వీడ్కొని, తనపురంబునకు విచ్చేయ గమకించి, ధర్మరాజుచేఁ గించిత్కాలంబు నిలుపు మని ప్రార్థితుం డై నిలిచె; నంత బంధువధశోకాతురుం డయిన ధర్మజుండు నారాయణవ్యాస ధౌమ్యాదులచేతఁ దెలుపంబడియుఁ దెలియక మోహితుం డై, నిర్వివేకం బగు చిత్తంబున నిట్లనియె : 168

మ. "తనదేహంబునకై యనేకమృగసంతానంబుఁ జంపించు దు
ర్జనుభంగిం గురుబాలకద్విజతనూజభ్రాతృసంఘంబు ని
ట్లనిఁ జంపించిన పాపకర్మునకు, రాజ్యాకాంక్షికిన్, నాకు హా
యనలక్షావధి నైన ఘోరనరకవ్యాసంగముల్ మానునే? 169

వ. మఱియుఁ బ్రజాపరిపాలనపరుం డయిన రాజు ధర్మయుద్ధంబున శత్రువుల వధయించినఁ బాపంబు లే దని శాస్త్రవచనంబు గల; దయిన నది విజ్ఞానంబుకొఱకు సమర్థంబు గాదు; చతురంగంబుల ననేకాక్షౌహిణీసంఖ్యాతంబులం జంపించితి; హతబంధు లయిన సతుల కేను జేసిన ద్రోహంబు దప్పించుకొన నేర్పు లేదు; గృహస్థాశ్రమధర్మంబు లైన తురంగమేధాదియాగంబులచేతఁ బురుషుండు బ్రహ్మహత్యాదిపాపంబులవలన విడివడి నిర్మలుం డగు నని [2]నిగమంబులు [3]నిగమించుఁ; బంకంబునఁ బంకిలస్థలంబునకు, మద్యంబున మద్యభాండంబునకు శుద్ధి సంభవింపనిచందంబున బుద్ధిపూర్వకజీవహింసనంబు లయిన యాగంబులచేతం బురుషులకుఁ బాపబాహుళ్యంబ కాని పాపనిర్ముక్తి గా దని శంకించెద." 170

క. అని యిట్లు ధర్మసూనుఁడు-మొనసి నిరాహారభావమున దేవనదీ
తనయుఁడు గూలిన చోటికిఁ-జనియెఁ బ్రజాద్రోహపాపచలితాత్ముం డై. 171

ధర్మజుఁడు శ్రీకృష్ణసహితుఁడై శరతల్పగతుఁ డైన భీష్మునికడ కేఁగుట

వ. అయ్యవసరంబునం దక్కిన పాండవులును, ఫల్గునసహితుం డైన పద్మలోచనుండును గాంచనసమంచితంబు లయిన రథంబు లెక్కి ధర్మజుం గూడి చనిన, నతండు గుహ్యకసహితుం డయిన కుబేరునిభంగి నొప్పె; నిట్లు పాండవులు పరిజనులు గొలువఁ బద్మనాభసహితు లై కురుక్షేత్రంబున కేఁగి, దివంబుననుండి నేలం గూలిన దేవత తెఱంగున సంగ్రామరంగపతితుం డైన గంగానందనునకు నమస్కరించి; రంత బృహదశ్వ భరద్వాజ పరశురామ పర్వత నారద బాదరాయణ కశ్యపాంగిరస కౌశిక ధౌమ్య సుదర్శన శుక వసిష్ఠా ద్యనేక రాజర్షి దేవర్షి బ్రహ్మర్షులు శిష్యసమేతు లై చనుదెంచినం జూచి, సంతసించి, దేశకాలవిభాగవేది యైన భీష్ముండు వారలకుం బూజనంబు గావించి, 172

---

1. కరినగరము=హస్తినాపట్టణము. 2. నిగమములు=వేదములు. 3. నిగమించును=తెలుపును.

క. "మాయాంగీకృతదేహుం-డై యఖిలేశ్వరుఁడు మనుజుఁ డైనాఁ"డని ప్ర
జ్ఞాయతచిత్తంబున గాం-గేయుఁడు పూజనము సేసెఁ గృష్ణున్ జిష్ణున్. 173

వ. మఱియు గంగానందనుండు వినయప్రేమసుందరు లయిన పాండునందనులం గూర్చుండ నియోగించి, మహానురాగజనితబాష్పసలిలసందోహసమ్మిళితలోచనుండై యిట్లనియె: 174

ఆ. "ధరణిసురులు హరియు ధర్మంబు దిక్కు గా-బ్రదుకఁ దలఁచి మీరు బహువిధముల
నన్నలార! పడితి రాపత్పరంపర;-లిట్టి చిత్రకర్మ మెందుఁ గలదు? 175

ఉ. సంతస మింత లేదు; మృగశాపవశంబునఁ బాండుభూవిభుం
డంతము నొంది యుండ మిము నర్భకులం గొనివచ్చి, కొంతితో
నింతలవారిఁ గాఁ బెనిచె; నెన్నఁడు సౌఖ్యముపట్టు గాన దీ
గొంతి; యనేకదుఃఖములఁ గుందుచు నుండును భాగ్య మెట్టిదో! 176

ఉ. వాయువశంబులై మొగిసి, వారిధరంబులు, మింటఁ గూడుచుం
బాయుచు నుండుకై వడిఁ బ్రపంచము సర్వముఁ [1]గాలతంత్ర మై
పాయుచుఁ గూడుచుండు; నొకభంగిఁ జరింపదు; కాల మన్నియుం
జేయుచు నుండుఁ; గాలము విచిత్రము, దుస్తర మెట్టివారికిన్. 177

ఉ. రాజఁట ధర్మజుండు, సురరాజసుతుండఁట ధన్వి, శాత్రవో
ద్వేజక మైన గాండివము విల్లఁట, సారథి సర్వభద్రసం
యోజకుఁ డైన చక్రియఁట, యుగ్రగదాధరుఁ డైన భీముఁ డ
య్యాజికిఁ దోడు వచ్చునఁట; యాపద గల్గు టిదేమిచోద్యమో! 178

ఆ. ఈశ్వరుండు విష్ణుఁ డెవ్వేళ, నెవ్వని-కేమి సేయుఁ బురుషుఁ డేమి యెఱుఁగు?
నతనిమాయలకు మహాత్ములు విద్వాంసు-లడఁగి మెలఁగుచుందు రంధు లగుచు.

వ. కావున దైవతంత్రం బైన పనికి వగవం బని లేదు; రక్షకులు లేని ప్రజల రక్షింపఁ బుండరీకాక్షుండు సాక్షాత్కరించిన నారాయణుండు, తేజోనిరూఢుండు గాక యాదవులందు గూఢుం డై తనమాయచేత లోకంబుల మోహాతిరేకంబు నొందించు; నతని రహస్యప్రకారంబుల భగవంతుం డైన పరమేశ్వరుం డెఱుంగు; మఱియు దేవర్షి యగు నారదుండును, భగవంతుం డగు కపిలమునియు నెఱుంగుదురు; మీరు కృష్ణుండు దేవకీపుత్త్రుం డగు [2]మాతులేయుం డని తలంచి దూత సచివసారథిబంధుమిత్త్రప్రయోజనంబుల నియమింతు; రిన్నిటం గొఱంత లేదు; రాగాదిశూన్యుండు, నిరహంకారుండు, నద్వయుండు, సమదర్శనుండు, సర్వాత్మకుండు నయిన యీశ్వరునకు నతోన్నత భావమతివైషమ్యంబు లెక్కడివి? లే; వైన భక్తవత్సలుండు గావున నేకాంతభక్తులకు సులభుం డై యుండు. 180

1. కాలతంత్రము = కాలాధీనము. 2. మాతులేయుఁడు = మేనమామ కొడుకు.

సీ. అతిభక్తి నెవ్వనియందుఁ జిత్తముఁ జేర్చి, యెవ్వని నామము నూహించి పొగడి,
కాయంబు విడుచుచుఁ గామకర్మాదినిర్మూలితుండై యోగి ముక్తి నొందు?
నట్టి సర్వేశ్వరుం డఖిలదేవోత్తముఁ డెవ్వేళఁ బ్రాణంబు లేను విడుతు
నందాఁక నిదె మహాహర్షుఁడై, వికసితవదనారవిందుఁడై వచ్చె నేఁడు;

తే. నాల్గుభుజములుఁ, గమలాభనయనయుగము-నొప్పఁగన్నులముందట నున్నవాఁడు
మానవేశ్వర! నాభాగ్యమహిమఁ జూడు-మేమి సేసితినో పుణ్య మితనిఁ గూర్చి!"

వ. అని యిట్లు ధనంజయసంప్రాపితశరపంజరుం డయిన కురుకుంజరుని వచనంబు లాకర్ణించి, మును లందఱు వినుచుండ, ధర్మనందనుండు మందాకినీనందనువలన నరజాతిసాధారణంబు లగు ధర్మంబులును, వర్ణాశ్రమధర్మంబులును, రాగవైరాగ్యోపాధులతోఁ గూడిన [1]ప్రవృత్తినివృత్తిధర్మంబులును, దానధర్మంబులును, రాజధర్మంబులును, స్త్రీలధర్మంబులును, శమదమాదికంబులును, హరితోషణంబు లగు ధర్మంబులును, ధర్మార్థకామమోక్షంబులును, నానావిధోపాఖ్యానేతిహాసంబులును సంక్షేపవిస్తారరూపంబుల నెఱింగె; నంత రథికసహస్రంబులకు [2]గమికాఁడైన భీష్ముండు స్వచ్ఛందమరణుఁడైన యోగీశ్వరులచేత వాంఛితం బగు నుత్తరాయణంబు సనుదెంచిన, నది తనకు మరణోచితకాలం బని నిశ్చయించి, 182

శా. ఆలాపంబులు మాని, చిత్తము మనీషాయత్తముం జేసి, దృ
గ్జాలంబుల్ హరిమోముపైఁ బఱపి; తత్కారుణ్యదృష్టిన్ విని
ర్మూలీభూతశరవ్యథానిచయుఁడై, మోదించి, భీష్ముండు సం
శీలం బొప్ప నుతించెఁ గల్మషగజశ్రేణీహరిన్ శ్రీహరిన్. 183

వ. ఇట్లు పీతాంబరధారియుఁ, జతుర్భుజుండును, నాదిపూరుషుండునుఁ, బరమేశ్వరుండు నగు హరియందు నిష్కాముండై విశుద్ధం బగు ధ్యానవిశేషంబుచే నిరస్తదోషుం డగుచు ధారణావతి యైన బుద్ధిని సమర్పించి, పరమానందంబు నొంది, ప్రకృతివలన నైన సృష్టిపరంపరలఁ బరిహరించు తలంపున మందాకినీనందనుం డిట్లనియె: 184

### భీష్ముఁడు శ్రీకృష్ణుని స్తుతించుట

మ. "త్రిజగన్మోహనశీలకాంతిఁ దను వుద్దీపింపఁ, బ్రాభాతనీ
రజబంధుప్రభ మైన చేలము పయిన్ రంజిల్ల, నీలాలక
వ్రజసంయుక్తముఖారవింద మతిసేవ్యంబై విజృంభింప, మా
విజయుం జేరెడు వన్నెకాఁడు మది నావేశించు నెల్లప్పుడున్. 185

మ. హయరింఖాముఖధూళిధూసరపరిన్యస్తాలకోపేతమై,
రయజాతశ్రమతోయబిందుయుతమై రాజిల్లు నెమ్మోముతో

1. ప్రవృత్తి నివృత్తులు = సంసార మోక్షములు. 2. గమికాఁడు = అధికారి, సేనాపతి.

జయముం బార్థున కిచ్చు వేడ్కనని నా శస్త్రాహతిం జాల నొ
చ్చియుఁ బోరించు మహానుభావు మదిలోఁ జింతింతు నశ్రాంతమున్. 186

మ. నరుమాటల్ విని, నవ్వుతో నుభయసేనామధ్యమక్షోణిలోఁ
బరు లీక్షింప రథంబు నిల్పి, పరభూపాలావళిం జూపుచుం,
బరభూపాయువు లెల్లఁ జూపులన శుంభత్కేళి వంచించు నీ
పరమేశుండు వెలుంగుచుండెడును హృత్పద్మాసనాసీనుఁడై. 187

క. తనవారిఁ జంపఁ జాలక - వెనుకకుఁ బో నిచ్చగించు విజయుని శంకన్
ఘనయోగవిద్యఁ బాపిన - మునివంద్యుని పాదభక్తి మొనయున్ నాకున్. 188

సీ. కుప్పించి యెగసినఁ గుండలంబుల కాంతి గగనభాగంబెల్లఁ గప్పికొనఁగ,
నుఱికిన నోర్వక యుదరంబులో నున్న జగముల[1] వ్రేఁగున జగతి గదలఁ,
జక్రంబుఁ జేపట్టి చనుదెంచురయమునఁ బైనున్న పచ్చనిపటము జాఱ,
నమ్మితి; నాలావు నగుఁబాటు సేయక మన్నింపు మని క్రీడి మరలఁ దిగువఁ,

తే. గరికి లంఘించుసింహంబుకరణి మెఱసి-నేఁడు భీష్ముని జంపుదు; నిన్నుఁ గాతు;
విడువు మర్జున యనుచు మద్విశిఖవృష్టిఁ-దెరలి చనుదెంచు దేవుండు దిక్కు నాకు.

మ. తనకున్ భృత్యుఁడు, వీనిఁ గాచుట మహాధర్మంబు వొమ్మంచు న
ర్జునసారథ్యము పూని, పగ్గములు చేఁ జోద్యంబుగాఁ బట్టుచున్,
[2]మునికోలన్ వడిఁ బూన్చి ఘోటకములన్ మోదించి తాడించుచున్
జనులన్ మోహము నొందఁజేయు పరమోత్సాహుం బ్రశంసించెదన్. 190

క. పలుకుల, నగవుల, [3]నడపుల, - నలుకల, నవలోకనముల నాభీరవధూ
కులముల మనముల తాలిమి - కొలుకులు వదలించు ఘనునిఁ గొలిచెద మదిలోన్.

ఆ. మునులు, నృపులుఁ జూడ మును ధర్మజుని సభా-మందిరమున యాగమండపమునఁ
జిత్రమహిమతోడఁ జెలువొందు జగదాది-దేవుఁ డమరు నాదుదృష్టియందు. 192

మ. ఒకసూర్యుండు సమస్తజీవులకుఁ దా నొక్కొక్కఁడై తోఁచు పో
లిక నేదేవుఁడు సర్వకాలము మహాలీలన్ నిజోత్పన్నజ
న్యకదంబంబుల హృత్సరోరుహములన్ నానావిధానూనరూ
పకుఁడై యొప్పుచు నుండు; నట్టిహరి నేఁ బ్రార్థింతు శుద్ధుండనై.'' 193

వ. అని యిట్లు మనోవాగ్దర్శనంబులం బరమాత్ముండగు కృష్ణుని హృదయంబున నిలిపికొని, నిశ్శ్వాసంబు మాని, నిరుపాధికంబయిన వాసుదేవబ్రహ్మంబునందుఁ గలిసిన భీష్మునిం జూచి, సర్వజనులు దివసావసానంబున విహంగంబు లూరక యుండు తెఱంగున నుండిరి; దేవమానవ వాదితంబులై దుందుభినినాదంబులు

---

1. వ్రేఁగు = బరువు. 2. మునికోల = ములుకోలతుదఁ ఱాపాంతరము. 3. నడపులు = ప్రవర్తనములు.

మొఱసె; సాధుజనకీర్తనంబులు మెఱసెఁ; గుసుమవర్షంబులు గురిసె; మృతుం డయిన భీష్మునికి ధర్మజుండు పరలోకక్రియలు సేయించి ముహూర్తమాత్రంబు దుఃఖితుం డయ్యె; నంత నచ్చటి మునులు గృష్ణునిఁ దమ హృదయంబుల నిలిపి కొని సంతుష్టాంతరంగులగుచుం, దదీయదివ్యావతారనామంబులచే స్తుతి యించి స్వాశ్రమంబులకుం జనిరి; పిదప నయ్యుధిష్ఠిరుండు గృష్ణసహితుం డై గజపురంబునకుం జని, గాంధారీసమేతుం డయిన ధృతరాష్ట్రు నొడంబఱిచి, తత్సమ్మతంబున వాసుదేవానుమోదితుం డై, పితృపైతామహం బైన రాజ్యంబుఁ గైకొని, ధర్మమార్గంబునం బ్రజాపాలనంబు సేయుచుండె'' నని చెప్పిన విని సూతునకు శౌనకుం డిట్లనియె: 194

ఆ. ''ధనము లపహరించి తనతోడఁ జెనకెడు - [1]నాతతాయిజనుల నని వధించి,
బంధుమరణదుఃఖభరమున ధర్మజుం - డెట్లు రాజ్యలక్ష్మి నిచ్చగించె?'' 195

వ. అనిన సూతుం డిట్లనియె: 196

క. ''కురుసంతతికిఁ బరీక్షి - న్నరవరు నంకురముఁ జేసి, నారాయణుఁ డీ
ధరణీరాజ్యమునకు నీ - శ్వరుఁగా ధర్మజుని నిలిపి సంతోషించెన్. 197

వ. ఇట్లు ధర్మనందనుండు భీష్ముని వచనంబులం, గృష్ణుని సంభాషణంబులం బ్రసిద్ధ మానవిజ్ఞానుండును, నివర్తితశంకాకలంకుండును నై, నారాయణాశ్రయుం డైన యింద్రుండునుంబోలెఁ జతుస్సాగరవేలాలంకృతం బగు వసుంధరామండలంబు సహోదరసహాయుం డై యేలుచుండె. 198

సీ. సంపూర్ణవృష్టిఁ బర్జన్యుండు గురియించు; నిల యెల్లకోర్కులఁ నీనుచుండు;
గోవులు వర్షించు ఘోషభూములఁ బాలు; ఫలవంతములు లతాపాదపములు;
పండు సస్యములు దప్పక ఋతువుల నెల్ల; ధర్మ మెల్లెడలను దనరుచుండు;
దైవభూతాత్మతంత్రము లగు రోగాదిభయములు సెందవు ప్రజల కెందుఁ;

ఆ. గురుకులోత్తముండు గుంతీతనూజుండు - దానమానఘనుఁడు ధర్మజుండు
సత్యవాక్యధనుఁడు సకలమహీరాజ్య - విభవభాజి యయిన వేళయందు. 199

## శ్రీకృష్ణుఁడు ద్వారకానగరమున కేఁగుట

వ. అంతఁ గృష్ణుండు చుట్టాలకు శోకంబు లేకుండం జేయుకొఱకును, సుభద్రకుఁ బ్రియంబు సేయుటకును గజపురంబునం గొన్నినెల లుండి, ద్వారకానగరంబు నకుం బ్రయాణంబు సేయందలంచి, ధర్మనందనునకుం గృతాభివందనుం డగుచు, నతనిచే నాలింగితుం డై, [2]యామంత్రణంబు వడసి, కొందఱు దనకు నమస్క రించినం గౌఁగిలించికొని, కొందఱు దనుం గౌఁగిలింప నానందించుచు రథారోహ ణంబు సేయునవసరంబున సుభద్రయు, ద్రౌపదియుఁ, గుంతియు, నుత్తరయు,

1. ఆతతాయిజనులు = దుర్మార్గులు. 2. ఆమంత్రణము = అనుమతి.

గాంధారియు, ధృతరాష్ట్రుండును, విదురుండును, యుధిష్ఠిరుండును, యుయుత్సుం డును, కృపాచార్యుండును, నకులసహదేవులును, వృకోదరుండును, ధౌమ్యుం డును సత్సంగంబువలన ముక్తదుస్సంగుం డగు బుధుండు సత్కృతాకాలసంకీర్త్య మానంబై రుచికరం బగు నెవ్వని యశంబు నాకర్ణించి విడువ నోపం డట్టి హరితోడి వియోగంబు సహింపక, దర్శనస్పర్శనాలాపశయనాసనభోజనంబుల వలన నిమిషమాత్రంబును హరికి [1]నెడ లేనివార లైన పాండవులం గూడికొని హరి మరల వలయునని కోరుచు, హరి చనిన మార్గంబు సూచుచు, హరి విన్యస్తచిత్తులయి, లోచనంబుల బాష్పంబు లొలుక నంతనంత నిలువంబడి; రయ్యవసరంబున. 200

సీ. కనకసౌధములపైం గౌరవకాంతలు గుసుమవర్షంబులు గోరి కురియ,
మౌక్తికదామసమంచితధవళాతపత్రంబు విజయుండు వట్టుచుండ,
నుద్ధవసాత్యకు లుత్సాహవంతులై రత్నభూషితచామరములు వీవ,
గగనాంతరాళంబుఁ గప్పి కాహళభేరి పటహశంఖాదిశబ్దములు మొఱయ,

ఆ. సకలవిప్రజనులు సగుణనిర్గుణరూప - భద్రభాషణములు పలుకుచుండ,
భువనమోహనుండు పుండరీకాక్షుండు - పుణ్యరాశి హస్తిపురము వెడలె. 201

వ. తత్సమయంబునం బౌరసుందరులు ప్రాసాదశిఖరభాగంబుల నిలిచి, గోపాలసుంద రుని సందర్శించి, వర్గంబులై, మార్గంబు రెండుదెసలఁ గరారవిందంబులు సాఁచి యొండొరులకుం జూపుచుం, దమలోనం, దొల్లి గుణంబులం గూడక జీవులు లీనరూపంబులై యుండం బ్రపంచంబు ప్రవర్తింపనిసమయంబున నొంటి దీపించు పురాణపురుషుం డితం డనువారును, జీవులకు బ్రహ్మత్వంబు గలుగ లయంబు సిద్ధించుట యెట్లనువారును, జీవోపాధిభూతంబు లయిన సత్త్వాదిశక్తుల లయంబు జీవుల లయం బనువారును, గ్రమ్మఱ శాస్త్రకర్త యైన యప్పరమేశ్వ రుండు నిజవీర్యప్రేరిత యై నిజాంశభూతంబు లైన జీవులకు మోహిని యగుచు సృష్టిసేయ నిచ్చించి నామరూపంబులు లేని జీవులందు నామరూపంబులు గల్పించుకొఱకు వర్తిల్లు స్వమాయ నంగీకరించు ననువారును, నిర్మలభక్తి సముత్కంఠా విశేషంబుల నకుంఠితు లై జితేంద్రియు లగు విద్వాంసు లిమ్మ హానుభావు నిజరూపంబు దర్శింతు రనువారును, యోగమార్గంబునం గాని దర్శింపరా దనువారును నై, మఱియును— 202

మ. "రమణీ! దూరము వోయెఁ; గృష్ణురథముం గానరా దింక వీక్షింప; నీ
కమలాక్షుం బొడగాన లేని దినముల్ గల్పంబు లై తోఁచు; గే
హములం దుండఁగ నేల? పోయి పరిచర్యల్ సేయుచుం గాని మ్మి నుం
దము రమ్మా" యనె నొక్క చంద్రముఖి కందర్పాశుగభ్రాంత యై. 203

1. ఎడ లేని వారు = దూరము కాని వారు.

మ. "తరుణీ! యాదవరాజు గాఁ డితఁడు; వేదవ్యక్తుఁ డై యొక్కఁడై
వరుసన్ లోకభవస్థితిప్రళయముల్ వర్తిల్లఁగాఁ జేయు ను
త్తరలీలారతుఁ డైన యీశుఁ; డితనిన్ దర్శించితిం; బుణ్యభా
సుర నే" నంచు నటించె నొక్కతె మహాశుద్ధాంతరంగంబునన్. 204

క. "తామసగుణు లగు రాజులు - భూమిం బ్రభవించి ప్రజలఁ బొలియింపఁగ స
త్త్వామలతనుఁ డై యీతఁడు - భామిని! వారల వధించుఁ బ్రతికల్పమునన్.

వ. ఇదియునుం గాక— 206

సీ. ఈ యుత్తమశ్లోకుఁ డెలమి జన్మింపంగ యాదవకుల మెల్ల సనఘ మయ్యె;
నీ పుణ్యవర్తనుఁ డేప్రొద్దు నుండంగ మథురాపురము దొడ్డమహిమఁ గనియెఁ;
నీ పూరుషశ్రేష్ఠు నీక్షింప భక్తితో ద్వారకావాసులు ధన్యు లైరి;
యీ మహాబలశాలి యెఱిఁగి శిక్షింపంగ నిష్కంటకం బయ్యె నిఖిలభువన;

తే. మీ జగన్మోహనాకృతి నిచ్చగించి - పంచశర[1]భల్లజాలవిభజ్యమాన
విమలమానస మై [2]వల్లవీసమూహ - మితని యధరామృతము గ్రోలు నల్లప్రొద్దు.

ఉ. ఈ కమలాక్షు, నీ సుభగు, నీ కరుణాంబుధిఁ బ్రాణనాథుఁ గాఁ
జేకొని వేడ్కఁ గాఁపురము సేయుచు నుండెడు రుక్మిణీముఖా
నేకపతివ్రతల్ నియతి నిర్మలమానస లై జగన్నుతా
స్తోకవిశేషతీర్థములఁ దొల్లిటిబాముల నేమి నోఁచిరో!" 208

వ. అని యిట్లు నానావిధంబులుగాఁ బలుకు పురసుందరుల వచనంబు లాకర్ణించి,
కటాక్షించి, నగుచు నగరంబు వెడలె; ధర్మజుండును హరికి రక్షకంబుగాఁ
గొలిచి నడవం జతురంగబలంబులం బంచినఁ, దత్సేనాసమేతుం డై పాండవ
వియోగంబునకోర్వక దూరంబు వెనుతగిలిన కౌరవుల మరలించి, కురుజాంగల
పాంచాల దేశంబులు దాఁటి, శూరసేనయామునభూములం గడచి, బ్రహ్మావర్త
కురుక్షేత్రమత్స్యసారస్వతమరుధన్వసౌవీరాభీరసైంధవవిషయంబు లతిక్రమించి,
తత్తద్దేశవాసు లిచ్చిన కానికలు గైకొనుచు నానర్తమండలంబు సొచ్చి,
పద్మబంధుండు పశ్చిమ సింధునిమగ్నుం డయిన సమయంబునఁ బరిశ్రాంత
వాహుం డై చనిచని, 209

## శ్రీకృష్ణుఁడు ద్వారకానగరముఁ బ్రవేశించుట

మ. జలజాతాక్షుఁడు శౌరి డగ్గఱె మహాసౌధాగ్రబృందారకం,
గలహంసావృతహేమపద్మపరిఖాకాసారకం, దోరణా
వళిసంఛాదితతారకం, దరులతావర్గానువేలోదయ
త్ఫలపుష్పాంకురకోరకన్, మణిమయప్రాకారకన్, ద్వారకన్. 210

1. భల్లము = బాణము. 2. వల్లవీసమూహము = గోపికల సమూహము.

వ. ఇట్లు దన ప్రియపురంబు డగ్గఱి, 211

మత్తకోకిలము. అన్యసన్నుత సాహసుండు మురారి యొత్తె యదూత్తముల్
ధన్యులై వినఁ బాంచజన్యము, దారితాఖిలజంతుచై
తన్యమున్, భువనైకమాన్యము, దారుణస్వనభీతరా
జన్యమును, బరిమూర్ఛితాఖిలశత్రుదానవ సైన్యమున్. 212

శా. శంఖారావము వీనులన్ విని జనుల్ స్వర్ణాంబరద్రవ్యముల్
[1]శంఖాతీతము గొంచు వచ్చిరి దిదృక్షాదర్పితోత్కంఠ న
ప్రేంఖద్భక్తులు వంశకాహళమహాభేరీగజాశ్వావళీ
రింఖారావము లుల్లసిల్ల దనుజారిం జూడ నాసక్తులై. 213

క. బంధులుఁ, బౌరులుఁ దెచ్చిన - గంధేభహయాదులైన కానికలు దయా
సింధుఁడు గైకొనె నంబుజ-బంధుఁడు గొను దత్తదీపపంక్తుల భంగిన్. 214

వ. ఇట్లాత్మారాముండును, బూర్ణకాముండును నైన యప్పరమేశ్వరునికి నుపాయ
నంబు లిచ్చుచు నాగరులు వికసితముఖు లయి, గద్గదభాషణంబులతోడ,
డయ్యకుండ నడపునయ్యకు నెయ్యంపుఁజూపుల నడ్డంబు లేని బిడ్డలచందంబున
మ్రొక్కి యి ట్లనిరి : 215

శా. "నీ పాదాబ్జము బ్రహ్మపూజ్యము గదా, నీ సేవ సంసారసం
తాపధ్వంసిని యౌఁ గదా, సకలభద్రశ్రేణులం బ్రీతితో
నాపాదింతు గదా [2]ప్రపన్నులకుఁ, గాలాధీశ! కాలంబు ని
ర్వ్యాపారంబు గదయ్య! చాలరు నినున్ వర్ణింప బ్రహ్మాదులున్. 216

క. ఉన్నారము సౌఖ్యంబున; - విన్నారము నీ ప్రతాపవిక్రమకథలన్;
మన్నారము ధనికులమై; - కన్నారము తావకాంఘ్రికమలములు హరీ! 217

క. ఆరాటము మది నెఱుఁగము; - పోరాటము లింద్లకడలఁ బుట్టవు; పురిలోఁ
జోరాటన మెనయదు; నీ - దూరాటన మోర్వలేము తోయజనేత్రా! 218

ఉ. తండ్రుల కెల్లఁ దండ్రి యగు ధాతకుఁ దండ్రివి దేవ! నీవు మా
తండ్రివిఁ, దల్లివిం, బతివి, దైవమవున్, సఖివిన్, గురుండవుం;
దండ్రులు నీక్రియం బ్రజల ధన్యులఁ జేసిరె? వేల్పులైన నో
తండ్రి! భవన్ముఖాంబుజము ధన్యతఁ గానరు మావిధంబునన్. 219

క. చెచ్చెరఁ గరినగరికి నీ - విచ్చేసిననిమిష మైన వేయేం డ్లగు మా;
కెచ్చోటికి విచ్చేయక - మచ్చికతో నుండ వయ్య! మానగరమునన్. 220

ఆ. అంధకారవైరి యపరాద్రియవ్వలఁ - జనిన నంధ మయిన జగముభంగి
నిన్నుఁ గానకున్న నీరజలోచన-యంధతమసయుతుల మగుదు మయ్య!" 221

---

1. శంఖాతీతము = లెక్కకు మీఱినది. 2. ప్రపన్నులు = శరణాగతి పొందినవారు.

వ. అని యిట్లు ప్రజ లాడెడి భక్తియుక్తమధురమంజులాలాపంబులు గర్ణ[1]కలాపంబులుగా నవధరించి, కరుణావలోకనంబులు వర్షించుచు, హర్షించుచుఁ, దన రాక విని మహానురాగంబున సంరంభవేగంబుల మజ్జనభోజనశయనాదికృత్యంబు లొల్లక యుగ్రసేనాక్రూర వసుదేవ బలభద్ర ప్రద్యుమ్న సాంబ చారుదేష్ణ గద ప్రముఖయదుకుంజరులు కుంజరతురగరథారూఢులై, దిక్కుంజరసన్నిభంబయిన యొక్కకుంజరంబు ముందట నిడుకొని, సూతమాగధనటనర్తకవంది సందోహంబుల మంగళభాషణంబులును, భూసురాశీర్వాదవేదఘోషణంబులును, వీణావేణుభేరీపటహశంఖకాహళధ్వానంబులును, రథారూఢ విభూషణభూషిత వారయువతిగానంబులును నసమానంబులై చెలంగ, నెదురుకొని, యథోచితప్రణామాభివాదన పరిరంభకరస్పర్శ సంభాషణమందహాససందర్శనాది విధానంబుల బహుమానంబులు సేసి, వారలుం దానును భుజంగేంద్రపాలితంబైన భోగవతీనగరంబు చందంబున స్వసమానబల యదు భోజ దశార్హ కుకురాంధక వృష్ణివీరపాలితంబును, సకలకాలసంపద్యమానాంకుర పల్లవకోరక కుట్మల కుసుమ ఫలమంజరీపుంజభారవినమితలతాపాదపరాజీవిరాజితోద్యాన మహావనోపవనారామభాసితంబును, వనాంతరాళరసాలసాలశాఖాంకురఖండనతుణ్ణకషాయకంఠకలకంఠమిథునకోలాహల ఫలరసాస్వాద పరిపూర్ణ శారికాకీరకుల కలకల కహ్లారపుష్పమకరందపాన పరవశ భృంగభృంగీకదంబ ఝుంకార సరోవర కనకకమల మృదులకాండ ఖండ స్వీకారమత్తవరటాయత్తకలహంసనివహ క్రేంకారసహితంబును, మహోన్నతసౌధజాలరంధ్రనిర్గతకర్పూర ధూపధూమపటల సందర్శనసంజాత జలధర భ్రాంతి విభ్రాంత సముద్ధత సింఛనర్తన ప్రవర్తమాన మత్తమయూర కేకారవ మహితంబును, నానారూపతోరణధ్వజ వైజయంతికానికాయనిరుద్ధతారకాగ్రహ ప్రకాశంబును, ముక్తాఫలవిరచితరంగవల్లికాలంకృతమందిరద్వార దేహళీవేదికా ప్రదేశంబును, ఘనసార గంధసార కస్తూరికా సంవాసిత వణిగ్గృహ దేహళీనికరకనక[2]గళంతికావికీర్యమాణసలిలధారాసంసిక్త విపణిమార్గంబును, బ్రతినివాస బహిరంగణ సమర్పిత రసాలదండఫల కుసుమగంధాక్షత ధూపదీప రత్నాంబరాదివివిధోపహారవర్గంబును, బ్రవాళ నీల మరకత వజ్ర వైడూర్య నిర్మిత గోపురాట్టాలకంబును, విభవనిర్జితమహేంద్రనగరాలకంబును నైన పురవరంబుం బ్రవేశించి, రాజమార్గంబున వచ్చుసమయంబున,

మత్తకోకిలము. కన్నులారఁగ నిత్యముఙ్ హరిఁ గాంచుచుఙ్ మనువార ల
య్యు న్నవీనకుతూహలోత్సవయుక్తి నాగరకాంత ల
త్యున్నతోన్నతహర్మ్యరేఖల నుండి చూచిరి నిక్కి చే
సన్నలం దమలోనఁ దద్విభు సౌకుమార్యము సూపుచున్. 223

1. కలాపము = భూషణము. 2. గళంతిక = గిండిచెంబు, లేక గిండిపాత్ర.

సీ. కలుముల నీనెడు కలకంఠి యెలనాఁగ వర్తించు నెవ్వాని వక్షమందు?
జనదృక్చకోరకసంఘంబునకు సుధాపానీయపాత్ర మేభవ్యు ముఖము?
సకలదిక్పాలకసమితికి నెవ్వాని బాహుదండంబులు పట్టుఁగొమ్మ?
లాశ్రితశ్రేణి కేయధిపుని పాదరాజీవయుగ్మంబులు సేరుగడలు?
ఆ. భువనమోహనుండు పురుషభూషణుఁ డెవ్వఁ-డట్టికృష్ణుఁ డరిగె హర్మ్యశిఖర
రాజమాన లగుచు రాజమార్గంబున-రాజముఖులు గుసుమరాజిఁ గురియ. 224

మ. జలజాతాక్షుఁడు సూడ నొప్పె ధవళచ్ఛత్త్రంబుతోఁ, జామరం
బులతోఁ, బుష్పపిశంగచేలములతో, భూషామణిస్ఫీతుఁ డై,
నళినీబాంధవుతో, శశిద్వయముతో, నక్షత్రసంఘంబుతో,
బలభిచ్చాపముతోఁ, దటిల్లతికతో భాసిల్లు మేఘాకృతిన్. 225

వ. ఇట్లరిగి, తల్లిదండ్రుల నివాసంబు సొచ్చి, దేవకీప్రముఖ లయిన తల్లుల కేద్వొ
రకు మ్రొక్కిన, 226

క. బిడ్డఁడు మ్రొక్కినఁ దల్లులు – [1]జడ్డన నంకముల నునిచి చన్నులతుదిఁ బా
లొడ్డగిలఁ బ్రేమభరమున – [2]జడ్డువడం దడిపి రక్షిజలముల ననఘా! 227

### శ్రీ కృష్ణుఁ డంతఃపురకాంతలను జూడఁబోవుట

వ. తదనంతరంబ యష్టోత్తరశతషోడశసహస్రసౌవర్ణసౌధకాంతం బయిన శుద్ధాంత
భవనంబు సొచ్చి, హరి దన మనంబున, 228

మ. ఒక దేవీభవనంబు మున్ను సొర వేఱొక్కర్తు లోఁ గుందునో,
సుకరాలాపము లాడదో, సొలయునో, సుప్రీతి నీక్షింపదో,
వికలత్వంబున నుండునో యనుచు నవ్వేళన్ వధూగేహముల్
ప్రకటాశ్చర్యవిభూతిఁ జొచ్చె బహురూపవ్యక్తుఁ డై భార్గవా! 229

వ. ఆసమయంబున, 230

క. శిశువులఁ జంకల నిడి తను – కృశతలు విరహాగ్నిఁ దెలుప, గృహగేహములన్
రశనలు జాఱఁగ సిగ్గున – శశిముఖు లెదురేఁగి రపుడు జలజాక్షునకున్. 231

మ. "పతి నాయింటికి మున్ను వచ్చె; నిదె నాప్రాణేశుఁ డస్మద్గృహా
గతుఁ డయ్యెన్ మును; సేరెఁ బో తొలుత మత్కాంతుండు నాశాల; కే
నితరాలభ్య సుఖంబుఁ గంటి" నని తా రింటింట నర్చించి ర
య్యతివల్ నూఱుఁ బదాఱువేలు నెనమం డ్రవ్వేళ నాత్మేశ్వరున్. 232

వ. వారలం జూచి హరి యిట్లనియె: 233

---

1. జడ్డన = తటాలున. 2. జడ్డువడు = జడతనొందు.

మ. "కొడుకుల్ భక్తివిధేయు లౌదురు గదా? కోడండ్రు మీవాక్యముల్
గడవం జాలక యుందురా? విబుధసత్కారంబు గావింతురా?
తొడవుల్, వస్త్రములుం, బదార్థరససందోహంబులుం జాలునా?
కడమల్ గావు గదా? భవన్నిలయముల్ గల్యాణయుక్తంబులే? 234

సీ. తిలక మేటికి లేదు తిలకినీతిలకమ! పువ్వులు ముడువవా పువ్వుఁబోఁడి!
కస్తూరి యలఁదవా కస్తూరికాగంధి! తొడవులు దొడవవా తొడవుతొడవ!
కలహంసఁ బెంపవే కలహంసగామిని! కీరముఁ జదివింతె కీరవాణి!
లతలఁ బోషింతువా లతికాలలితదేహ! సరసి నోలాడవే సరసిజాక్షి!

ఆ. మృగికి మేఁత లిడుదె మృగశాబలోచన! - గురుల నాదరింతె గురువివేక!
బంధుజనులఁ బ్రోతె బంధుచింతామణి!"-యనుచు సతుల నడిగె నచ్యుతుండు.

వ. అని యడిగిన, వారలు హరిం బాసినదినంబులందు శరీరసంస్కార కేళీవిహారహాస
వనమందిరగమనమహోత్సవదర్శనంబు లొల్లని యిల్లాండ్రు గావున, 236

మ. సిరి చాంచల్యముతోడి దయ్యెఁ, దనకుం జీవేశ్వరుం డంచు నే
పురుషశ్రేష్ఠు వరించు నట్టి పరముం బుద్ధిం, విలోకంబులం,
గరయుగ్మంబులఁ గౌఁగిలించిరి సతుల్ గల్యాణబాష్పంబు లా
భరణశ్రేణులుగాఁ బ్రతిక్షణనవప్రాప్తానురాగంబులన్. 237

మత్తకోకిలము. పంచబాణుని [1]నీఱుసేసిన భర్గునిం దనవిల్లు వ
ర్జించి మూర్ఛిలఁ జేయఁ జాలు విశేషహాసవిలోకనో
దంచితాకృతు లయ్యుఁ గాంతలు [2]దంభచేష్టల మాధవుం
జంచలింపఁగఁ జేయ నేమియుఁ జాల రైరి బుధోత్తమా! 238

వ. ఇవ్విధంబున సంగవిరహితుం డైన కంసారి సంసారికైవడి విహరింప, నజ్ఞాన
విలోకులయిన లోకులు లోకసామాన్యమనుష్యుం డని తలంతు; రాత్మాశ్రయ
యైన బుద్ధి యాత్మయందున్న యానందాదులతోడం గూడని తెఱంగున నీశ్వ
రుండు ప్రకృతితోడం గూడియు నా ప్రకృతిగుణంబు లైన సుఖదుఃఖంబులఁ
జెందక యుండుఁ; బరస్పరసంఘర్షణంబులచే వేణువులవలన వహ్నిఁ బుట్టించి
వనంబుల దహించు మహావాయువుచందంబున భూమికి భారహేతువులై యనేకా
క్షౌహిణులతోడం బ్రవృద్ధతేజు లగు రాజుల కన్యోన్యవైరంబులు గల్పించి,
నిరాయుధుం డై సంహారంబు సేసి, శాంతుం డై, పిదపం గాంతామధ్యంబునఁ
బ్రాకృతమనుష్యుండునుం బోలె సంచరించుచుండె; నాసమయంబున, 239

క. యతు లీశ్వరుని మహత్త్వము - మిత మెఱుఁగనిభంగి [3]నప్రమేయుఁ డగు హరి
స్థితి నెఱుఁగక కాముకుఁ డని - రతములు సలుపుదురు తిరిగి రమణులు సుమతీ!

1. నీఱుసేసిన = బూదిచేసిన. 2. దంభచేష్టలు = కపటపుచేష్టలు. 3. అప్రమేయుఁడు = మితి చెప్పరానివాఁడు.

క. ఎల్లప్పుడు నూాయిండ్లను - వల్లభుఁడు వసించు; నేమ వల్లభలము (శ్రీ)
వల్లభున కనుచు గోపీ - వల్లభుచే సతులు మమతవలఁ బడి రనఘా!" 241

వ. అని చెప్పిన విని శౌనకుండు సూతున కిట్లనియె: 242

**ఉత్తరకుఁ బరీక్షిత్తు జనించుట**

సీ. "గురునందనుండు సక్రోధుఁ డై యేసిన బ్రహ్మశిరోనామబాణవహ్నిఁ
గంపించు నుత్తరగర్భంబు గ్రమ్మఱఁ బద్మలోచనుచేత బ్రదికె నండ్రు;
గర్భస్థుఁ డగు బాలుఁ గంసారి యేరీతి బ్రదికించె మృత్యువుభయము వాపి?
జనియించి యతఁ డెన్ని సంవత్సరము లుండె? నెబ్బంగి వర్తించె? నేమి సేసె?
ఆ. వినుము శుకుఁడు వచ్చి విజ్ఞానపద్ధతి - నతని కెట్లు సూపె? నతఁడు పిదపఁ
దన శరీర మేవిధంబున వర్జించె? - విప్రముఖ్య! నాకు విస్తరింపు." 243

వ. అనిన సూతుం డిట్లనియె: "ధర్మనందనుండు చతుస్సముద్రముద్రితాఖిలజంబూ
ద్వీపరాజ్యంబు నార్జించియు, మిన్ను ముట్టిన కీర్తినుపార్జించియు,వంగనాతురంగ
మాతంగసుభటకాంచనాదిదివ్యసంపదలు సంపాదించియు, వీరసోదర విప్రవిద్వ
జ్జనవినోదంబులఁ బ్రమోదించియు, వైభవంబు లలవరించియుఁ, గ్రతువు లాచ
రించియు, దుష్టశిక్షణశిష్టరక్షణంబు లొనరించియు ముకుందచరణారవిందసేవా
రతుం డై, సమస్తసంగంబులందు నభిలాషంబు వర్జించి, యరిషడ్వర్గంబు
జయించి రాజ్యంబు సేయుచు, 244

తే. చందనాదుల నాఁకట [1] స్రగ్గువాఁడు-దనివి నొందనికై వడి ధర్మసుతుఁడు
సంపదలు పెక్కు గలిగియుఁ జక్రిపాద - సేవనంబులఁ బరిపూర్తి నెందకుండె.

వ. అంతం గొన్నిదినంబులకు నభిమన్యుకాంతాగర్భంబునం దున్న డింభకుండు
దశమాసపరిచ్ఛేద్యుం డై, గర్భాంతరాళంబున దురంతం బైన యశ్వత్థామ
బాణానలంబున దందహ్యమానుం డై తల్లడిల్లుచు, 246

ఉ. "కుయ్యిడ శక్తిలే; దుదరగోళములోపల నున్నవాఁడ; ది
క్కెయ్యది? దా ననాథ నని యెప్పుడుఁ దల్లి గణింప విందు; నేఁ
డియ్యిషువహ్ని వాయుటకు నెయ్యది మార్గము? నన్నుఁ గావ నే
యయ్య గలండు? గర్భజనితాపద నెవ్వఁ డెఱుంగు దైవమా! 247

క. [2]చిచ్చఱకోలవశంబునఁ - జచ్చి బహిర్గతుఁడఁ గానిసమయమునను దా
నుచ్చలితగర్భవేదనఁ - జచ్చును మాతల్లి గర్భసంతాపమునన్. 248

క. చెచ్చెర బాణజ్వాలలు - వచ్చిన విష్ణుండు గావ వచ్చు ననుచుఁ దా
ముచ్చటలు సెప్ప సతులకు - నిచ్చలు మాయవ్వ; నేఁడు నిజమయ్యెడినో? 249

1. స్రగ్గుట = అణఁగుట, తగ్గుట. 2. చిచ్చఱకోల = అగ్ని బాణము.

శా. రాఁడా చూడ సమస్తభూతములలోఁ రాజిల్లువాఁ? డిచ్చటన్
లేఁడా? పాఱుని చిచ్చుఱమ్ముఁ దొలఁగన్ లీలాగతిం ద్రోచి నా
కీడా నేఁ డభయప్రదాన మతఁ? డూహింపన్ నతత్రాత మున్
కాఁడా? యెందఱఁ గావఁ? డీయెడల మత్కార్యంబు దా నెట్టిదో!" 250

వ. అని గతాగతప్రాణుం డై, [1]భ్రూణగతుం డైన శిశువు చింతించుసమయంబున, 251

సీ. మేఘంబుమీఁది క్రొమ్మెఱుఁగుకైవడి మేనిపై నున్న పచ్చనిపటమువాఁడు,
గండభాగంబులఁ గాంచనమణిమయమకరకుండలకాంతి మలయువాఁడు,
శరవహ్ని నడఁగించు సంరంభమునఁ జేసి కన్నుల నునుఁగెంపు గలుగువాఁడు,
బాలార్కమండలప్రతిమానరత్నహాటకవిరాజితకిరీటంబువాఁడు,
తే. కంకణాంగదవనమాలికావిరాజ-మానుఁ, డసమానుఁ, డంగుష్ఠమాత్రదేహుఁ
డొక్కగదఁ జేతఁ దాల్చి నేత్రోత్సవముగ-విష్ణుఁ డావిర్భవించె నవ్వేళయందు.

వ. ఇట్లు భక్తపరాధీనుం డయిన పరమేశ్వరుం డావిర్భవించి, మంచు విరియించు
మార్తాండుచందంబున శిశువునకు దశదిశలం దనచేతి యఖండితమహోల్కా
జ్వాలాసన్నిభం బైన గదాదండంబు మండలాకారంబుగ జిఱజిఱం ద్రిప్పి, విప్రుని
చిచ్చుఱమ్ము వేఁడిమి పోఁడిమిఁ జెఱచి, డింభకుని పరితాపవిజృంభణంబు
నివారించి, గర్భంబు గందకుండ నర్భకునికి నానందంబుఁ గల్పించిన, 253

మ. "గదఁ జేఁ బట్టి పరిభ్రమించుచు, గదాఘాతంబులం గ్రూర[2]శు
క్ప్రదమై వచ్చు శరాగ్నిఁ దుత్తుమురుగా భంజించి రక్షించె; నీ
సదయుం డెవ్వఁ డొకో" యటంచు మదిలోఁ జర్చించుచున్ [3]శాబకుం
డెదురై చూడ నదృశ్యుఁ డయ్యె హరి సర్వేశుండు విప్రోత్తమా! 254

వ. అంత ననుకూలశుభగ్రహోదయంబును, సర్వగుణోత్తరఫలసూచకంబును నైన
శుభలగ్నంబునం బాండవవంశోద్ధారకుం డయిన కుమారుండు జన్మించిన, ధర్మ
నందనుండు ధౌమ్యాదిభూసురవర్గంబు రప్పించి, పుణ్యాహంబు సదివించి, జాత
కర్మంబు సేయించి, కుమారు జన్మమహోత్సవకాలంబున భూసురులకు విభవాభి
రామంబు లయిన గోభూహిరణ్యహయగ్రామంబులును, స్వాదురుచిసంపన్నంబు
లయిన యన్నంబులు నిడిన వారలు తృప్తులై, ధర్మపుత్త్రున కిట్లనిరి : 255

చ. "ప్రకటితదైవయోగమునఁ బౌరవసంతతి యంతరింపఁగా
వికలత నొందనీక ప్రభవిష్ణుఁడు విష్ణుఁ డనుగ్రహించి శా
బకు బ్రదికించెఁ గావున నృపాలక! శాబకుఁ డింక శాత్రవాం
తకుఁ డగు; విష్ణురాతుఁ డన ధాత్రిఁ బ్రసిద్ధికి నెక్కుఁ బూజ్యుఁ డై." 256

1. భ్రూణము = గర్భము. 2. శుక్ = శోకము, దుఃఖము. 3. శాబకుఁడు = పిల్లవాఁడు.

వ. అనిన విని భూదేవోత్తములకు నరదేవోత్తముం డిట్లనియె : 257

శా. "ఓపుణ్యాత్మకులార! నాపలుకు మీ రూహింపుఁడా; మ్రొక్కెదన్;
మా పెద్దల్ శ్రుతకీర్తులై, సదయులై మన్నారు రాజర్షులై;
యీపిన్నాతఁడు వారిఁ బోలెడిఁ గదా, యెల్లప్పుడున్ మాధవ
శ్రీపాదాంబుజభక్తియుక్తుఁ డగుచున్ జీవించునే? చూడరే!" 258

వ. అనిన విని "నరేంద్రా! భవదీయపౌత్త్రుండు మనుపుత్త్రుండయిన యిక్ష్వాకుని చందంబునం బ్రజల రక్షించు; శ్రీరామచంద్రుని భంగి [1]బ్రహ్మణ్యుండు, సత్యప్రతిజ్ఞుండు నగు; డేగ వెంట నంటిన బిట్టు భీతం బై [2]వెనుకకు వచ్చిన కపోతంబుఁ గాచిన శిబిచక్రవర్తిరీతి శరణ్యుండును, వితరణఖనియు నగు; దుష్యంతసూనుం డైన భరతు పగిది జ్ఞాతివర్గంబులకు, యజ్వలకు ననర్ఘళకీర్తి విస్తరించు; ధనంజయకార్తవీర్యుల కరణి ధనుర్ధరాగ్రేసరుం డగుఁ; [3]గీలిపోలిక దుర్ధర్షుం డగు; సముద్రుని తెఱంగున దుస్తరుం డగు; మృగేంద్రంబుకైవడి విక్రమశాలి యగు; వసుమతివోలె నక్షయ క్షాంతియుక్తుం డగు; భానునిలాగునఁ బ్రతాపవంతుం డగు; వాసుదేవువడువున సర్వభూతహితుం డగుఁ; దల్లిదండ్రులమాడ్కి సహిష్ణుం డగు; మఱియును, 259

సీ. సమదర్శనంబున జలజాతభవుఁ డనఁ, బరమప్రసన్నత భర్గుఁ డనఁగ,
నెల్లగుణంబుల నిందిరావిభుఁ డన, నధికధర్మమున యయాతి యనఁగ,
ధైర్యసంపద బలిదైత్యవల్లభుఁ డన, నచ్యుతభక్తిఁ బ్రహ్లాదుఁ డనఁగ,
రాజితోదారత రంతిదేవుం డన, నాశ్రయమహిమ హిమాద్రి యనఁగ,

తే. యశము వర్ధించుఁ; బెద్దల నాదరించు; - నశ్వమేధంబు లొనరించు; నాత్మసుతుల
ఘనులఁ బుట్టించు; దండించు ఖలులఁ బట్టి - మానధనుఁడు నీ మనుమఁడు మానవేంద్ర!

భుజంగప్రయాతము. హరించుం గలిప్రేరితాఘంబు లెల్లన్ ;
భరించున్ ధరన్ రామభద్రుండుఁ బోలెం ;
జరించున్ సదా వేదశాస్త్రానువృత్తిన్;
వరించున్ విశేషించి వైకుంఠ భక్తిన్. 261

వ. ఇట్లు పెక్కేండ్లు జీవించి, భూసురకుమారకప్రేరితం బయిన తక్షకసర్పవిషానలంబునం దనకు మరణం బని యెఱింగి, సంగవర్జితుం డయి, ముకుందపదారవింద భజనంబు సేయుచు, శుకయోగీంద్రునివలన నాత్మవిజ్ఞానసంపన్నుం డై, గంగాతటంబున శరీరంబు విడిచి, నిర్గతభయశోకం బయిన లోకంబుఁ బ్రవేశించు" నని జాతకఫలంబు సెప్పి, లబ్ధకాము లయి, భూసురులు సని; రంత, 262

క. తనతల్లికడుపులోపల - మును సూచిన విభుఁడు విశ్వమున నెల్లఁ గలం
డనుచుఁ బరీక్షింపఁగ జను - లనఘుఁ బరీక్షిన్నరేంద్రుఁ డండ్రు మునీంద్రా! 263

---

1. బ్రహ్మణ్యుఁడు = బ్రాహ్మణహితుఁడు. 2. వెనుకకువచ్చిన = శరణుజొచ్చిన. 3. కీలి = అగ్ని.

ఆ. కళలచేత [1]రాజు గ్రమమునఁ బరిపూర్ణుఁ - డయినభంగిఁ ధాత లనుదినంబుఁ
బోషణంబు సేయఁ బూర్ణుఁ డయ్యెను ధర్మ - పటలపాలకుండు బాలకుండు. 264

వ. మఱియు ధర్మనందనుండు బంధుసంహారదోషంబు వాయుకొఱకు నశ్వమేధయాగంబు సేయం దలంచి, ప్రజలవలనం [2]గరదండంబుల నుపార్జితం బయిన విత్తంబు చాలక చిత్తంబునఁ జింతించునెడ, నచ్యుతప్రేరితులై భీమార్జునాదులు దొల్లి మరుత్తుం డను రాజు మఖంబు సేసి పరిత్యజించి నిక్షేపించిన సువర్ణపాత్రాదికం బైన విత్తం బుత్తరదిగ్భాగంబువలన బలవంతులై తెచ్చిన, నా రాజసత్తముండు సమాయత్తయజ్ఞోపకరణుం డై, సకలబంధుసమేతంబుగఁ గృష్ణుని నాహ్వానంబు సేసి, పురుషోత్తము నుద్దేశించి మూఁడుజన్నంబులు గావించెఁ; దదనంతరంబ కృష్ణుండు బంధుప్రియంబుకొఱకుఁ గరినగరంబునఁ గొన్ని నెల లుండి, ధర్మపుత్త్రాదులచే నామంత్రణంబు వడసి, యాదవసమేతుం డయి, ధనంజయుండు తోడ రా నిజనగరంబునకుం జనియె; నంత విదురుండు తీర్థయాత్ర సని మైత్రేయుముందటఁ గర్మయోగవ్రతాదివిషయంబు లయిన ప్రశ్నంబులఁ గొన్నిటిం జేసి యతనివలన నాత్మవిజ్ఞానంబు దెలిసి కృతార్థుం డై హస్తిపురంబునకు వచ్చిన, 265

క. బంధుఁడు వచ్చె నటంచును - గాంధారీవిభుఁడు మొదలుగా నందఱు సం
బంధములు నెఱపి ప్రీతి న - మంథరగతిఁ జేసి రపుడు మన్నన లనఘా! 266

వ. అంత ధర్మనందనుండు విదురునికి మజ్జనభోజనాదిసత్కారంబులు సేయించి, సుఖాసీనుం డై, తనవార లందఱు విన ని ట్లనియె: 267

సీ. "ఏవర్తనంబున నింతకాలము మీరు సంచరించితి రయ్య? జగతిలోన
నే[3]తీర్థములు గంటి? రెక్కడ నుంటిరి? భావింప మీవంటి భాగవతులు
తీర్థసంఘంబుల ధిక్కరింతురు గదా, మీయందు విష్ణుండు మెఱయుకతన
మీర తీర్థంబులు; మీకంటె మిక్కిలి తీర్థంబు లున్నవె తెలిసి చూడ?
తే. వేఱ తీర్థంబు లవనిపై వెదక నేల?-మిమ్ముఁ బొడగని భాషించు మేల చాలు;
వార్త లేమండ్రు లోకులు? వసుధలోన-మీకు సర్వంబు నెఱిఁగెడు మేధ గలదు.

మత్తకోకిలము. తండ్రి సచ్చినమీఁద మా పెదతండ్రిబిడ్డలు దొల్లి పె
క్కండ్రు సర్పవిషాగ్ని బాధల గాసిఁబెట్టఁగ మమ్ము ని
ల్లాండ్ర నంతముఁ బొందకుండఁగ లాలనంబున మీరు మా
తండ్రిభంగి సముద్ధరింతురు; తద్విధంబు దలంతురే? 269

క. పక్షులు తమ తెక్కలలోఁ - బక్షంబులు రాని పిల్ల[4]పదువుల మమతన్
రక్షించినక్రియ మీరలు - [5]పక్షీకరణంబుసేయ బ్రతికితిమి గదే! 270

1. రాజు = చంద్రుఁడు. 2. కరదండములు = పన్నులు, కప్పములు. 3. తీర్థములు = పుణ్యక్షేత్రములు. 4. పదువు = గుంపు. 5. పక్షీకరణముచేయు = పక్షమువహించు.

క. మన్నారా ద్వారకలో - నున్నారా యదువు లంబుజోదరు కరుణం
గన్నారా లోకులచే - విన్నారా మీరు వారి విధ మెట్టిదియో!" 271

చ. అన విని ధర్మరాజునకు నావిదురుండు సమస్తలోకవ
ర్తనముఁ గ్రమంబుతోడ విశదంబుగఁ జెప్పి, యదుక్షయంబు సె
ప్పిన నతఁ డుగ్రశోకమున బెగ్గిలి కుందెడి నంచు నేమియున్
విన మని, చెప్పఁ డయ్యె యదువీరుల నాశము భార్గవోత్తమా! 272

ఆ. మేలు సెప్పనేని మేలందు లోకులు;-చెట్ట యందు కీడు సెప్పనేని;
నంతమీఁద శూద్రుఁ డైనకతంబున-శిష్టమరణ మతఁడు సెప్పఁ డయ్యె. 273

వ. అది యెట్లనిన, మాండవ్యమహామునిశాపంబునం దొల్లి యముండు శూద్ర యోనియందు విదురుండై జన్మించి యున్న నూఱువత్సరంబు లర్యముండు యథాక్రమంబునఁ బాపకర్ముల దండించె; నిట్లు యుధిష్ఠిరుండు రాజ్యంబుఁ గైకొని, లోకపాలసంకాశు లయిన తమ్ములుం దానును గులదీపకుం డైన మనుమని ముద్దుసేయుచుఁ బెద్దకాలంబు మహావైభవంబున సుఖి యై యుండె; నంత,

క. బాలాజనశాలాధన - లీలావనముఖ్యవిభవలీనమనీషా
లాలసు లగు మానవులను - గాలము వంచించు; దురవగాహము సుమతీ! 275

## గాంధారీధృతరాష్ట్రులు దేహత్యాగము సేసికొనుట

వ. అది నిమిత్తంబుగాఁ గాలగతి యెఱింగి విదురుండు ధృతరాష్ట్రున కి ట్లనియె:

మ. "కనకాగారకళత్రమిత్రసుతసంఘాతంబులన్ ముందటం
గని ప్రాణేచ్ఛల నుండు జంతువుల నేకాలంబు దుర్లంఘ్య మై
యనివార్యస్థితిఁ జంపు? నట్టి నిరుపాయంబైన కాలంబు వ
చ్చె నుపాంతంబున; మాఱు దీనికి మదిం జింతింపు ధాత్రీశ్వరా! 277

శా. పుట్టంధుండవు; పెద్దవాఁడవు; మహాభోగంబులా లేవు; నీ
పట్టెల్లం జెడిపోయె; దుస్సహజరాభారంబు పైఁ గప్పె; నీ
చుట్టా లెల్లను బోయి; రాలు మగఁడున్ శోకంబునన్ మగ్నులై
కట్టా! [1]దాయలపంచ నుండఁ దగవే గౌరవ్యవంశాగ్రణీ! 278

క. పెట్టితిరి చిచ్చు గృహమునఁ; - బట్టితిరి తదీయభార్యఁ; బాడవులకుం
గొట్టితిరి; వారు మనుపఁగ - నెట్టన భరింప వలెనె యీప్రాణములన్? 279

క. బిడ్డలకు బుద్ధి సెప్పని - గ్రుడ్డికిఁ బిండంబు వండికొని పొం డిదె పైఁ
బడ్డాఁ డని భీముం [2]డొఱ - గొడ్డెము లాడంగఁ గూడు గుడిచెద వధిపా! 280

---

1. దాయలు = దాయాదులు, జ్ఞాతులు. 2. ఒఱగొడ్డెములు = మనసు నొప్పించెడు వంకరమాటలు.

క. కనియెదవో బిడ్డల నిఁక, - మనియెదవో తొంటికంటె, మనుమలమాటల్
వినియెదవో, యిచ్చెద ర - మ్మనియెదవో దానములకు నవనీసురులన్ ? 281

క. దేహము నిత్యము గా దని - మోహముఁ దెగఁ గోసి, సిద్ధమునివర్తనుఁ డై,
గేహము వెలువడు నరుఁ డు - త్సాహముతోఁ జెందు ముక్తిసంపద ననఘా!''

వ. అని విదురుండు ధృతరాష్ట్రునకు విరక్తిమార్గం బుపదేశించిన నతఁడు ప్రజ్ఞాచక్షుం డై, సంసారంబు దిగనాడి, మోహపాశంబులవలన నూడి, విజ్ఞానమార్గంబునం గూడి, దుర్గమం బగు హిమవన్నగంబునకు నిర్గమించిన, 283

శా. అంధుం డైన పతిన్ వరించి, పతిభావాసక్తి నేత్రద్వయీ
బంధాచ్ఛాదనముల్ ధరించి, నియమప్రఖ్యాత యై యున్న త
ద్గాంధారక్షితినాథు కూఁతురును యోగప్రీతి చిత్తంబులో
సంధిల్లం బతివెంట నేఁగె నుదయత్సాధ్వీగుణారూఢ యై. 284

చ. వెనుకకు రాక చొచ్చు రణవీరునికై వడి, రాజదండనం
బునకు భయంబు లేక వడిఁ బోయెడు ధీరునిభంగి నప్పు డా
వనిత దురంత మైన హిమవంతముపొంత వనాంత భూమికిం
బెనిమిటితోడ నించుకయు భీతి వహింపక యేఁగెఁ బ్రీతితోన్. 285

వ. ఇట్లు విదురసహితు లై గాంధారీధృతరాష్ట్రులు వనంబునకుం జనిన, మఱునాఁడు ధర్మనందనుండు ప్రభాతంబున సంధ్యావందనంబు సేసి, నిత్యహోమంబు గావించి, బ్రాహ్మణోత్తములకు గోహిరణ్యతిలవస్త్రాదిదానంబులు సేసి, నమస్కరించి, గురువందనంబుకొఱకుఁ బూర్వప్రకారంబునం దండ్రిమందిరంబునకుఁ జని, యందు విదురసహితు లయిన తల్లిదండ్రులం గానక మంజుపీఠంబునఁ గూర్చున్న సంజయున కిట్లనియె : 286

సీ. మా తల్లిదండ్రు లీ మందిరంబున లేరు, సంజయ! వా రెందుఁ జనిరి నేఁడు ?
ముందర గానఁడు ముదుసలి మాతండ్రి, పుత్త్రశోకంబునఁ బొగులుఁ దల్లి,
సౌజన్యనిధి ప్రాణసఖుఁడు మా పినతండ్రి, మందబుద్ధుల మైన మమ్ము విడిచి
యెటఁ బోయిరో మువ్వు రెఱిఁగింపు; గంగలోఁ దనయపరాధంబుఁ దడవికొనుచు

ఆ. భార్యతోడఁ దండ్రి పరితాపమునఁ బడుఁ - గపట మింత లేదు; [1]కరుణ గలఁడు;
పాండుభూవిభుండు పరలోకగతుఁ డైన - మమ్ముఁ బిన్నవాండ్ర [2]మనిచె నతఁడు.''

వ. అనిన సంజయుండు దయాస్నేహంబుల నతికర్శితుం డగుచుఁ, దన ప్రభువు వోయిన తెఱం గెఱుంగక కొంతదడ వూరకుండి, తద్వియోగదుఃఖంబునఁ గన్నీరు దుడిచికొనుచు, బుద్ధిబలంబునం జిత్తంబు ధైర్యాయత్తంబు సేసి, తన భర్తృపాదంబుల మనంబున నెన్నుచు ధర్మజున కిట్లనియె : 288

---

1. కరుణ గలఁడు = కరుణ గలవాఁడు. 2. మనుచుట = పోషించుట, సాకుట.

తే. "అఖిలవార్తలు మున్న నన్నడుగుచుండు;-నడుగఁ డీ గేయి మీతండ్రి యవనినాథ!
మందిరములోన విదురతో మంతనంబు-నిన్న యాడుచు నుండెను, నేఁడు లేఁడు.

వ. విదురగాంధారీధృతరాష్ట్రులు నన్ను వంచించి యెందుఁ బోయిరో, వారల నిశ్చయంబు లెట్టివో యెఱుంగ" నని సంజయుండు దుఃఖించుసమయంబునఁ దుంబురుసహితుండై నారదుండు వచ్చిన, లేచి, నమస్కరించి, తమ్ములుం దానును నారదుం బూజించి, కౌంతేయాగ్రజుం డిట్లనియె : 290

ఉ. "అక్కట! తల్లిదండ్రులు గృహంబున లేరు ; మహాత్మ! వారు నేఁ
డెక్కడ వోయిరో యెఱుఁగ; నెప్పుడు బిడ్డల పేరు [1]గ్రుచ్చి తాఁ
బొక్కుచు నుండుఁ దల్లి; యెటు వోయెనొకో! విపదంబురాశికిన్
నిక్కము కర్ణధారుఁడవు నీవు జగజ్జనపారదర్శనా!" 291

వ. అనిన విని సర్వజ్ఞుండైన నారదుండు ధర్మజున కిట్లనియె: "నీశ్వరవశంబు విశ్వం; బీశ్వరుండ భూతంబుల నొకటితో నొకటిఁ జేర్చు, నెడఁబాపు: సూచీభిన్ననాసికలందు రజ్జుప్రోతంబు లగుచుఁ గంఠరజ్జువులఁ గట్టంబడిన [2]బలీవర్దంబులుంబోలెఁ గర్తవ్యాకర్తవ్యవేదలక్షణ యగు వాక్తంత్రియందు వర్ణాశ్రమలక్షణంబులు గల నామంబులచే బద్ధులై లోకపాలసహితులైన లోకు లీశ్వరాదేశంబు వహింతురు; గ్రీడాసాధనంబు లగు నక్షకందుకాదుల కెట్లు సంయోగవియోగంబు లట్లు క్రీడించు నీశ్వరునికిం గ్రీడాసాధనంబులైన జంతువులకు సంయోగవియోగంబులు గలుగుచుండు; సమస్తజనంబును జీవరూపంబున ధ్రువంబును, దేహరూపంబున నధ్రువంబు నై యుండు; మఱియొక్కపక్షంబున ధ్రువంబు నధ్రువంబునుం గాక యుండు, శుద్ధబ్రహ్మస్వరూపంబున ననిర్వచనీయంబుగ రెండు నై యుండు; [3]నజగరంబుచేత మ్రింగంబడిన పురుషుం డన్యుల రక్షింపలేని తెఱంగునఁ బంచభూతమయంబై కాలకర్మగుణాధీనంబైన దేహంబు పరుల రక్షింప సమర్థంబు గాదు ; కరంబులు గల జంతువులకుఁ గరంబులు లేని చతుష్పదంబు లాహారంబు లగు ; జరణంబులు గల ప్రాణులకుం జరణంబులు లేని తృణాదులు భక్షణీయంబు లగు ; నధికజన్మంబులు గల వ్యాఘ్రాదులకు నల్పజన్మంబులు గల మృగాదులు భోజ్యంబు లగు; సకలదేహి దేహంబులందు జీవుండు గలుగుటం జేసి జీవునికి జీవుండ జీవిక యగు; సహస్తాహస్తాదిరూపంబైన విశ్వ మంతయు నీశ్వరుండుగాఁ దెలియు; మతనికి వేఱు లేదు; నిజమాయా విశేషంబున మాయావి యై జాతిభేదరహితుండైన యీశ్వరుండు బహుప్రకారంబుల భోగిభోగ్యరూపంబుల నంతరంగబహిరంగంబుల దీపించుం గాన యనాథులు, దీనులు నగు నాదుతలిదండ్రులు ననుం బాసి యే మయ్యెదరో,

1. గ్రుచ్చు = తలఁచు. 2. బలీవర్దములు = ఎద్దులు. 3. అజగరము = కొండచిలువ.

యెట్లు వర్తింతురో యని వగవం బనిలేదు; తదజ్ఞానమూలం బగు స్నేహంబున నైన మనోవ్యాకులత్వంబు పరిహరింపు" మని మఱియు నిట్లనియె: 292

ఆ. "అట్టి కాలరూపుఁ డఖిలాత్ముఁ డగు విష్ణుఁ - డసురనాశమునకు నవతరించి,
దేవకృత్య మెల్లఁ దీర్చి, [1]చిక్కినపని - కెదురుచూచుచుండు నిప్పు డధిప!

మత్తకోకిల. ఎంతకాలము కృష్ణుఁ డీశ్వరుఁ డిద్ధరిత్రిఁ జరించు నీ
రంతకాలము నుండుఁ డందఱు నవ్వలం బని లేదు; వి
భ్రాంతి మానుము; కాలముం గడవంగ నెవ్వరు నోప; రీ
చింత యేల నరేంద్రసత్తమ! చెప్పెదన్ విను మంతయున్. 294

వ. ధృతరాష్ట్రుండు గాంధారీవిదురసహితుండై హిమవత్పర్వతదక్షిణభాగంబున నొక్క మునివనంబునకుం జని, తొల్లి సప్తర్షులకు సంతోషంబు సేయుకొఱకు నాకాశగంగ యేడుప్రవాహంబు లయి పాఱిన పుణ్యతీర్థంబునం గృతస్నానుండై, యథావిధి హోమం బొనరించి, జలభక్షణంబు గావించి, సకలకర్మంబులు విసర్జించి, విఘ్నంబులం జెందక, నిరాహారుం డయి, యుపశాంతాత్ముం డయి, పుత్రార్థదారైషణంబులు వర్జించి, విన్యస్తాసనుండై, ప్రాణంబుల [2]నియమించి, మనస్సహితంబు లైన చక్షురాదీంద్రియంబుల నాఱింటిని విషయంబులం బ్రవర్తింపనీక నివర్తించి, హరిభావనచే ధారణాయోగంబు వహించి, రజస్సత్త్వతమోరూపంబు లగు మలంబుల మూఁటిని హరించి, మనంబు నహంకారాస్పదం బైన స్థూలదేహంబువలనం బాపి బుద్ధియందు నేకీకరణంబు సేసి, యట్టి విజ్ఞానాత్మను దృశ్యాంశంబువలన వియోగించి, క్షేత్రజ్ఞునియందుఁ బొందించి, దృష్టం బైన యీశ్వరునివలన క్షేత్రజ్ఞునిం బాపి, మహాకాశంబుతోడ ఘటాకాశముం గలుపుకైవడి నాధారభూతం బైన బ్రహ్మమందుఁ గలిపి, లోపలి గుణక్షోభంబును, వెలుపలి యింద్రియవిక్షేపంబును లేక నిర్మూలితమాయాగుణవాసనుం డగుచు నిరుద్ధంబు లగు మనశ్చక్షురాదీంద్రియంబులు గలిగి, యఖిలాహారంబుల వర్జించి, [3]కొఱడు చందంబున, 295

మ. ఉటజాంతస్స్థలవేదికన్ నియతుఁడై యున్నాఁడు; నేఁ డాదిగా
నిటపై నేనవనాఁడు మేన్ విడువఁగా, నిజ్యాగ్ని యోగాగ్ని త
త్పటుదేహంబు దహింపఁ జూచి, నియమప్రఖ్యాత గాంధారి యి
ట్టటు వోనొల్లక ప్రాణవల్లభునితో నగ్నిం బడున్ భూవరా! 296

క. అంతట వారల మరణము - వింత యగుచుఁ జూడఁబడిన విదురుఁడు చింతా
సంతాప మొదవఁ బ్రీత - స్వాంతుం డై తీర్థములకుఁ జనియెడు నధిపా!" 297

---

1. చిక్కిన = మిగిలిన. 2. నియమించు = బిగఁబట్టు. 3. కొఱడు = మోడు, స్థాణువు.

### ధర్మజుఁడు దుర్నిమిత్తములను గని చింతించుట

వ. అని విదురాదుల వృత్తాంతం బంతయు ధర్మనందనున కెఱింగించి, తుంబురు సహితుండయిన నారదుండు స్వర్గంబునకు నిర్గమించిన వెనుక ధర్మజుండు భీమునిం జూచి యిట్లనియె: 298

సీ. "ఒక కాలమునఁ బండు నోషధిచయము వేఱొక కాలమునఁ బండకుండు నండ్రు;
క్రోధంబు, లోభంబు, క్రూరత, బొంకును దీపింప నరులు వర్తింతు రండ్రు;
వ్యవహారములు మహావ్యాజయుక్తము లండ్రు; సఖ్యంబు వంచనాసహిత మండ్రు;
మగలతో నిల్లాండ్రు మచ్చరించెద రండ్రు; సుతులు దండ్రులఁ దెగఁజూతు రండ్రు;
తే. గురుల శిష్యులు దూషించి కూడ రండ్రు;-శాస్త్రమార్గము లెవ్వియుఁ జాగ వండ్రు;
న్యాయపద్ధతి బుధులైన నడవ రండ్రు;-కాలగతి వింత యై వచ్చెఁ గంటె నేఁడు!

మ. హరిఁ జూడన్ నరుఁ డేఁగినాఁడు; నెల లేఁ డయ్యెం గదా; రారు [1]గా
లరు లెవ్వారును; యాదవుల్ సమదలోలస్వాంతు లీ వేళ సు
స్థిరులై యుండుదురా? మురారి సుఖియై సేమంబుతో నుండునా?
[2]యెర వై యున్నది చిత్త; మీశ్వరకృతం బెట్లో కదే మారుతీ! 300

క. మానసము గలఁగుచున్నది; - మానవు బహుదుర్నిమిత్తమర్యాదలు; స
న్మానవదేహక్రీడలు - మాన విచారింప నోపు మాధవుఁ డకటా! 301

క. మనవులు సెప్పక ముందఱ - మన దారప్రాణరాజ్యమానశ్రీలన్
మనుపుదు నని యాదేవుఁడు - మనమునఁ దలపోసి మనిచె మనలం గరుణన్.

క. నారదుఁ డాడినకై వడిఁ - గ్రూరపుఁగాలంబు వచ్చుఁ గుంభినిమీఁదన్;
ఘోరము లగు నుత్పాతము - లారభటిం జూడఁబడియె ననిలజ! కంటే? 303

సీ. ఓడక నాముందు నొక సారమేయంబు మొఱుఁగుచు నున్నది మోర యెత్తి;
యాదిత్యుఁ డుదయింప నభిముఖంబై నక్క వాపోయె మంటలు వాతఁ గలుగ;
[3]మిక్కిలుచున్నవి మెఱసి గృధ్రాదులు; గర్దభాదులు దీర్చి క్రందుకొనియె;
నుత్తమాశ్వంబుల కుదయించెఁ గన్నీరు; మత్తగజంబుల మదము లుడిగెఁ;
ఆ. గాలు దూతభంగిఁ గదిసెఁ గపోతము; - మండ దగ్ని హోమమందిరములఁ;
జుట్టుఁ బొగలు దిశల సొరిది నాచ్ఛాదించెఁ;-దరణి మాసెఁ; జూడు ధరణి గదలె.

క. వాతములు విసరి రేణు - వ్రాతము లాకసముఁ గప్పె వడి సుడిగొని; ని
ర్ఘాతములు పడియె; ఘనసం - ఘాతంబులు రక్తవర్షకలితము లయ్యెన్. 305

క. గ్రహములు పోరాడెడి; నా - గ్రహముల వినఁబడియె భూతకలకలములు; దు
స్సహము లగుచు శిఖికీలా - వహముల క్రియఁ దోఁచె గగనవసుధాంతరముల్.

1. కాలరులు=వార్తాహరులు, దూతలు. 2. ఎరవు=వికలము. 3. మిక్కిలు = మోఱు.

క. దూడలు గుడువవు చన్నులు; - దూడలకున్ గోవు లీవు దుగ్ధము; లోడలం
బీడలు మానవు; పసులం - గూడవు వృషభములు, దఱిపికుఱ్ఱల నెక్కన్. 307

క. కదలెడు వేల్పులరూపులు; - వదలెడుఁ గన్నీరు; వానివలనం జెమటల్
పొదలెడిఁ; బ్రతిమలు వెలిఁ జని - మెదలెడి నొక్కొక్క గుడిని మేదినియందున్.

క. కాకంబులు వాపోయెడి; - ఘూకంబులు పగరఁ బగలు [1]గుండ్రలుగొలిపెఁ;
లోకంబులు విభ్రష్ట - శ్రీకంబులగతి నశించి శిథిలము లయ్యెన్. 309

మ. యవపద్మాంకుశచాపచక్రఝష రేఖాలంకృతం బైన మా
ధవు పాదద్వయ మింక మెట్టెడు పవిత్రత్వంబు నేఁ డాదిగా
నవనీకాంతకు లేదు పో; మఱి మదీయాంగంబు వామాక్షి బా
హువు లాకంపము నొందుచుండు; నిల కేయుగ్రస్థితుల్ వచ్చునో! 310

వ. మఱియు మహోత్పాతంబులు పెక్కులు పుట్టుచున్నయవి; మురాంతకుని
వృత్తాంతంబు వినరా''దని కుంతీసుతాగ్రజుండు భీమునితో విచారించు సమ
యంబున, 311

### అర్జునుఁడు ద్వారకనుండి వచ్చి కృష్ణుని నిర్యాణము దెలుపుట

క. ఖేదమున నింద్రసూనుఁడు - యాదవపురినుండి వచ్చి, యగ్రజుఁ గని, త
త్పాదముల నయనసలిలో - త్పాదకుఁ డై పడియె దీనుభంగి నరేంద్రా! 312

క. [2]పల్లటిలిన యుల్లముతోఁ - దల్లడపడుచున్న చిన్నితమ్మునిఁ గని వె
ల్వెల్ల నగు మొగముతో జను - తెల్లను విన ధర్మపుత్త్రుఁ డిట్లని పలికెన్: 313

సీ. ''మాతామహుం డైన మన శూరుఁ డున్నాఁడె? మంగళమే మన మాతులునకు?
మోదమే నలుగురు ముగురు మేనత్తల? కానందమే నాటి యాత్మజులకు?
నక్రూరకృతవర్మ లాయుస్సమేతులే? జీవించెఁడే యుగ్రసేనవిభుఁడు?
కల్యాణయుక్తులే గదసారణాదులు మాధవుతమ్ములు మానధనులు?

తే. నందమే మన సత్యకనందనునకు? - భద్రమే శంబరాసురభంజనునకుఁ?
గుశలమే బాణదనుజేంద్రుకూఁతుపతికి? - హర్షమే పార్థ! ముసలికి, హలికి, బలికి?

వ. మఱియు నంధకమధుభోజదశార్హవృష్ణిసాత్వతులు మొదలయిన యదువంశవీరు
లును, హరికుమారు లైన సాంబసుషేణప్రముఖులును, నారాయణానుచరు లైన
యుద్ధవాదులును, కృష్ణసహచరు లైన సునందనందాదులును సుఖానందులే?''
యని యందఱ నడిగి, ధర్మజుండు క్రమ్మఱ నిట్లనియె: 315

సీ. ''వైకుంఠవాసుల వడువున నెవ్వని బలమున నానందభరితు లగుచు
సేవక యాదవవీరులు వర్తింతు? రమరులు గొలువుండునట్టి కొలువుఁ

1. గుండ్రలుగొలుపు = (గుడ్లగూబ) కూయు. 2. పల్లటిలిన = చలించిన.

జవికె నాకర్షించి, చరణసేవకు లైన బంధుమిత్రాదుల పాదయుగము
నెవ్వఁడు ద్రొక్కించె నింద్రపీఠముమీఁద? వజ్రంబు జళిపించి వ్రాలువాని

తే. ప్రాణవల్లభ కెంగేలఁ బాదు సేసి - యమృతజలములఁ బోషింప నలరు పారి
జాత మెవ్వఁడు గొనివచ్చి సత్యభామ-కిచ్చె? నట్టి మహాత్మున కిపుడు శుభమె? 316

శా. అన్నా! ఫల్గున! భక్తవత్సలుఁడు, బ్రహ్మణ్యుండు, గోవిందుఁ, డా
పన్నానీకశరణ్యుఁ, డీశుఁడు, జగద్భద్రానుసంధాయి, శ్రీ
మన్నవ్యాంబుజపత్రనేత్రుఁడు సుధర్మామధ్యపీఠంబునం
దున్నాఁడా బలభద్రుఁ గూడి సుఖియై, యుత్సాహియై ద్వారకన్? 317

క. ఆ రామకేశవులకును - సారామలభక్తి నీవు సలుపుదువు గదా!
గారాములు సేయుదురా - [1]పోరాముల బంధు లెల్లప్రొద్దు జితారీ! 318

శా. మున్నుగ్రాటవిలో వరాహమునకై ముక్కంటితోఁ బోరుచోఁ,
సన్నాహంబునఁ గాలకేయుల ననిం జక్కాడుచోఁ, బ్రాభవ
స్కన్నుండై చను కౌరవేంద్రు పనికై గంధర్వులం దోలుచోఁ
గన్నీ రెన్నఁడుఁ దేవు తండ్రి! చెపుమా కల్యాణమే చక్రికిన్? 319

వ. అదియునుంగాక. 320

క. ఓడితివో శత్రువులకు? - నాడితివో సాధుదూషణాలాపములం?
గూడితివో పరసతులను? - వీడితివో మానధనము వీరులనడుమన్? 321

క. తప్పితివో యిచ్చెద నని? - చెప్పితివో కపటసాక్షి? చేసిన మేలుం
దప్పితివో? శరణార్థుల - రొప్పితివో ద్విజులఁ, బసుల, రోగుల, సతులన్? 322

క. అడిచితివో భూసురులను? - గుడిచితివో బాలవృద్ధగురువులు వెలిగా?
విడిచితివో యాశ్రితులను? - ముడిచితివో పరులవిత్తములు లోభమునన్?" 323

వ. అని పలికినం గన్నీరు కరతలంబునం దుడిచికొనుచు, గద్గదస్వరంబున, మహానిధిం
గోలుపోయిన పేదచందంబున నిట్టూర్పులు నిగిడించుచు నర్జునుం డన్న కిట్లనియె:

క. "మన సారథి, మన సచివుఁడు,-మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్,
మన విభుఁడు గురుఁడు దేవర - మనలను దిగనాడి చనియె మనుజాధీశా! 325

క. [2]కంటకులు నృపులు సూడఁగ - మింటం గంపించు యంత్రమీనముఁ గోలన్
గెంటించి, మనము వాలుం - గంటిం జేకొంటి మతని కరుణన కాదే! 326

క. [3]దండి ననేకులతో నా-ఖండలుఁ డెదురయిన గెలిచి ఖాండవవనముం
జండార్చికి నర్పించిన - గాండీవము నిచ్చెఁ జక్రి గలుగుట నధిపా! 327

1. పోరాములు = శోకపోకలు. 2. కంటకులు = శత్రువులు, ప్రతిపక్షులు. 3. దండి = ప్రతాపము.

క. దిక్కులరాజుల నెల్లను - [1]మ్రక్కించి ధనంబు గొనుట, మయకృతసభ ము
న్నెక్కుట, జన్నము సేయుట,-నిక్కము హరి మనకు దండ నిలిచినఁ గాదే? 328

మ. ఇభజిద్వీర్య మఖాభిషిక్త మగు నీయిల్లాలి ధమ్మిల్లముల్
సభలో శాత్రవు లీడ్చి తెచ్చినపు డాచంద్రాస్య దుఃఖింపఁగా
నభయం బిచ్చి, ప్రతిజ్ఞ సేసి, భవదీయారాతికాంతాశిరో
జభరశ్రీల హరింపఁడే విధవలై సౌభాగ్యముల్ వీడఁగన్? 329

శా. 'వైరుల్ గట్టిన పుట్టముల్ విడువఁగా వారింప నావల్లభుల్
రా, రీవేళ నుపేక్ష సేయఁ దగవే, రావే, నివారింపవే,
లేరే త్రాతలు, కృష్ణ' యంచు సభలో లీనాంగియై కుయ్యిడం
గారుణ్యంబున భూరివస్త్రకలితం గాఁ జేయఁడే ద్రౌపదిన్? 330

సీ. దుర్వాసుఁ డొకనాఁడు దుర్యోధనుఁడు పంపఁ బదివేలశిష్యులు భక్తిఁ గొలువఁ
జనుదెంచి, మనముఁ, బాంచాలియుఁ గుడిచిన వెనుక నాహారంబు వేఁడికొనినఁ
బెట్టెద నవుడుఁ, బెట్టకున్న శపింతు ననుచుఁ దోయావగాహమున కేఁగఁ,
గడవల నన్నశాకములు దీఱుటఁ జూచి, పాంచాలపుత్త్రిక పర్ణశాల

తే. లోనఁ దలఁచిన, విచ్చేసి, [2]లోవిలోని - శిష్టశాకాన్నలవముఁ [3]బ్రాశించి, తపసి
కోప ముడిగించి పరిపూర్ణకుక్షిఁ జేసె - నిట్టి త్రైలోక్యసంతర్పి యెందుఁ గలఁడు?

సీ. పందికై పోరాడ ఫాలాక్షుఁ డెవ్వనిబలమున నా కిచ్చెఁ బాశుపతము?
నెవ్వనిలావున నిమ్మైన దేవేంద్రు పీఠార్ధమున నుండఁ బెంపుఁ గంటిఁ?
గాలకేయనివాతకవచాదిదైత్యులఁ జంపితి నెవ్వని కరుణఁ జేసి?
గోగ్రహణమునాఁడు కురుకులాంభోనిధిఁ గడచితి నెవ్వని కరుణఁ జేసి?

ఆ. కర్ణసింధురాజకౌరవేంద్రాదుల - తలలపాగ లెల్లఁ దడవి తెచ్చి
యేమహాత్ము బలిమి నిచ్చితి విరటుని - పుత్త్రి యడుగ బొమ్మపొత్తికలకు? 332

మ. గురుభీష్మాదులు గూడి పన్నిన కురుక్షోణీశచక్రంబులో
గురుశక్తిన్ రథయంత యై, నొగలపైఁ గూర్చుండి, యామేటి నా
శరముల్ వాటిక మున్న వారల బలోత్సాహాయురుద్యోగత
త్పరతల్ చూడ్కుల సంహరించు నమితోత్సాహంబు నా కిచ్చుచున్. 333

మ. అసురేంద్రుం డొనరించు కృత్యములు ప్రహ్లాదుం బ్రవేశించి గె
ల్వ సమర్థంబులు గానికైవడిఁ గృపాశ్వత్థామ గాంగేయ సూ
ర్యసుత ద్రోణ ధనుర్విముక్త బహుదివ్యాస్త్రప్రపంచంబు నా
దెసకున్ రాక తొలంగు మాధవు దయాదృష్టిన్ నరేంద్రోత్తమా! 334

1. మ్రక్కించి = నశింపఁజేసి. 2. లోవి = స్థాలి, వంటపాత్ర. 3. ప్రాశించు = తిను.

చ. వసుమతి దివ్యబాణముల వ్రయ్యలు వాపి, కొలంకు సేసి, నా
రసములు మాటుగాఁ బఱపి, రథ్యములన్ రిపు లెల్లఁ జూడ సా
హసమున నీటఁ బెట్టితి రణావని సైంధవుఁ జంపునాఁడు నా
కసురవిరోధి భద్రగతి నం డయి వచ్చినఁ గాదె భూవరా! 335

సీ. 'చెలికాఁడ' రమ్మని చీరు నన్నొకవేళ; మన్నించు నొకవేళ 'మఱఁది' యనుచు;
బంధుభావంబునఁ బాటించు నొకవేళ; దాతయై యొకవేళ ధనము లిచ్చు;
మంత్రియై యొకవేళ మంత్రమాదేశించు; బోధియై యొకవేళ బుద్ధి సెప్పు;
సారథ్య మొనరించుఁ జన విచ్చి యొకవేళఁ; గ్రీడించు నొకవేళ గేలిసేయు;
తే. నొక్కశయ్యాసనంబున నుండుఁ; గన్న - తండ్రికైవడిఁ జేసినతప్పుఁ గాచు
హస్తములు వట్టి; పొత్తున నారగించు; - మనుజవల్లభ! మాధవుమఱపు రాదు.

క. విజయ, ధనంజయ, హనుమ-ద్ధ్వజ, ఫల్గున, పార్థ, పాండుతనయ, నర, మహేం
ద్రజ, మిత్రార్జున యంచును - భుజములు [1]దలకడవ రాక వొకలఁ జీరున్. 337

క. వారిజగంధులు దమలో - వారింపఁగరానిప్రేమ వాదము సేయన్,
వారిజనేత్రుఁడు ననుఁ దగ - వారిండ్లకుఁ బనుపు నలుక వారింప నృపా! 338

క. నిచ్చలు లోపలికాంతలు - మచ్చికఁ దనతోడ నాడు మాటలు నాకున్
ముచ్చటలు సెప్పు మెల్లన - విచ్చలవిడిఁ దొడలమీఁద విచ్చేసి నృపా! 339

చ. అటమట మయ్యె నాభజన మంతయు భూవర! నేఁడు సూడుమా
యిటువలె గారవించు జగదీశుఁడు కృష్ణుఁడు లేనిపిమ్మటం
బటుతరదేహలోభమునఁ బ్రాణము లున్నవి వెంటఁ బోక; నే
గటకట! పూర్వజన్మమునఁ గర్మము లెట్టివి చేసినాఁడనో? 340

శా. కాంతారంబున నొంటి దోడుకొని రాఁగాఁ జూచి గోవిందు [2]శు
ద్ధాంతస్త్రీలఁ బదాఱువేల మదరాగాయత్తులై తాఁకి నా
చెంతన్ బోయలు మూఁగి పట్టికొన నాసీమంతినీసంఘమున్
భ్రాంతిన్ భామినిభంగి నుంటి విడిపింపన్ లేక ధాత్రీశ్వరా! 341

శా. ఆతే, రారథికుండు, నాహయము, లాయస్త్రాసనం, బాశర
వ్రాతం బన్యులఁ దొల్లి చంపుఁ; దుదినిన్ వ్యర్థంబులై పోయె మ
చ్చేతోధీశుఁడు చక్రి లేమి భసితక్షిప్తాజ్య మాయావిమా
యాతంత్రోషరభూమిబీజముల మర్యాదన్ నిమేషంబునన్. 342

మ. యదువీరుల్ మునినాథుశాపమునఁ గాలాధీనులై యందఱున్
మదిరాపానవివర్ధమానమదసమ్మర్దోగ్రరోషాంధులై

1. తలకడచు = తలమీఱు, అతిక్రమించు. 2. శుద్ధాంతస్త్రీలు = అంతఃపురస్త్రీలు.

కదనంబుల్ దమలోన ముష్టిహతులం గావించి [1]నీఱైరి; స
ష్టదశం జిక్కిరి నల్వురేవు రచటన్ సర్వంసహావల్లభా! 343

క. భూతములవలన నెప్పుడు - భూతములకు జన్మమరణపోషణములు ని
ర్ణీతములు సేయుచుండును - భూతమయుం డీశ్వరుండు భూతవరన్యా! 344

క. బలములు గల మీనంబులు - బలవిరహిత మీనములను భక్షించు క్రియన్
బలవంతు లయిన యదువులు-బలరహితులఁ జంపి రహితభావముల నృపా! 345

మ. బలహీనాంగులకున్, బలాధికులకుం బ్రత్యర్థిభావోద్యమం
బులు గల్పించి, వినాశమున్ నెఱపి, యీ భూభారముం బాపి, ని
శ్చలబుద్ధిం గృతకార్యుఁ డై చనియె నా సర్వేశ్వరుం డచ్యుతుం
డలఘుం డేమని చెప్పుదున్ భగవదాయత్తంబు పృథ్వీశ్వరా! 346

వ. మఱియు దేశకాలార్థయుక్తంబులు, నంతఃకరణసంతాపశమనంబులు నయిన హరివచనంబులం దలంచి, చిత్తంబు పరాయత్తం బయియున్న దని యన్నకుం జెప్పి,నిరుత్తరుండై, నిరంతరహరిచరణారవిందచింతామలబుద్ధియై, శోకంబు వర్జించి, సదాధ్యానభక్తి విశేషంబులం గామక్రోధాదుల జయించి, తొల్లి తన కుభయసేనామధ్యంబున నచ్యుతుం డానతిచ్చిన గీతలు దలంచి, కాలకర్మ భోగాభినివేశంబులచేత నావృతం బయిన విజ్ఞానంబుఁ గ్రమ్మఱ నధిగమించి, హేతుమద్భావంబున శోకహేతు వహంకారమమకారాత్మకం బయిన ద్వైత భ్రమం బనియును, ద్వైతభ్రమంబునకుఁ గారణంబు దేహం బనియును, దేహంబునకు బీజంబు లింగం బనియును, లింగంబునకు మూలంబు గుణంబు లనియును, గుణంబులకు నిదానంబు ప్రకృతి యనియును, బ్రహ్మాహ మనియెడు జ్ఞానంబున లీనమై ప్రకృతి లేకుండు ననియుఁ, బ్రకృతి యడంగుటయ నైర్గుణ్యం బనియును, నైర్గుణ్యంబువలనఁ గార్యలింగనాశం బనియును, గార్యలింగనాశంబున నసంభవం బగుననియును, బ్రకృతిం బాసి క్రమ్మఱ స్థూలశరీరప్రాప్తుండుగాక పురుషుండు సమ్యగ్భోగంబున నుండు ననియును నిశ్చయించి, యర్జునుండు విరక్తుండై యూరకుండె; ధర్మజుండు భగవదీయమార్గంబు దెలిసి, యాదవుల నాశంబు విని నారదు వచనంబులఁ దలంచి, నిశ్చలచిత్తుం డై, స్వర్గమార్గగమనంబునకు యత్నంబుసేయుచుండె; నా సమయంబున, 347

క. యదువులనాశము, మాధవు-పదవియు విని కుంతి విమలభక్తిన్ భగవ
త్పదచింతాతత్పరయై - ముదమున సంసారమార్గమునకుం బాసెన్. 348

వ. ఇట్లు [2]కంటకంబునం గంటకోన్మూలనంబు సేసి, కంటకంబులు రెంటిని బరిహరించు విన్నాణితెఱంగున యాదవరూపశరీరంబునం జేసి యీశ్వరుండు లోకకంటకశరీ

---

1. నీఱు = భస్మము. 2. కంటకము = ముల్లు.

రంబులు సంహరించి నిజశరీరంబు విడిచె; సంహారంబునకు నిజశరీరపరశరీరం బులు రెండు నీశ్వరునకు సమంబుల; నిజరూపంబున మెలంగుచు, రూపాంతరం బులు ధరియించి, క్రమ్మఱ నంతర్ధానంబు నొందు నటునికైవడి లీలాపరాయణుం డైన నారాయణుండు మీనకూర్మాదిరూపంబులు ధరియించుం, బరిహరించు''నని చెప్పి మఱియు ని ట్లనియె : 349

క. ''ఏదినమున వైకుంఠుఁడు - మేదినిపైఁ దాల్చినట్టి మేను విడిచినాఁ
డాదినమున నశుభప్రతి - పాదక మగు కలియుగంబు ప్రాప్తం బయ్యెన్. 350

ధర్మరాజు పరీక్షితునకుఁ బట్టము గట్టి, మహాప్రస్థానమునకు వెళ్లుట

సీ. కలివర్తనంబునఁ గ్రౌర్యహింసాసత్యదంభ కౌటిల్యాద్యధర్మచయము
పురముల గృహముల భూములఁ దమలోనఁ గలుగుట దలపోసి కరిపురమున
మనుమని రాజవై మనుమని దీవించి, సింధుతోయకణాభిషిక్తుఁ జేసి,
యనిరుద్ధనందనుం డైన వజ్రునిఁ దెచ్చి, మథురఁ బట్టము గట్టి, మమతఁ బాసి,
ఆ. కరుల, హరుల, భటులఁ, గంకణాదికముల,-మంత్రిజనుల, బుధుల, మానవతుల,
నఖిల మయిన ధనము నభిమన్యుసుతునకు - నప్పగించి, బుద్ధి నాశ్రయించి. 351

వ. విరక్తుం డైన ధర్మనందనుండు ప్రాజాపత్యం బనియెడి యిష్టిఁ గావించి, యగ్నుల నాత్మారోపణంబు సేసి, నిరహంకారుండును, నిర్దళితాశేషబంధనుండును నై, సకలేంద్రియంబుల మానసంబున నడంచి, ప్రాణాధీనవృత్తి యగు మాన సంబును బ్రాణమందును, బ్రాణము నపానమందును, నుత్సర్గసహితం బయిన యపానమును మృత్యువునందును, మృత్యువును బంచభూతంబులకు నైక్యం బైన దేహంబునందును, దేహమును గుణత్రయంబునందును, గుణత్రయంబు నవిద్యయందును, సర్వారోపహేతు వగు నవిద్యను జీవునియందును, జీవుం డయిన తన్ను నవ్యయంబయిన బ్రహ్మమందును లయింపంజేసి, బహిరంగ వ్యాపారంబులు విడిచి, నారచీరలు ధరియించి, మౌనియు, నిరాహారుండును, ముక్తకేశుండును నై యున్మత్త పిశాచ బధిర జడుల చందంబున నిర పేక్షత్వంబున, 352

క. చిత్తంబున బ్రహ్మము నా - వృత్తముఁ గావించికొనుచు విజ్ఞానధనా,
యత్తులు దొల్లి వెలింగెడి - యుత్తరదిశ కేఁగె నిర్మలోద్యోగమునన్ 353

సీ. అంత నాతని తమ్ము లనిలపుత్త్రాదులు గలిరాకచేఁ బాపకర్మ లగుచుఁ
జరియించు ప్రజల సంచారంబు వీక్షించి, యఖిలధర్మంబుల నాచరించి,
వైకుంఠచరణాబ్జవర్తితహృదయు లై, తద్భక్తి నిర్మలత్వమును జెంది,
విషయయుక్తులకుఁ బ్రవేశింపఁగా రాక, నిర్ధూతకల్మషనిపుణమతులు,

తే. బహుళవిజ్ఞానదావాగ్ని భసితకర్ము - లైన యేకాంతులకు లక్ష్యమై వెలుంగు
ముఖ్యనారాయణస్థానమునకుఁ జనిరి - విగతరజు లైన యాత్ము లవ్విప్రముఖ్య!

వ. అంత విదురుండు ప్రభాసతీర్థంబున హరియందుఁ జిత్తంబు సేర్చి, శరీరంబు విడిచి, పితృవర్గంబుతోడ దండధరుం డగుటం జేసి నిజాధికారస్థానంబునకుం జనియె; ద్రుపదరాజపుత్త్రియుఁ బతులవలన నుపేక్షిత యై, జగత్పతి యైన వాసుదేవు నందుఁ జిత్తంబు సేర్చి తత్పదంబు సేరె; నిట్లు, 355

క. పాండవకృష్ణుల యానము - పాండురమతి నెవ్వఁ డైనఁ బలికిన, విన్నన్
ఖండితభవుఁ డై, హరిదా - సుం డై, [1]కైవల్యపదము సొచ్చు నరేంద్రా! 356

వ. అంత నటం బరీక్షిత్కుమారుండు జాతకర్మవిదు లైన పెద్దలు సెప్పినచందంబున భూసురోత్తమశిక్షావశంబున మహాభాగవతశేఖరుం డై ధరణీపాలనంబు సేయుచు, నుత్తరుని పుత్త్రిక నిరావతి యను మత్తకాశినిం బెండ్లియయి, జనమేజయప్రముఖు లైన నలువురుగొడుకుల నుత్పాదించి, గంగాపులినతలంబునఁ గృపాచార్యుండు గురుత్వంబు సేయ, యాగభాగంబులకు వచ్చిన దేవతల నీక్షించుచు, భూరిదక్షిణంబులుగా మూఁ డశ్వమేధంబు లాచరించి, దిగ్విజయకాలంబున గోమిథునంబుఁ దన్నుచున్న శూద్రుండును, రాజచిహ్నముద్రితుండును నగు కలిం బట్టి నిగ్రహించె"నని చెప్పిన శౌనకుండు పౌరాణికున కిట్లనియె: 357

క. "భూవరరూపపు శూద్రుఁడు - గోవుం దా నేల తన్నెఁ? గోరి పరీక్షి
ద్భూవరుఁడు దిశల గెలుచుచు - నే విధిఁ గలి నిగ్రహించె? నెఱిఁగింపఁ గదే! 358

మ. అరవిందాక్షపదారవిందమకరందాసక్తు లై యున్న స
త్పురుషశ్రేష్ఠుల వృత్తముల్ వినక, దుర్బుద్ధిన్ విలంఘించి, దు
ర్నరవార్తాకథనప్రపంచములు గర్ణప్రాప్తముల్ సేసి, వా
సరముల్ వ్యర్థతఁ ద్రోచుచుండఁ జన దీసంసారమోహంబునన్. 359

సీ. మనుట నిత్యము గాదు, మరణంబు నిజ మని యెఱిఁగి, మోక్షస్థితి నిచ్ఛగించు
నల్పాయువు లగు మా కన్యదుర్జనచరిత్రము లోలిఁ గర్ణరంధ్రములఁ బెట్టి,
బంగారువంటి యీ బ్రదికెడుకాలంబుఁ బోనాడఁగా నేల పుణ్యచరిత!
మాధవపదపద్మ మకరందపానంబు సేయింపవే! యేము సేయునట్టి

ఆ. సత్త్రయాగమునకు సన్మునీంద్రులు [2]సీర - వాఁడె దండధరుఁడు వచ్చెఁ జూడు;
చంపఁ డొకని నైన [3]జన్న మయ్యెడుదాఁక - వినుచు నుండుఁ దగిలి విష్ణుకథలు.

క. మందునకు మందబుద్ధికి - మందాయువునకు నిరర్థమార్గములను గో
విందచరణారవిందమ - రందము గొనఁ దెఱపి లేదు రాత్రిందివముల్. 361

1. కైవల్యము = మోక్షము. 2. చీరు = పిలుచు. 3. జన్నము = యజ్ఞము.

వ. అని శౌనకుండు వలికిన సూతుం డిట్లనియెఁ: "బరీక్షిన్నరేంద్రుండు నిజవాహినీసందోహసంరక్షితం బగు కురుజాంగలదేశంబునం గలిప్రవేశంబు నాకర్ణించి, యుద్ధకుతూహలత నంగీకరించి, యొక్కనాఁడు సముల్లాసంబున బాణాసనంబు గైకొని నీలనీరదనిభతురంగనివహయోజితంబును, ఫలితమనోరథంబును నైన రథంబు నారోహణంబు సేసి, మృగేంద్రధ్వజంబు వెలుంగ, రథతురంగమసుభటకరటిఘటాసంఘటితం బగు వాహినీచక్రంబు నిర్వక్రంబుగం గొలువ, దిగ్విజయార్థంబు వెడలి, పూర్వదక్షిణపశ్చిమోత్తరసముద్రలగ్నంబు లయిన యిలావృతరమ్యకహిరణ్మయహరివర్షకింపురుషభద్రాశ్వకేతుమాలభారతవర్షంబులు, నుత్తరకురుదేశంబులును జయించి, తత్తద్దేశవాసు లిచ్చిన కానికలు గైకొనుచు మంగళపాఠకసంఘాతజేగీయమానపూర్వరాజవృత్తాంతంబు లాకర్ణించుచుఁ, బాఠకపఠితపద్యంబులవలనం బాండవులకు భక్తవత్సలుం డైన పుండరీకాక్షుం డాచరించిన సారథ్య సఖ్య సాచివ్య సభాపతిత్వ వీరాసన దూతభావాదికర్మంబులు, నశ్వత్థామాస్త్రతేజంబువలనఁ దన్ను రక్షించుటయు, యాదవపాండవులందలి స్నేహానుబంధంబును, వారలకుఁ గలిగిన భగవద్భక్తివిశేషంబును విని, విశ్వంభరుని భక్తవాత్సల్యంబునకు నాశ్చర్యంబు నొందుచు, వందిబృందంబులకు మహార్ఘంబులగు హారాంబరాభరణాదిసందోహంబుల నొసంగుచుఁ బద్మనాభపాదపద్మభజనపరతంత్రపవిత్రమానసుం డై యుండె; నయ్యెడ వృషభరూపంబున నేకపాదంబున సంచరించు ధర్మదేవుండు దనసమీపంబున లేఁగ లేని లేఁగటి[1]కుఱ్ఱి చందంబున హతప్రభయై నేత్రంబుల సలిలంబులు గురియుచు గోరూప యైయున్న ధాత్రి కిట్లనియె: 362

మ. "నయనాంభఃకణజాల మేల విడువన్ నాతల్లి? నీమేను [2]సా
మయమై యున్నది; మోము వాడినది; నీ మన్నించుచుట్టాలకున్
భయదుఃఖంబులు నెందు వొందవు గదా? బంధించి శూద్రుల్ పద
త్రయహీనున్ ననుఁ బట్ట వత్తు రనియో? తాపంబు నీకేటికిన్? 363

సీ. మఖములు లేమి నమర్త్యుల కిటమీఁద మఖభాగములు లేక మాను ననియొ?
రమణులు రమణుల రక్షింప రనియొ? పుత్త్రులఁ దల్లిదండ్రులు ప్రోవ రనియొ?
భారతి కుజనులఁ బ్రాపించు ననియొ? సద్విప్రులు నృపుల సేవింతు రనియొ?
కులిశహస్తుఁడు వాన గురియింపకుండఁగఁ బ్రజలు దుఃఖంబులఁ బడుదురనియొ?
ఆ. హీనవంశజాతు లేలెద రనియొ? రా - జ్యములు [3]పాడి గలిగి జరగ వనియొ?
మనుజు లన్నపానమైథునశయనాస - నాదికర్మసక్తు లగుదు రనియొ? 364

మ. జననీ! నీభర మెల్ల డించుటకు నై చక్రాయుధుం డిన్ని హా
యనముల్ దాను నరాకృతిన్ మెలఁగి, నిత్యానందముం జేసి, పో

1. కుఱ్ఱి = పాఁడియావు. 2. సామయము = సగము. 3. పాడి = న్యాయము, ధర్మము.

యైన నే నింక ననాథ నైతిఁ, గుజనుం డెవ్వాఁడు శాసించునో,
పెనుదుఃఖంబులఁ బొందఁ గంటి నని యో భీతిల్లి చింతించుటల్ ? 365

క. దెప్పర మగు కాలముచే - నెప్పుడు దేవతల కైన నిష్టం బగు నీ
యొప్పిదము కృష్ణుఁ డరిగినఁ - దప్పెఁ గదా తల్లి ! నీవు తల్లడపడఁగన్ ?'' 366

వ. అనిన భూదేవి యి ట్లనియె : 367

క. "ఈలోకంబునఁ బూర్వము - నాలుగుపాదముల నీవు నడతువు; నేఁ డా
శ్రీలలనేశుఁడు లేమిని - గాలముచే నీకు నొంటికా లయ్యెఁ గదే! 368

వ. మఱియు సత్యశౌచదయా[1]క్షాంతులును, త్యాగసంతో[2]షార్జవంబులును, శమదమతపంబులును, సమత్వంబును, బరాపరాధసహనంబును, లాభంబు గల యెడ నుదాసీనుండై యుండుటయును, శాస్త్రవిచారంబును, జ్ఞానవిరక్తులును, నైశ్వర్యశౌర్యప్రభావదక్షత్వంబులును, స్మృతియును, స్వాతంత్ర్యంబును, గౌశలకాంతిధైర్యమార్దవ ప్రతిభాతిశయప్రశ్రయశీలంబులును, జ్ఞానేంద్రియ కర్మేంద్రియ మనోబలంబులును, సౌభాగ్యగాంభీర్యస్థైర్యంబులును, శ్రద్ధాకీర్తి మానగర్వాభావంబులును ననియెడి ముప్పదితొమ్మిది గుణంబులు, నవియునుం గాక బ్రహ్మణ్యతా శరణ్యతాది మహాగుణసమూహంబును శ్రీకృష్ణదేవుని యందు వర్తిల్లుంగావున, 369

క. గణనాతీతము లగు సద్గుణములు గల చక్రి నని ఘోరకలిస్త్రీ
రణమునఁ బాపసమూహ - వ్రణయుతు లగు జనులఁ జూచి వగచెదఁ దండ్రీ !

క. దేవతలకు, ఋషులకుఁ, బితృ-దేవతలకు, నాకు, నీకు, ధీరులకును, నా
నావర్ణాశ్రమములకును, - గోవులకును బాధ యనుచుఁ గుందెద ననఘా ! 371

సీ. బ్రహ్మాదు లెవ్వని భద్రకటాక్షవీక్షణము వాంఛింతురు సత్తపములఁ ?
గమలాలయము మాని కమల యెవ్వని పాదకమలంబు సేవించుఁ గౌతుకమునఁ ?
బరమయోగీంద్రులు భవ్యచిత్తములందు నిలుపుదు రెవ్వాని నియతితోడ ?
వేదంబు లెవ్వాని విమలచారిత్రముల్ వినుతింపఁగా లేక [3]వెగడుపడియె ?

ఆ. నట్టి వాసుదేవు నబ్జవజ్రాంకుశ-చక్రమీనశంఖచాపకేతు
చిహ్నితంబు లైన శ్రీచరణము లింక - సోఁక వనుచు వగపు సోఁకెనయ్య !

క. హరిపాదంబులు సోఁకెడి - సిరికతమున నఖిలభువనసేవ్యత్వముతో
స్థిర నైతి నిన్నిదినములు - హరి నాగర్వంబు మాన్చి యరిగె మహాత్మా ! 373

క. లీలాకారము దాల్చెను - శ్రీలలనేశుండు ఖలుల శిక్షించి భవో
న్మూలనము సేయుకొఱకును - నాలుగుపాదముల నిన్ను నడపించుటకున్. 374

1. క్షాంతి=ఓర్పు. 2. ఆర్జవము=ఋజుభావము, చక్కనినడత. 3. వెగడుపడు=తల్లడపడు.

ఉ. ఆ మధురోక్తు, లా నయము, లా దరహాసము, లా దయారసం
బా మురిపంబు, లా తగవు, లా గమనక్రియ, లా మనోహర
ప్రేమకరావలోకనము ప్రీతిఁ గనుంగొన లేమి మాధవుం
గామిను లేల నిర్దళితకర్ములు యోగులుఁ బాయ నేర్తురే? 375

క. మెల్లన నాపై యాదవ - వల్లభుఁ డడుగిడఁగ మోహవశనై నే రం
జిల్లఁగ రోమాంచముక్రియ-[1]మొల్లములై మొలచు సస్యములుమార్గములన్.”

వ. అని యిటు పూర్వవాహిని యైన సరస్వతీ తీరంబున ధర్మదేవుండును, భూమియు వృషభధేనురూపంబుల భాషింప, రాజర్షి యైన పరీక్షిద్భూవరుండు డగ్గఱియె; నాసమయంబున, 377

కలిపురుషుఁడు ధర్మదేవతను దన్నుట

శా. కైలాసాచలసన్నిభం బగు మహాగంభీరగోరాజముం
గాలక్రోధుఁడు, దండహస్తుఁడు, నృపాకారుండు, క్రూరుండు, జం
ఘాలుం డొక్కఁడు శూద్రుఁ డాసురగతిం గారుణ్యనిర్ముక్తుఁ డై
నేలం గూలఁగఁ దన్నెఁ [2]బంచితిలఁగా నిర్ఘాతపాదాహతిన్. 378

వ. మఱియును, 379

శా. ఆ లోలాంగక, నశ్రుతోయకణజాలాక్షిన్, మహాంభారవన్,
బాలారూఢతృణావళీకబళలోభవ్యాప్తజిహ్వాగ్ర, నాం
దోళస్వాంత, నజీవవత్స, నుదయద్దుగ్ధాన్వితన్, ఘర్మకీ
లాలాపూర్ణశరీర నా మొదవు నుల్లంఘించి తన్నెన్ వడిన్. 380

వ. ఇట్లా ధేనువృషభంబుల రెంటినిం గంటకుం డై తన్నుచున్న రాజలక్షణముద్రితుం డయిన శూద్రునిం జూచి, సువర్ణపరికరస్యందనారూఢుం డగు నభిమన్యునందనుండు కోదండంబు సగుణంబు సేసి, మేఘగంభీరరవంబు లగు వచనంబుల ని ట్లనియె: 381

శా. “నిన్నుం గొమ్ములఁ జిమ్మెనో, కదిసెనో? నిర్భీతి వై గోవులం
దన్నం గారణ మేమి? మద్భుజసనాథక్షోణి నేవేళలం
దు న్నేరంబులు సేయ రా; దెఱుఁగవా? ధూర్తత్వమున్, భూమిభృ
త్సన్నాహంబు నొనర్చె; దెవ్వఁడవు? నిన్ శాసించెదన్ దుర్మతీ! 382

క. గాండీవియుఁ, జక్రియు భూ-మండలిఁ బెడఁబాసి చనిన మదమత్తుఁడ వై
దండింపఁ దగనివారల - దండించెదు; నీవ తగుదు దండనమునకున్.” 383

---

1. మొల్లములు = అధికములు. 2. పంచితిలు = మూత్రము విడుచు; ఉచ్చపోసుకొను.

వ. అని వృషభంబు నుద్దేశించి యిట్లనియె: 384

మ. "కురుధాత్రీశ్వర బాహువప్రయుగళీగుప్తక్షమామండలిం
బరికింపన్ భవదీయనేత్రజనితాంభశ్శ్రేణిఁ దక్కన్ జనుల్
[1]దొరఁగం జేయ రధర్మసంజనితజంతుశ్రేణిబాష్పంబులన్;
గురుశక్తిన్ విదళింతుఁ జూడు మితనిన్ గోమూర్తి దేవోత్తమా! 385

క. జాలిఁ బడ నేల? నాశర - జాలంబులపాలు సేసి చంపెద వీనిన్;
భూలోకంబున నిపుడే - నాలుగుపాదముల నిన్ను నడపింతుఁ జుమీ! 386

ఉ. వాచవియైన గడ్డిఁ దిని, వాహినులందు జలంబు ద్రావఁగా
నీచరణంబు లెవ్వఁ డిటు నిర్దళితంబుగఁ జేసె? వాఁడు దా
ఖేచరుఁడైన వాని మణికీలితభూషణయుక్తబాహులన్
వేచని త్రుంచివైతు వినువీథికి నేఁగిన, నేల డాఁగినన్." 387

వ. అని మఱియు గోరూప యయిన భూదేవితో నిట్లనియె: 388

చ. "అగణితవైభవుం డగు మురాంతకుఁ డక్కట పోయె నంచు నె
వ్వగలఁ గృశించి నేత్రముల వారికణంబులు దేకుమమ్మ! లో
బెగడకుమమ్మ! మద్విశిఖబృందములన్ వృషలున్ వధింతు; నా
మగఁటిమిఁ జూడవమ్మ! [2]వెఱ మానఁగదమ్మ! శుభప్రదాయినీ! 389

క. సాధువు లగు జంతువులకు - బాధలు గావించు ఖలుల భంజింపని రా
జాధము నాయుస్స్వర్గ - శ్రీధనములు వీటిఁబోవు సిద్ధము తల్లీ! 390

క. దుష్టజన[3]నిగ్రహంబును, - శిష్టజనానుగ్రహంబుఁ జేయఁగ నృపులన్
స్రష్ట విధించెఁ; బురాణ - ద్రష్టలు సెప్పుదురు పరమధర్మము సాధ్వీ!" 391

వ. అనిన ధర్మనందనపౌత్రునకు వృషభమూర్తి నున్న ధర్మదేవుం డిట్లనియె: 392

ఉ. "క్రూరులఁ జంపి సాధువులకున్ విజయం బొనరించునట్టి యా
పౌరవవంశజాతుఁడవు, భాగ్యసమేతుఁడ వౌదు, తొల్లి మీ
వా రిటువంటివా రగుట వారిజనేత్రుఁడు మెచ్చి దౌత్యసం
చారము సేసెఁ గాదె నృపసత్తమ! భక్తిలతానిబద్ధుఁడై. 393

వ. నరేంద్రా! యేము ప్రాణులకు దుఃఖహేతువులము గాము; మావలన దుఃఖంబు నొందెడు పురుషుండు లేఁడు; వాదివాక్య భేదంబుల యోగీశ్వరులు మోహితులై భేదంబు నాచ్ఛాదించి తమకు నాత్మ సుఖదుఃఖంబుల నిచ్చు ప్రభు వని చెప్పుదురు; దైవజ్ఞులు గ్రహదేవతాదులకుఁ బ్రభుత్వంబు సంపాదింతురు; మీమాంసకులు గర్మంబునకుం బ్రాభవంబుం బ్రకటింతురు; లోకాయతికులు స్వభావంబునకుఁ బ్రభుత్వంబు వలుకుదు; రిందెవ్వరికిని సుఖదుఃఖప్రదానంబు సేయఁ

1. తొరఁగు = స్రవించు. 2. వెఱ = భయము. 3. నిగ్రహము = శిక్ష.

ప్రభుత్వంబు లేదు; పరులవలన దుఃఖంబు వచ్చిన నధర్మంబు పరులు సేసిరని విచారింపవలదు; తర్కింపను నిర్దేశింపను రాని పరమేశ్వరునివలన సర్వంబు నగుచుండు" ననిన ధర్మదేవునికి ధర్మనందనపౌత్రుం డిట్లనియె : 394

ఆ. "ధర్మమూర్తి వయ్య! ధర్మజ్ఞ! వృషరూప!–పరమధర్మ మీవు పలుకు త్రోవ;
పాపకర్మ చేయుపాపంబు సూచింపఁ – బాపకర్ముఁ డేఁగుపథము వచ్చు. 395

వ. మఱియు దేవమాయవలన భూతంబుల వాఙ్మనసంబులకు వధ్యఘాతుకలక్షణం బగు వృత్తి సులభంబుగం దెలియరాదు; నీవు ధర్మదేవతవు; కృతయుగంబునం దపశ్శౌచదయాసత్యంబు లను నాలుగు నీకుం బాదంబు లని చెప్పుదురు; త్రేతాయుగంబునఁ బూర్వోక్తపాదచతుష్కంబునం దొక్కపాదంబు క్షీణం బయ్యె; ద్వాపరంబునం బాదద్వయంబు నశించెం; గలియుగంబందు నివ్వడువున నిప్పుడు నీకుఁ బాదత్రయంబు భగ్నంబయ్యె; నవశిష్టం బగు భవదీయచతుర్థ పాదంబు నధర్మంబు గల్యంతంబున నిగ్రహింప గమకించుచున్నయది; విను, మఱియునుం గాక, 396

మ. భరముం బాపి రమావిభుండు గరుణం బాదంబులం ద్రొక్కఁగా
స్థిరయై వేడుక నింతకాలము సుఖశ్రీ నొందె భూదేవి; త
చ్చరణస్పర్శము లేమి శూద్రకులజుల్ శాసింతు రంచున్ నిరం
తరశోకంబున నీరు గన్నుల నిడెన్ ధర్మజ్ఞ! వీక్షించితే?" 397

పరీక్షిన్మహారాజు కలిని నిగ్రహించి ధర్మపరిపాలనము సేయుట

వ. అని యిట్లు ధరణీ ధర్మదేవతల బుజ్జగించి, మహారథుం డయిన విజయపౌత్రుండు క్రూరకారు మెఱుంగు తెఱంగు ధిక్కరించుచు, దిక్కులకు వెక్కసం బయిన యడిదంబు [1]బెడిదంబుగ జడిపించి పాపహేతు వయిన కలిని రూపుమాప నుద్యోగించిన, వాఁడు రాజరూపంబు విడనాడి, వాడిన మొగంబుతోడ, భయవిహ్వలుం డై, హస్తంబులు సాఁచి, తత్పాదమూలవిన్యస్తమస్తకుం డై ప్రణామంబు సేసి,

క. "కంపించె దేహ మెల్లం; – జంపకు మో రాజతిలక! శరణాగతు ర
క్షింపు"మని తనకు మ్రొక్కినఁ – జంపక కలిరాజుఁ జూచి జనపతి వలుకున్ :

క. "[2]అర్జునకీర్తిసమేతుం–డర్జునపౌత్రుండు భయరసావృతజనులన్
నిర్జితులఁ జంప నొల్లఁడు; – దుర్జనభావంబు విడిచి తొలఁగు దురాత్మా! 400

వ. నీవు పాపబంధుండవు; మదీయబాహుపాలితం బయిన మహీమండలంబున నిలువ వలవదు; రాజదేహంబునందు వర్తించు నిన్ను నసత్యలోభచౌర్యదౌర్జన్య

1. బెడిదముగ = భయంకరముగ. 2. అర్జున = తెల్లని.

దురాచార మాయాకలహ కపటకలుషాలస్యాదిధర్మేతర సమూహంబు లాశ్రయించు; సత్యధర్మంబులకు నివాసం బగు బ్రహ్మావర్తదేశంబున యజ్ఞవిస్తార నిపుణు లయినవారు యజ్ఞేశ్వరుం డయిన హరిం గూర్చి యాగంబులు సేయు చున్నవారు; వారలకు సుఖప్రదానంబు సేయుచు సకలభూతాంతర్యామి యై భగవంతుం డయిన హరి జంగమస్థావరంబులకు నంతరంగబహిరంగముల సంచరించు వాయువు చందంబున నాత్మరూపంబున మనోరథంబుల నిచ్చుం గావున నీ విందుండవలవ" దనుచు దండహస్తుం డయిన యముని కైవడి [1]మండలాగ్రంబు సాఁచిన రాజవర్యునకుం గలి యి ట్లనియె : 401

క. "జగతీశ్వర! నీయడిదము - ధగధగితప్రభలతోడఁ దఱచుగ మెఱయన్
బెగడెం జిత్తము; గుండెలు - వగిలెడి; నిఁక నెందుఁ జొత్తు? భావింపఁగ దే!

వ. నరేంద్రా! నిన్ను నారోపితశరశరాసను సర్వప్రదేశంబులందును విలోకించు చున్నవాఁడ; నే నెక్కడ నుండుదు, నానతి" మ్మనిన రాజన్యశేఖరుండు ప్రాణివధ స్త్రీద్యూతపానంబు లనియెడి నాలుగు స్థానంబుల నిచ్చి, మఱియు నడిగిన సువర్ణమూలం బగు నసత్యమదకామహింసావైరంబు లనియెడు పంచప్రదేశంబుల నొసంగి, యితర స్థలంబుల స్పృశియింపకుండ నియమించె; నిట్లు కలినిగ్రహంబు సేసి, హీనంబు లయిన తపశ్శౌచదయ లనియెడి మూఁడుపాదంబులు వృషభమూర్తి యయిన ధర్మదేవత కిచ్చి, రత్నగర్భకు [2]నిర్భరం బయిన సంతోషంబు సంపాదించి, 403

క. గజనామధేయపురమున, - గజరిపుపీఠమున ఘనుఁడు గలిమర్దనుఁ డ
గ్గజవైరిపరాక్రముఁ డే - గజిబిజి లేకుండఁ దాల్చెఁ గౌరవలక్ష్మిన్. 404

వ. ఇట్లు కృష్ణుని యనుగ్రహంబున నశ్వత్థామబాణపావకంబువలనఁ బ్రదికి, వృషభమూర్తి యయిన ధర్మదేవతకు నభయం బిచ్చిన పరీక్షిన్నరేంద్రుండు బ్రాహ్మణ శాపప్రాప్తతక్షకాహిభయంబువలనఁ బ్రాణంబులు వోవు నని యెఱింగి, సర్వ సంగంబులు వర్జించి, శుకునకు శిష్యుం డై, విజ్ఞానంబు గలిగి, గంగాతరంగిణీ తీరంబునం గళేబరంబు విడిచె; వినుఁడు. 405

క. హరివార్త లెఱుఁగువారికి, - హరిపదములు దలఁచువారి, కనవరతంబున్
హరికథలు వినెడివారికి - మరణాగతమోహసంభ్రమము లే దనఘా! 406

క. శుభచరితుఁడు హరి యరిగినఁ - బ్రభవించి ధరిత్రి నెల్లఁ [3]బ్రబ్బియుఁ, గలి దా
నభిమన్యుసుతునివేళను - బ్రభవింపక యడఁగియుండె భార్గవముఖ్యా! 407

వ. ఇవ్విధంబునఁ జతుస్సముద్రముద్రితాఖిలమహీమండలప్రాజ్యసామ్రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయుచు నా యభిమన్యుసంభవుండు, 408

---

1. మండలాగ్రము = ఖడ్గము. 2. నిర్భరము = అధికము. 3. ప్రబ్బు = వ్యాపించు.

ఉ. చేసినఁ గాని పాపములు సెందవు; చేయఁ దలంచినంతటం,
జేసెద సన్న మాత్రమునఁ జెందుఁగదా కలివేళఁ బుణ్యముల్ ?
మోసము లే దటంచు నృపముఖ్యుఁడు గాచెఁ గలిన్ మరంద ము
ల్లాసముతోడఁ గ్రోలి విరులం దెగఁజూడని తేఁటికైవడిన్. 409

వ. మఱియుం బ్రమత్తులై యధీరు లగు నరులయందు వృకంబు చందంబున నొదిఁగి [1]లాఁచుకొని యుండి చేష్టించుం గాని ధీరులైనవారికిం గలివలని భయంబు లే దని కలి నంతంబునొందింపఁ డయ్యె" ననిన విని, ఋషులు సూతున కి ట్లనిరి : 410

సీ. "పౌరాణికోత్తమ! బ్రదుకుము పెక్కేండ్లు; తామరసాక్షుని ధవళయశము
మరణశీలుర మైన మా కెఱింగించితి; కల్పితం బగు క్రతుకర్మమందుఁ
బొగలచేఁ బొగిలి యబుద్ధచిత్తుల మైన మము హరిపదపద్మమధురరసముఁ
ద్రావించితివి నీవు; ధన్యుల మైతిమి; స్వర్గమేనియు [2]నపవర్గమేని
తే. భాగవతసంగలవభాగ్యఫలము కీడె? – ప్రకృతిగుణహీనుఁడగుచక్రిభద్రగుణము
లీశకమలాసనాదులు నెఱుఁగలేరు – వినికి వినఁ జాల మనియెడి వెఱ్ఱి గలఁడె?

క. శ్రీపంబులు, ఖండితసం – తాపంబులు గల్మషాంధతమసమహోద్య
ద్దీపంబులు, పాషండదు – రాపంబులు విష్ణువందనాలాపంబుల్. 412

క. పావనములు, దురితలతా – లావనములు, నిత్యమంగళప్రాభవసం
జీవనములు, లక్ష్మీసం – భావనములు వాసుదేవపదసేవనముల్. 413

ఆ. పరమభాగవతుఁడు పాండవపౌత్త్రుండు – శుకుని భాషణముల శుద్ధబుద్ధి
యై, విరాజమానుఁ డై, ముక్తి యగు విష్ణు-పాదమూల మెట్లు వడసె ననఘ!

వ. మహాత్మా! విచిత్రయోగనిష్ఠాకలితంబును, విష్ణుచరితలలితంబును, బరమపుణ్యంబును, సకలకల్యాణగుణగణ్యంబును, భాగవతజనాపేక్షితంబును నైన పారీక్షితభాగవతాఖ్యానంబు వినిపింపు" మనిన సూతుం డి ట్లనియె : 415

క. "మిముబోఁటి పెద్దవారలు – కమలాక్షుని చరిత మడుగఁగాఁ జెప్పెడి భా
గ్యము గలిగె; నేఁడు నాజన్మము సఫలం బయ్యె వృద్ధమాన్యుఁడ నగుటన్. 416

క. కులహీనుఁడు నారాయణ – విలసత్కథనములు గడఁక వినిపించినఁ ద
త్కులహీనతఁ బాసి, మహో – జ్జ్వలకులజత్వమును బొందు సన్మునులారా! 417

సీ. ఎవ్వని గుణజాల మెన్న జిహ్వలు లేక నలినగర్భాదు లనంతుఁ డండ్రు?
కోరెడు విబుధేంద్రకోటి నొల్లక లక్ష్మి ప్రార్థించె నెవ్వని పాదరజము?

1. లాఁచుకొను = పొంచుకొను. 2. అపవర్గము = మోక్షము.

బ్రహ్మ యెవ్వని పాదపద్మంబు గడిగిన జలము ధన్యత నిచ్చె జనుల కెల్ల?
భగవంతుఁ డనియెడి భద్రశబ్దమునకు నెవ్వఁ డర్థాకృతి నేపుమిగులు?
ఆ. నేమహాత్ము నాశ్రయించి, శరీరాది - సంగకోటి నెల్ల సంహరించి,
ప్రాభవమున మునులు పారమహంస్యంబు - నొంది తిరిగిరాక యుందు రెలమి?

చ. క్రమమున మింటికై యెగయుఁ గాక విహంగము, మింటి దైన పా
రము గన నేర్చునే? హరిపరాక్రమ మోపినయంతఁ గాక స
ర్వము వివరింప నెవ్వఁడు ప్రవర్తకుఁ డౌ మునులార! నాదు చి
త్తమునకు నెంత గానఁబడెఁ దప్పక చెప్పెద మీకు నంతయున్. 419

క. వేదండపురాధీశుఁడు - గోదండము సేతఁ బట్టికొని గహనములో
వేదండాదుల నొకనాఁ - డేదండలఁ బోవనీక యెగచెఁ బలిమిన్. 420

క. [1]ఒగ్గములు ద్రవ్వి, పడు మని - యొగ్గెడు పెనుఁదెరల వలల నుగ్రమృగములన్
దగ్గఱి చంపెడు వేడుక - వెగ్గల మై చిత్తమందు వెంటాడింపన్. 421

క. కోలముల గవయ వృక శా - ర్దూలములఁ దరక్షు ఖడ్గ రోహిత హరి శుం
డాలముల శరభ చమర - వ్యాలముల వధించె విభుఁడు వడి [2]నోలములన్. 422

వేఁటకు వెళ్లిన పరీక్షితుఁడు శమీకునిపై మృతసర్పము నెత్తి వైచుట

క. మృగయులు మెచ్చ నరేంద్రుఁడు-మృగరాజపరాక్రమమున మెఱసి, హరించెన్
మృగధరమండలమునఁ గల-మృగ మొక్కటి దక్క- సర్వమృగముల నెల్లన్.

వ. ఇట్లు వాటం బయిన వేఁటతమకంబున మృగంబుల వెంబడిం బడి యెగచుచుం
జరించుటం జేసి బుభుక్షాపిపాసలవలన మిగులఁ బరిశ్రాంతుం డయి ధరణీకాం
తుండు చల్లనినీటికొలంకుం గానక, కలంగెడుచిత్తంబుతోఁ జని చని, యొక్క
తపోవనంబుఁ గని, యందు, 424

సీ. మెలఁగుట చాలించి, మీలితనేత్రుఁ డై, శాంతుఁ డై కూర్చుండి, జడత లేక,
ప్రాణమనోబుద్ధిపంచేంద్రియంబుల బహిరంగవీథులఁ బోవనీక,
జాగరణాదికస్థానత్రయము దాఁటి పరమ మై యుండెడి పదముఁ దెలిసి,
బ్రహ్మభూతత్వసంప్రాప్తి [3]విక్రియుఁ డయి యతిదీర్ఘజటలు దన్నావరింప,
తే. నలఘురురుచర్మధారియై యలరుచున్న-తపసిఁ బొడగని, శోషితతాలుఁ డగుచు
నెండి,తడి లేక,కుత్తుక నెలుఁగు డింద,-మందభాషల నిట్లను మనుజవిభుఁడు: 425

1. ఒగ్గములు = పల్లములు. 2. ఓలము = మఱుఁగు, మాటు. 3. పవిత్రుఁడై, విశ్రాంతుఁడై అని పూర్వ ముద్రణపాఠములు. 'బ్రహ్మభూత మవిక్రియమ్' అని మూలము. కాన 'ప్రాప్త్యవిక్రియుఁడయి' అని యుండఁ దగును.

తే. ఇన్ని దెలియంగ నానతియిచ్చి, నన్ను - నర్థి రక్షింపవే విమలాంతరంగ!
ఘనదయాపాంగ! హరిపాదకమలభృంగ! - మహితగుణసంగ! పాపతమః[1]పతంగ!”

చ. అనవుడు బాదరాయణి ధరాధిపుతోఁ ననుఁ: “పూరువంశవ
ర్ధన! విను, కష్టుఁడైన ధృతరాష్ట్రనృపాలుఁడు పెంపుతోఁ సుయో
ధనముఖపుత్త్రులం గడు ముదంబునఁ బెంచుచుఁ, బాండురాజు [2]త
ప్పినపిదపం దదాత్మజులు వెక్కటి తన్నని చేరవచ్చినన్. 11

వ. ఇట్లు చేరవచ్చిన పాండవులయెడ నసూయానిమగ్నులై, సుయోధనాదులు, 12

క. పెట్టిరి విషాన్న; మంటం - గట్టిరి ఘనపాశములను; గంగానదిలో
నెట్టిరి; రాజ్యము వెడలం - గొట్టిరి ధర్మంబు విడిచి కుటిలాత్మకులై. 13

క. క్రూరాత్ము లగుచు లాక్షా - గారంబున వారు నిద్రఁ గైకొనియుండన్,
దారుణశిఖి దరికొలిపిరి - మారణకర్మముల నప్రమత్తత వెలయన్. 14

తే. సూరిజనగేయ మగు రాజసూయయజ్ఞ - విలసదవభృథసేకపవిత్రమైన
ద్రౌపదీచారువేణీభరంబు పట్టి - కొలువులోపలి కీడ్చిరి కుచ్చితమున. 15

క. కావున వారల కపకృతి - గావింపని దొకదినంబుఁ గలుగదు తమ జ
న్మావధి; నిజనందనులను - [3]వాపిరి నయ్యంధనృపతి వలదనఁ డయ్యెన్. 16

తే. మాయజూదంబువన్ని దుర్మార్గవృత్తిఁ - బుడమిఁ గొని, యడవులకుఁ బోనడవ, నచటఁ
దిరిగి వారలు సమయంబు దీర్చి, యేఁగు - దెంచి, తమయంశ మడిగినఁ బంచియీక.

వ. ఉన్నయెడ, 18

చ. సకలనియంత యైన హరి, సర్వశరణ్యుఁడు, మాధవుండు, సే
వకనవకల్పకంబు, భగవంతుఁ, డనంతుఁ, డనంతశక్తి, నం
దకధరుఁ, డబ్జలోచనుఁడు ధర్మతనూభవుచే నియుక్తుఁడై,
యకుటిలభక్తియోగమహితాత్మకుఁడై ధృతరాష్ట్రపాలికిన్. 19

క. చని, యచట భీష్మ గురు త - త్తనయకృపాచార్యనిఖిలధాత్రీపతులున్
విని యనుమోదింపఁగ ని - ట్లనియెన్ ధృతరాష్ట్రుతోడ: “నవనీనాథా! 20

క. కౌరవపాండవు లిరువురు - నారయ నీకొక్కరూప; యవనీవర! నీ
వేరీతి నైనఁ బాండుకు - మారులపా లొసఁగితేని మను నుభయంబున్.” 21

క. అని ధర్మబోధమునఁ బలి - కిన మాటలు సెవుల నిడమిఁ, గృష్ణుఁడు విదురున్,
ఘననీతిమంతుఁ బిలువం - బనిచినఁ, జనుదెంచెఁ గురుసభాస్థలమునకున్. 22

1. పతంగుఁడు=సూర్యుఁడు. 2. తప్పినపిదపన్ = చనిపోయినపిమ్మట. 3. వాపిరి = నోరార.

వ. చనుదెంచి, యచటి జనంబులచేత నుపస్థితంబయిన కార్యంబు దెలిసినవాఁడయి, ధృతరాష్ట్రు నుద్దేశించి యిట్లనియె : 23

మ. "ధరణీనాయక! పాండుభూవిభుఁడు నీతమ్ముండు; తత్పుత్త్రులం
బరిరక్షించిన ధర్మవుం, [1]దగవునుం బాటిల్లు; వంశంబు సు
స్థిరసౌఖ్యోన్నతిఁ జెందు; శత్రుజయముం జేకూరు; గోపాలశే
ఖరుచిత్తంబును వచ్చు; నట్లగుటయుం గౌరవ్యవంశాగ్రణీ! 24

ఆ. వారి తండ్రిపాలు వారికి నొసఁగి, నీ-పాలు సుతుల కెల్లఁ బంచి యిచ్చి,
చలము విడిచి, ధర్మ మలవడ నీబుద్ధిఁ-జొనుపవయ్య! కులము మనుపవయ్య! 25

చ. వినుము నృపాల! నాపలుకు; వేయును నేల? సమీరసూతి నీ
తనయుల పేరు విన్నఁ బదతాడితదుష్టభుజంగమంబుచా
డ్పునఁ గనలొందు; నింతయును మున్నును జెప్పితిఁ గాదె? వానిచే
తన భవదీయపుత్త్రులకుఁ దప్పదు మృత్యు వ దెన్నిభంగులన్. 26

వ. అదియునుం గాక, 27

క. నీపుత్త్రుల శౌర్యంబును, - జాపాచార్యాపగాత్మజాత కృప భుజా
టోపంబును, గర్ణ దురా - లాపంబులు నిజముగాఁ దలంతె మనమునన్? 28

వ. అట్లని వినుము. 29

ఉ. ఏపరమేశుచే జగము లీసచరాచరకోటితో సము
ద్దీపిత మయ్యె? నేవిభుని దివ్యకళాంశజు లబ్జగర్భగౌ
రీపతిముఖ్య దేవమునిబృందము? లెవ్వఁ డనంతుఁ, డచ్యుతుం?
డాపురుషోత్తముండు గరుణాంబుధి కృష్ణుఁడు వో నరేశ్వరా! 30

ఉ. అట్టి జగన్నివాసుఁడు, మురాసురభేది, పరాపరుండు చే
పట్టి, సఖుండు, వియ్యమును, బాంధవుఁడున్, గురుఁడున్, విభుండు నై,
[2]యిట్టల మైన ప్రేమమున నెప్పుడుఁ దోడ్పడుచుండు; వారలన్
జుట్టనవ్రేల నెవ్వరికిఁ జూపఁగ వచ్చునె పార్థివోత్తమా! 31

ఉ. కావునఁ బాండునందనులఁ గాఱియవెట్టక, రాజ్యభాగమున్
వావిరి నిచ్చి, రాజ్యమును, వంశముఁ, బుత్త్రుల, బంధువర్గముం
గావుము; గాక లోభి యగు కష్టసుయోధనుమాట వింటివే,
భూవర! నీయుపేక్ష నగుఁబో కులనాశము, బంధునాశమున్. 32

తే. ఒకనికై యిట్లు కులమెల్ల నుక్కడంప
నెత్తికొనఁ జూచె; దిది నీతియే? నృపాల!

1. తగవు = న్యాయము, యుక్తము. 2. ఇట్టలమైన = అగ్గలమైన, అధికమైన.

వినుము నామాట: నీసుయోధనుని విడిచి,
కులము, రాజ్యంబుఁ, దేశంబు, నిలుపవయ్య!'' 33

క. అని యిట్లు దఱిమి చెప్పిన - విని దుర్యోధనుఁడు రోషవివశుం డై, తా
నినతనయ శకుని దుశ్శా - సనుల నిరీక్షించి, తామసంబునఁ బలికెన్ : 34

క. ''దాసీపుత్త్రుని మీఱ లు-దాసీనుం జేయ, కిటకుఁ దగునె పిలువఁగా?
నాసీనుం డై ప్రేలెడు-గాసిలి చెడి పోవ; వెడలఁగా నడువుఁ డిఁకన్.'' 35

వ. అని యిట్లు దుర్యోధనుం డాడిన దురాలాపంబులు దనకు మనస్తాపంబు సేయం, గార్యంబు విచారించి, ధైర్యం బవలంబించి, యొండు వలుక నొల్లక, శరశరాసనంబులు విడిచి, క్రోధంబు నడంచి, వనంబునకుం జని, యందు, 36

సీ. విష్ణుస్స్వయంవ్యక్తవిమలభూములను, బవిత్రంబు లగు హరిక్షేత్రములను
నెలకొని దేవతానిర్మితహరిదివ్యభూముల, గంగాదిపుణ్యనదుల,
సిద్ధపురాణప్రసిద్ధపుణ్యాశ్రమస్థలముల, నుపవనస్థలములందు,
గంధమాదనముఖక్ష్మాభృత్తటంబుల, మంజులగిరికుంజపుంజములను,

తే. వికచకైరవపద్మ[1]హల్లకమరంద - పానపరవశమధుకరగానబుద్ధ
రాజహంసవిలాసవిరాజమాన - మగుచుఁ జెలువొందు పంకేరుహాకరముల. 37

క. మఱియును ఋష్యాశ్రమ వన-సరి దుపవన నద పుళింద జనపద గిరిగ
హ్వర గోష్ఠ యజ్ఞశాలా-పుర దేవాయతన పుణ్యభూములయందున్. 38

క. కూరలుఁ, గాయలు, నీళ్లా-హారముగాఁ గొనుచు, నియమ మలవడఁగ, నసం
స్కారశరీరుం డగుచు, ను-దారత నవధూతవేషధరుఁ డై, వరుసన్. 39

క. హర్షము గదురఁగ, భారత-వర్షమునం గలుగు పుణ్యవరతీర్థము లు
త్కర్షం జూచుచు, విగతా - మర్షుం డై సంచరించె మనుజవరేణ్యా! 40

వ. ఇట్లు సంచరించుచుఁ బ్రభాసతీర్థమ్మునకు వచ్చునప్పుడు. 41

చ. అరుగుచు [2]దైత్యభేదనదయాపరిలబ్ధసమస్తమేదినీ
భరణధురంధరుం డగుచుఁ బాండుసుతాగ్రజుఁ డొప్పుచుండ భూ
వర! విదురుండుఁ దన్నికటవన్యతమాల రసాల మాధవీ
కురవక మాలతీ వకుళ కుంజలసత్తటమందు నున్నెడన్. 42

చ. నరవర! వేణుజానలవినష్టమహాటవిమాడ్కిఁ బాండుభూ
వర ధృతరాష్ట్రసూను లనివార్యనిరూఢవిరోధ మెత్తి, యొం
డొరుల జయింపఁ గోరి, కదనోర్విఁ గురుక్షితిపాలముఖ్యు లం
దఱు మృతు లౌటయున్ విని, ఘనంబుగ శోకనిమగ్నచిత్తుఁ డై. 43

---

1. హల్లకము = చెంగలువ. 2. దైత్యభేదనుఁడు = దైత్యారి, విష్ణువు.

ఉ. ఆయెడఁ [1]గాలుదన్నక, రయంబున నేఁగి, సరస్వతీనదీ
తోయములందుఁ [3]గ్రుంకి, మునితుల్యుఁడు వే చనియెం [2]దనూనపా
త్తోయదహస్త భార్గవ పృథు త్రిత సోమ సుదాస శక్తిభృ
ద్వాయు యమాభిధానయుతవాహినులం దనురక్తిఁ గ్రుంకుచున్. 44

ఉ. వెండియుఁ బుణ్యభూములఁ, బవిత్రసరిత్తులఁ జూచుచుఁ, రమా
మండనుఁ డుండు దివ్యరుచిమన్మణిచారుకవాటగేహాళీ
మండితసౌధగోపురవిమానము లున్నతభక్తిఁ జూచుచుఁ
నిండినవేడ్కఁ గృష్ణపదనీరజచింతనుఁడై క్రమంబునన్. 45

విదురుఁ డుద్ధవునిఁ గని కృష్ణాదుల వృత్తాంత మడుగుట

చ. చని చని తొంటి మత్స్యకురుజాంగలభూము లతిక్రమించి, చ
య్యన యమునానదిం గదిసి, యచ్చట భాగవతుఁ, సరోజలో
చనదృఢభక్తు, సద్గుణవిశారదు, శాంతుని, దేవమంత్రిశి
ష్యుని, మహిత ప్రసిద్ధుఁ, బరిశోషితదోషుఁ, బ్రబుద్ధు, నుద్ధవున్. 46

క. కని, యనురాగవికాసము – దనమనమునఁ [3]దొంగలింపఁ, దగ గాఢాలిం
గన మాచరించి, నెయ్యం – బునఁ గుశలప్రశ్న సేసి ముదమునఁ బలికెన్: 47

క. "హరిభక్తులు, పుణ్యాత్ములు, – దురితవిదూరులు, విరోధిదుర్దమబలులుం,
గురుకులతిలకులు, గుంతీ – వరసూనులు గుశలులే యవారితభక్తిన్? 48

చ. హరి దన నాభిపంకరుహమందు జనించినయట్టి భారతీ
శ్వరుఁ డతిభక్తి వేఁడ, యదువంశమునఁ బలకృష్ణమూర్తులై
పరఁగ జనించి, భూభరముఁ బాపిన భవ్యులు రేవతీందిరా
వరు లట శూరసేనుని నివాసమునఁ సుఖ మున్నవారలే? 49

చ. కురుకుల లాదరింపఁగ, సఖుండును, నాప్తుఁడునై తనర్చి, సో
దరతరుణీజనంబులను, దత్సుతులం గడు గారవంబునం
గరుణ దలిర్ప, నాత్మజులకంటెఁ బ్రియోన్నతిఁ బ్రోచువాఁడు సు
స్థిరమతి నున్నవాఁడె వసుదేవుఁడు? వృష్ణికులప్రదీపకా! 50

శా. కందర్పాంశమునం దనూజుఁ బడయం గామించి, భూదేవతా
బృందంబుఁ భజియించి, తత్కరుణ దీపింపం, బ్రభావంబు పెం
పొందఁ, రుక్మిణి గన్న నందనుఁడు ప్రద్యుమ్నుండు భాస్వచ్ఛమూ
సందోహంబులు దన్నుఁ గొల్వ మహితోత్సాహంబునఁ మించునే? 51

---

1. కాలుదన్ను = కాలునిలుచు. 2. తనూనపాత్తు = అగ్ని. 3. తొంగలించు = అతిశయిల్లు, వర్ధిల్లు.

క. సరసిజలోచనకరుణా - పరిలబ్ధసమస్తధరణిపాలనమహిమం
బరమప్రీతి సుఖించునె - చిరవిభవోదారుఁ డుగ్రసేనుఁడు జగతిన్? 52

చ. లలితపతివ్రతామణి, విలాసవతీతిలకంబు, పార్వతీ
లలన కుమారుఁ గన్నటు సులక్షణ, జాంబవతీలలామ ని
ర్మలగతిఁ గన్న పట్టి, సుకుమారతనుండు, విరోధిభంజ[1]నో
త్కలిక సుఖించునే గుణకదంబుఁడు సాంబుఁడు? వృష్ణిపుంగవా! 53

క. హరిపదసేవకుఁ, డరిభీ - కరుఁ, డర్జునువలన మిగులఁ గార్ముకవిద్యల్
దిరముగఁ [2]గఱచిన సాత్యకి - వరసుఖవిభవముల నున్నవాఁడె ధరిత్రిన్? 54

మ. జలజాతాంకుశచక్రచాపకులిశచ్ఛత్త్రాదిరేఖాంకితో
జ్జ్వలగోవిందపదాబ్జలక్షితవిరాజన్మార్గధూళిచ్ఛటా
కలితాంగుండు, విధూతకల్మషుఁడు, నిష్కామైకధర్ముండు, స
త్కులజాతుం డన నొప్పునట్టి ఘనుఁ డక్రూరుండు భద్రాత్ముఁడే? 55

క. శ్రుతులును, గ్రతుజాతము స - మ్మతిఁ దాల్చినయట్టి వేదమాతగతిన్ శ్రీ
పతిఁ దనగర్భంబున ర - క్షితుఁ జేసిన గరిత దేవకీసతి సుఖమే? 56

వ. మఱియు, మహాత్మా! మహితోపాసకులగువారల కోర్కులు నిండింపంజాలిన భగవంతుండును, శబ్దశాస్త్రంబునకుం గారణం బని తన్ను నఖిలదేవతాజనంబు లగ్గింపంగల మేటి యగుటం జేసి మనోమయుండును, సకలజీవచతుర్విధాంతఃకరణంబు లయిన చిత్తాహంకారబుద్ధిమనంబులకుం గ్రమంబున వాసుదేవసంకర్షణప్రద్యుమ్నానిరుద్ధులధిదైవతంబు లగుదు; రట్టి చతుర్విధతత్త్వంబులకుఁ దుర్యంబైన తత్త్వంబును నైన యనిరుద్ధకుమారుండు సంతోషచిత్తుం డగునే? 57

మ. ఇతరారాధన మాని, కృష్ణుఁ, గమలాధీశుం, బయోజాసనా
ర్చితు భక్తిన్ నిజనాథుఁగా సతతమున్ సేవించు పుణ్యుల్, జగ
న్నుతు, లధ్యాత్మవిదుల్, మహాభుజులు, మాన్యుల్, ధర్మమార్గుల్, సము
న్నతి సత్యాత్మజచారుదేష్ణగదు లానందాత్ములే యుద్ధవా! 58

తే. క్రోధమాత్సర్యధనుఁడు సుయోధనుండు - వోలుచు నెవ్వనిసభఁ జూచి కలుష మొదవి
మనములోన నసూయానిమగ్నుఁ డయ్యె - నట్టి ధర్మజుఁ డున్నాఁడె యనఘచరిత!

తే. ఘనగదాభ్యాసచిత్రసంగతుల మెఱసి - కురుకుమారుల భూరిసంగరములోన
హతులఁ గావించి వెలసినయట్టి జెట్టి - వాయుతనయుండు కుశలియై వఱలునయ్య!

1. ఉత్కలిక = ఉత్కంఠ, తహతహ. 2. కఱచు = నేర్చుకొను.

చ. హరికరుణాతరంగితకటాక్షనిరీక్షణాలబ్ధశౌర్యవి
స్ఫురణఁ దనర్చి, తన్ను నని బోయగతిన్ గిరిశుం డెదిర్చినన్
బరవస మొప్పఁగా గెలిచి, పాశుపతాస్త్రముఁ గొన్న శత్రుభీ
కరుఁడు, ధనంజయుండు సుభగస్థితి మోదము నొందుచుండునే? 61

మ. తెఱఁగొప్పన్ జననీవియోగమునఁ గుంతీ స్తన్యపానంబు, సో
దరసంరక్షయుఁ గల్గి, దేవవిభు వక్త్రస్థామృతంబున్ ఖగే
శ్వరుఁ డర్థిం గయికొన్నమాడ్కిఁ గురువంశశ్రేణి నిర్జించి, త
ద్ధరణీరాజ్యముఁ గొన్నమాద్రికొడుకుల్ ధన్యాత్ములే యుద్ధవా! 62

తే. పాండుభూమీశ్వరుండు సంప్రాప్తమరణుఁ-డైన శిశువులఁ బ్రోచుటకై నిజేశుఁ
గూడి చనకున్న యట్టి యాకుంతిభోజ-తనయ జీవించునే నేఁడు మనుచరిత్ర!''63

వ. అని వెండియు, 64

మ. ''అనుజాతుం డగు పాండుభూవిభుఁడు నిర్యాణంబునం బొంద, నా
తని పుత్త్రుల్ దనుఁ జేరవచ్చినను మాధ్యస్థ్యంబుఁ బోఁదట్టి యె
గ్గొనరించెన్ ధృతరాష్ట్రభూమివిభుఁ; డట్లూహింపఁగా నెగ్గు సే
సినవాఁడే యగుఁ గాక! మేలు గలదే చింతింపఁగా నుద్ధవా! 65

క. అనుజుఁడు వీఁ డనక యు, తన-తనయులు నను వెడల నడువఁ దా నూరకయుం
డిన ధృతరాష్ట్రుఁడు నరకం-బునఁ బడు నాఁడైన దుఃఖమున ననఘాత్మా! 66

వ. అదియునుం గాక 'పరమశాంతుండ వైన నీమనంబున దుఃఖంబు గర్తవ్యంబు
గా' దంటేని, 67

క. నరలోక[1]విడంబనమున – హరి పరమపరుండు మానవాకృతితో ని
ద్ధరఁ బుట్టి యాత్మమాయా-స్ఫురణన్ మోహింపఁజేయు భూజనకోటిన్. 68

ఉ. కావున నమ్మహాత్ముని, వికారవిదూరుని, సర్వమోహమా
యావిలమానసుండ నగునప్పుడు [2]సంసృతి దుఃఖ నొందు; ని
ద్దేవుని సత్కృపామహిమఁ దెలిసవేళ సుఖింతు; నేన కా
దావిధిశంకరప్రభృతు లవ్విభుమాయఁ దరింప నేర్తురే? 69

వ. అయిన నమ్మహాత్ముని కరుణాతరంగితాపాంగపరిలబ్ధవిజ్ఞానదీపాంకురనిరస్త సమస్త
దోషాంధకారుండ నగుటం జేసి మదీయచిత్తంబు హరిపరాయత్తం బయినకార
ణంబునను దత్త్వంబు సతతంబు నిరీక్షించుచు నుండుదు; మఱియును, 70

సీ. అట్టిసరోజాక్షుఁ డాత్మీయపదభక్తు లడవుల నిడుమలఁ గుడుచుచుండ,
దౌత్యంబు సేయఁ గొండఱు విరోధులు హరి బద్ధునిఁ జేయ సన్నద్ధులైన,

1. విడంబనము = అనుకరణము. 2. సంసృతి = సంసారము.

బలహీనుమాడ్కి మార్పడలేఁడ? యసమర్థుఁ డని తలంచెదవేని నచ్యుతుఁడు
పరుల జయింప నోపక కాదు; విద్యాభిజాత్యధనంబుల జగతిఁ బెక్కు
తే. బాధల నలంచు దుష్టభూపతుల నెల్ల-సైన్యయుక్తంబుగా నని సంహరించు
కొఱకు సభలోన నప్పాండుకుమారు-లాడుదుర్భాషణములకునలుగఁడయ్యె.

మ. జననం బందుట లేని యీశ్వరుఁడు దా జన్మించుటెల్లన్ విరో
ధినిరాసార్థము; వీతకర్ముఁ డగు నద్దేవుండు గర్మప్రవ
ర్తనుఁ డౌటెల్లఁ జరాచరప్రకటభూతశ్రేణులం గర్మవ
ర్తనులం జేయఁ దలంచి కాక, కలవే దైత్యారికిం గర్మముల్? 72

క. హరి నరులకెల్లఁ బూజ్యుఁడు,-హరి లీలామనుజుఁడును, గుణాతీతుఁడునై
పరఁగిన భవకర్మంబులఁ-బొరయం డఁట; హరికిఁ గర్మములు లీల లగున్. 73

క. మదిఁ దనశాసన మిడి, నిజ-పదములు సేవించు లోకపాలాదులఁ బెం
పొదవింప యదుకులంబున-నుదయించెను భువిని బలసహోదరుఁ డగుచున్. 74

తే. చలన మందక, భూరిసంసరణతరణ-మైన సత్కీర్తి దిక్కుల నతిశయిల్లి, [యును.
పఱల, సమమతియై యున్నవాఁడె కృష్ణుఁ"-డనుచు విదురుఁడయ్యుద్ధవు నడుగుట

వ. అట్టియెడ నయ్యుద్ధవుండు, 76

క. యదుకులనిధి యగు కృష్ణుని-పదజలజవియోగతాపభరమున మాటల్ [డెన్."
[1]ప్రిదులక, హృదయం బెరియఁగఁ,-బెదవులు దడుపుచును వగలఁ బెంపఱియుం

క. అని చెప్పి బాదరాయణి-మనుజేంద్రుని [2]వలను సూచి మఱి యిట్లనియెన్:
"విను మొకనాఁ డీయుద్ధవుఁ-డనయము నైదేండ్లబాలుఁడై యున్నతఱిన్. 78

వ. మున్ను కృష్ణునిం గూడి యాడు బాలకులలో నొక్కబాలునిఁ గృష్ణునింగా
భావించి పరిచర్య సేయుచుండ, గుణవతీమతల్లి యగు తల్లి సనుదెంచి, 'యాఁ
కొంటి, విది యేల రావన్న' యని పిలిచిన, జననీవాక్యంబులు గైకొనక,
యఖండతేజోనిధి యైన పుండరీకాక్షు పాదారవిందమకరందసేవానురక్తిం జేసి
యున్న యుద్ధవుండు నేఁడు కృష్ణవియోగతాపంబున హరివార్త విదురునకుఁ
జెప్పంజాలక యొప్పుఱియుండుట యేమిచిత్రం" బని, వెండియు నిట్లనియె:
"నంత నుద్ధవుండు సరోజాక్షపాదారవిందమకరందసుధాజలనిధినిమగ్నమాన
సుండై, సముత్కంఠం జింతించి, యొక్కముహూర్తమాత్రంబునకు బాష్పజల
పూరితలోచనుం డై, గద్గదకంఠుం డగుచు, 79

క. ఘనముగ నెమ్మనమున మిం-చిన కృష్ణవియోగజనితశిఖి దరికొనఁగాఁ,
గనుఁగవఁ [3]బెడచే నొత్తుచుఁ,-జెనుపొందిన దురితశిఖరిభిదురున్ విదురున్. 80

---

1. ప్రిదులు = వెడలు, వెలువడు. 2. వలను = వైపు, దిక్కు. 3. పెడచేయి = మీఁజెయ్యి.

వ. కనుంగొని, యి ట్లనియె: 81

క. "యముఁ డను ఘనకాలభుజం-గమపుంగవుఁ [1]డెగచి పట్టఁగా, యదువంశో
త్తముల చరిత్రలుఁ, దత్కౌ-శలము లేమని చెప్పుదుం; గలంగెడి మనమున్. 82

సీ. మునిజనముఖపద్మములు ముకుళింపంగ, ఖలజనలోచనోత్పలము లలర,
జారచోరుల కోర్కి సఫలత నొందంగ, దానవదర్పాంధతమస మడర,
వరయోగిజనచక్రవాకంబు లడలంగఁ, గలుషజనానురాగంబు పర్వ,
భూరిదోషాగమస్ఫూర్తి వాటిల్లంగ, నుదితధర్మక్రియ లుడిగి మడఁగ,
తే. మానుషాకారరుచికోటి మందపఱిచి-యనఘ! యేమన నేర్తుఁ, గృష్ణాభిధాన
లోకబాంధవుఁ, డుత్తమశ్లోకమూర్తి-మించు తేజంబుతో నస్తమించె నయ్య! 83

వ. మఱియును, 84

క. హల కులిశ జలజరేఖా-లలితశ్రీకృష్ణపాదలక్షిత యై ని
ర్మలగతి నొప్పెడు ధరణీ-లలనామణి నేఁ డభాగ్యలక్షణ యయ్యెన్. 85

క. యాదవులవలన రాజ్య-శ్రీ దొలఁగెను; ధర్మగతి నశించెను; భువి మ
ర్యాదలు దప్పె నధర్మో-త్పాదనమున దైత్యభేది దప్పినపిదపన్. 86

వ. మఱియు లలితనికషణవిరాజమానమణిగణకిరణ[2]సుషమా విశేషవిడంబితవిమల సలిలంబులందుఁ బ్రతిఫలితసంపూర్ణచంద్రమండలరుచి నిరీక్షించి, జలచరబుద్ధిం జేసి తజ్జలవిలోలమీనంబు లనూనస్నేహంబునం దలంచుచందంబునఁ గృష్ణానుచరు లైన యదువృష్ణికుమారు లమ్మహనీయమూర్తిం దమకు నగ్రేసరుం డని కాని లీలామానుషవిగ్రహుం డైన పరమాత్ముం డని యెఱుంగక, హరిమాయాజనితం బగు నసద్భావంబునం జేసి భోజనశయనాసనానుగమనంబులం జేరి, సహోదరాదిభావంబులం గూడి చరియింతు; రద్దేవుని మాయాపయోనిధినిమగ్నులు గాకుండ నబ్జభవాదులకైనం దీఱదు; సర్వగుణగరిష్ఠులును, సత్పురుషశ్రేష్ఠులును నగు పరమభాగవతులకుం దక్కఁ దక్కినవారలకుం జెప్ప నేల? యదియునుంగాక యభిజనవిద్యాధనబలగర్వమదాంధీభూతచేతస్కు లైన శిశుపాలాదిభూపాలకు లమ్మహాత్మునిం బరతత్త్వంబని యెఱుంగక నిందించు దుర్భాషలు దలంచి మనస్తాపంబు నొందుచుండుదు:" నని వెండియు, 87

మ. "అవితృప్తేక్షణధీసమాహితతపోవ్యాసంగు లైనట్టి భా
గవతశ్రేష్ఠుల కాత్మమూర్తి నిఖిలైకజ్యోతిమైఁ జూపి, శో
కవిశోకంబులు నిర్దహించి, కమలాకాంతుండు, శాంతుండు మా
నవరూపం బగు దేహమున్ వదలి, యంతర్ధానుఁ డయ్యెం జుమీ! 88

---

1. ఎగచిపట్టు = తఱిమిపట్టు. 2. సుషమ = శోభ, కాంతి.

సీ. మానవై కవిశ్వాసమానమై, తనకును విస్మయజనకమై వెలయునట్టి
యాత్మీయయోగమాయాశక్తిఁ జేపట్టి చూపుచు నత్యంతసుభగ మగుచు,
భూషణంబులకును భూషణంబై వివేకములకెల్లను బరాకాష్ఠ యగుచు,
సకలకల్యాణసంస్థానమై, సత్యమై, తేజరిల్లెడునట్టి దివ్యమూర్తి
తే. తాన తనమూర్తి నిజశక్తిఁ దగ ధరించి,-యమతనూభవు రాజసూయాధ్వరంబు
నందు నెవ్వని శుభమూర్తి నర్థితోడ - నిండువేడుకఁ జూచి వర్ణించుచుండ్రు. 89

క. ప్రకటముగఁ గమలభవసృ-ష్టికిఁ గారణ మిమ్మహాత్ముఁడే యనుచును ను
త్సుకులై తన్మూర్తినిఁ ద-ప్పక చూచిరి గాదె తత్సభాజను లెల్లన్? 90

వ. మఱియు శాంతోగ్రరూపధరుం డైన సర్వేశ్వరుండు శాంతరూపుండు గావునఁ
బరకృతాపరాధనిపీడ్యమానమానసుండయ్యు ననుకంపాయత్తచిత్తుండై వర్తించు;
పరాపరుండును, బ్రకృతికార్యంబైన మహత్తత్త్వరూపుండును, జననవిరహితుం
డయ్యును దారువులవలన ననలంబు దోఁచుచందంబున జననంబునొందుచుండు ;
నట్టి సరోజనాభుని హాస రాస లీలానురాగ విలోకనప్రతిలబ్ధమానస లైన గోప
కామినులు తన్మూర్తిదర్శనానుషక్తమనీషలం గలిగి వర్తించి ; రదియునుం గాక,

చ. దివిజుల కోర్కెఁ దీర్ప వసుదేవుని యింట జనించి, కంసదా
నవుఁడు వధించు నన్భయమునం జని, నందునియింట నుంటకున్,
యవనజరాసుతాదులకు నాజి నెదుర్పడలేక సజ్జన
స్తవ! మధురాపురిన్ విడిచి దాఁగుటకున్ మదిఁ జింతనొందుదున్. 92

వ. అదియునుం గాక, 93

సీ. కడఁగి పెక్కిడుమలఁ గుడుచుచుఁ, జిత్తముల్ గలఁగఁగ, బంధనాగారములను
[1]వనరిన దేవకీవసుదేవులను డాయఁజనుదెంచి, భక్తి వందన మొనర్చి,
"తలిదండ్రులార! యేఁ గలుగంగ మీరలు కంసుచే నలజడిఁ గ్రాఁగుచుండఁ
[2]గడఁగి శత్రునిఁ జంపఁగా లేక సూచుచు నున్న నాతప్పుఁ బ్రసన్ను లగుచుఁ
తే. గావుఁ"డని యానతిచ్చిన దేవదేవు - నద్భుతావహమధురవాక్యములఁ దలఁచి
తలఁచి, నాచిత్తమునఁ బెద్ద గలఁగుచుందుఁ-బృథులపాతకభూమిభృద్భిదుర! విదుర!

క. విమలమతిఁ దలఁప నెవ్వని-బొమముడిమాత్రమున నిఖిలభూదేవీభా
రము వాయు; నట్టి హరిపద-కమలమరందంబుఁ గ్రోలు ఘనుఁ డెవ్వాఁడో? 95

క. మందప్రజ్ఞుఁడనై, గో-విందుని, మురదైత్యహరునిఁ, విష్ణునిఁ, బరమా
నందుని, నందతనూజుని, - మందరధరుఁ జిత్తమందు మఱతునె యెందున్? 96

చ. అదియును గాక మీరు నృపు లందఱుఁ జూడఁగ ధర్మసూతి పెం
పొదవిన రాజసూయసవనోత్సవమందును జన్మమాదిగాఁ

1. వనరు = శోకించు, దుఃఖించు. 2. 'కడిఁది' అని పాఠాంతరము ( = క్రూరుఁడు, కఠినుఁడు).

బడవడి యెగ్గొనర్చు శిశుపాలుఁడు యోగిజనంబు లిట్టి ద
ట్టిదని యెఱుంగనోపని కడిందిపదంబును నొందెనే కదా! 97

చ. కురునృపపాండునందను లకుంఠితకేళిఁ జమూసమేతులై
యరిగి, రణోర్వి నెవ్వని ముఖాంబురుహామృత మాత్మలోచనో
త్కరములఁ గ్రోలి, పార్థవిశిఖప్రకరక్షతపూతగాత్రులై,
గురుతరమోక్షధామమునకుం జని సౌఖ్యము నొందిరో తుదిన్? 98

సీ. అట్టి సరోజాక్షుఁ డాద్యంతశూన్యుండు, సుభగుండు, త్రైలోక్యసుందరుండు,
కమనీయసాగరకన్యకాకుచకుంకుమాంకితవిపులబాహాంతరుండు,
సకలదిక్పాలభాస్వత్కిరీటన్యస్తపద్మరాగారుణపాదపీఠుఁ,
డజుఁ, డనంతుఁడు, సమతాధిక్యవిరహితుం, డిద్ధమూర్తిత్రయాధీశ్వరుండు
తే. నైన హరి యుగ్రసేనుని నఖిలరాజ్య-రుచిరసింహాసనమునఁ గూర్చుండఁ బెట్టి,
భృత్యభావంబు నొంది,సంప్రీతి నతని-పనుపు సేయుట కెపుడునామనముగుందు."

వ. అని వెండియు నిట్లనియె: "ననఘా! పరాత్పరుండును, యోగేశ్వరేశ్వరుండు
నగు కృష్ణుండు భగవద్భక్తుండును, బరమభాగవతోత్తముండు నైన యుగ్ర
సేనుని సేవించుట యాశ్చర్యంబు గాదు; తన్ను హరియింపం దలంచి కుచం
బుల విషంబు ధరియించి, స్తన్యపానంబు సేయించిన దుష్టచేతన యైన పూతన
కుం, జన్నిచ్చి పెంచిన యశోదాదేవికి నైన నందరాని పదంబుఁ గారుణ్యా
యత్తచిత్తుం డై యొసంగె ననిన నిజపదధ్యానపరాయణులగువారల నను
సరించి సేవించుట సెప్ప నేల" యనిన, నుద్ధవునికి విదురుం డిట్లనియె: "భక్త
వత్సలుండును, గారుణ్యజలనిధియు నై, భాగవతజనుల ననుగ్రహించు పుండ
రీకాక్షుండు భాగవతసేవ సేసెంగాక నిజదాసలోకంబున కొసంగు పరమపదంబు
నుగ్రకర్ములైన రాక్షసుల కెట్లొసంగె, నత్తెఱంగెఱింగింపు" మనిన విదురునకు
నుద్ధవుం డిట్లనియె: 100

మ. "దనుజానీక మనేకవారములు దోర్దర్పంబు సంధిల్లఁగా
వినతాసూను భుజాధిరోహుఁ డగు నవ్విష్ణున్, [1]సునాభాస్త్రుఁ, దా
రనిలో మార్కొని, "పోకు పోకు హరి! దైత్యారాతి!" యంచుం దదా
ననముం జూచుచుఁ, గూలి, మోక్షపదము న్ప్రాపింతు రత్యున్నతిన్. 101

క. ధీరజనోత్తమ! నవసిత - సారసలోచనుఁడు కృష్ణుజననంబును, ద
చ్చారిత్రము నెఱిఁగింతు ను - దారత; నీ విపుడు వినుము తద్విధ మెల్లన్.

చ. ధరణిభరంబు వాపుటకుఁ దామరసాసను ప్రార్థనన్ రమా
వరుఁ డల [2]కంసబంధననివాసమునన్ వసుదేవదేవకీ

1. సునాభము = చక్రము, 2 కంసబంధననివాసము = కంసునియొక్క కారాగారము.

వరులకు నుద్భవింప, బలవంతుఁడు గంసుఁడు హింససేయు న
న్వెఱపున నర్ధరాత్రి సుతునిం గొని యవ్వసుదేవుఁ డిమ్ములన్. 103

క. నందుని మందకుఁ జని, త - త్సుందరితల్పమునఁ బరులు సూడక యుండన్
నందనుని నునిచి, [1]యానక - దుందుభి మరలంగ నేఁగెఁ దొల్లిటిపురికిన్. 104

క. హరి యేకాదశసంవ - త్సరములు నందవ్రజమునఁ దను హరి యని యె
వ్వరు నెఱుఁగకుండ నాహల - ధరుతోఁ గ్రీడించుచుండెఁ దద్దయుఁ బ్రీతిన్.

క. గోపాలవరులకై నను - [2]నాపోవఁగఁ దన సమంచితాకార మొగిం
జూపని శ్రీపతి వేడుక - గోపాలురఁ గూడి కాచె గోవత్సములన్. 106

వ. అయ్యవసరంబునం గృష్ణుండు లీలావినోదంబులు దోడి గోపాలబాలురకుం
జూపం దలంచి, 107

చ. వరయమునానదీసలిలవర్ధితసౌరభయుక్తపుష్పమే
దురమకరందపానపరితుష్టమధువ్రతయూథమాధవీ
కురవక కుంద చందన నికుంజములందు మయూర శారికా
పరభృత రాజకీర మృదుభాషలభంగిఁ జెలంగి పల్కుచున్. 108

ఉ. శ్రీరమణీమనోవిభుఁడు సింహకిశోరముఁ బోలి లీలఁ గా
మారదశన్ రమావిమలమందిరముం బురుడించు గోతతిన్
వారక మేపుచుండెఁ దన వంశరవస్ఫుటమాధురీసుధా
సారముచేత గోపజనసంఘములన్ ముదమందఁ జేయుచున్. 109

వ. మఱియును, 110

మ. చిరకేళీరతి బాలకుల్ దృణములన్ సింహాదిరూపంబులం
గర మొప్పన్ విరచించి, వాని మరలన్ ఖండించుచందంబునం
గరుణాతీతులఁ గామరూపు లగు నక్కంసప్రయుక్తక్షపా
చరులం గృష్ణుఁడు సంగరస్థలములం జక్కాడె లీలాగతిన్. 111

చ. వరయమునానదీజలనివాసమహోరగవిస్తృతాస్యవి
స్ఫురితవిషానలప్రభల సోఁకునఁ గ్రాఁగిన గోపగోధనో
త్కరముల నెల్లఁ గాచి, భుజగప్రవరున్ వెడలంగఁ దోలి, త
త్సరిదమలాంబుపానమున సంతస మందఁగఁ జేసె గోతతిన్. 112

మ. దివిజాధీశు గుఱించి వానకొఱకై, దీపింప, నందాది [3]వ
ల్లవు లేఁటేఁట ననూనసంపదల నుల్లాసంబునం జేయు ను

---

1. ఆనకదుందుభి = వసుదేవుఁడు. 2. ఆపోవు = తృప్తిపడు. 3. వల్లవులు = గోపాలురు.

త్సవముం గృష్ణుఁడు మాన్పి, గోపగణముల్ సంప్రీతి నొందన్, శచీ
ధవు గర్వం బడఁపన్ ధనవ్యయముగాఁ దాఁ జేసె గోయాగమున్. 113

చ. హరిహయుఁ డంత రోషవివశావిలమానసుఁడై సరోరుహో
దరు మహిమం బెఱుంగక, మదం బడరంగ, వలాహకాదిభీ
కరఘనపంక్తిఁ బంపిన, నఖండశిలామయభూరివర్షముల్
గురిసె నమానగర్జనల గోకుల మాకుల మంది [1]కుందఁగన్. 114

ఉ. ఆతతి మంద గొందలము నందఁగ, వల్లవులెల్లఁ "గృష్ణ! యీ
చేతను లెల్ల నిట్టిజడిఁ జిందరవందఱ లై కలంగుచుం
గాతరు లైరి; నీవు కృపఁ గావుము, కావు మనాథనాథ! ని
ర్ధూతకళంక! భక్తపరితోషణభూషణ! పాపశోషణా!" 115

మ. అని యిబ్బంగి విపన్ను లై పలుకఁ, గుయ్యాలించి, కృష్ణుండు స
జ్జనవర్ధిష్ణుఁడు గోపగోనివహరక్షాదక్షుఁ డై, దేవతా
జను లగ్గింపఁ, గరాంబుజాతమున సచ్ఛత్త్రంబుగాఁ దాల్చె [2]బో
రన గోవర్ధనశైలముం, దటచరద్రమ్యామరీజాలమున్. 116

వ. వెండియు, 117

సీ. శరదాగమారంభసంపూర్ణపూర్ణిమాచంద్రసాంద్రాతపోజ్జ్వలిత మగుచు,
వెలయుబృందాటవీవీథియం దొకనాఁడు రాసకేళీమహోల్లాసుఁడగుచు
రుచిరసౌభాగ్యతారుణ్యమనోరమస్ఫూర్తిఁ జెన్నొందిన మూర్తి దనర,
సలలితముఖచంద్రచంద్రికల్ గోపికానయనోత్పలముల కానంద మొసఁగ,
తే. భవ్యచాతుర్యభంగిఁ ద్రిభంగి యగుచు - నబ్జనాభుండు సమ్మోద మతిశయిల్ల,
లీలఁ బూరించు వరమురళీనినాద - మర్థి వీతెర విని, మోహితాత్మ లగుచు.

చ. పతులు, మఱందులున్, సుతులు, బావలు, నత్తలు, మామలున్ సము
న్నతి వల దన్న మానక, మనంబునఁ గృష్ణపదాబ్జసేవనా
న్వితరతి గోపకామినులు వే చనుదేర దయాపయోధి శో
భితగతి రాసకేళి సలిపెం దరుణీనవపుష్పచాపుఁ డై. 119

ఉ. రాముఁడుఁ, దానుఁ గూడి, మధురాపురికిం జని, యందు వైభవో
ద్దామనృపాసనంబున మదంబున నున్న దురాత్ముఁ, గంసు, దు
ష్టామరశత్రుఁ ద్రుంచి, ముద మారఁగఁ దల్లిని, దండ్రి నంచిత
శ్రీమహితాత్ము లై తనరఁ జేసె సరోరుహనాభుఁ డున్నతిన్. 120

మ. నలువొప్పంగ షడంగయుక్తమహితామ్నాయంబుఁ, జౌషష్టివి
ద్యలు సాందీపనిచే నెఱింగెఁ జెలువొందన్ విన్నమాత్రంబులో

1. 'మ్రిందఁగన్' అని పాఠాంతరము (మ్రిందు=నొచ్చు, సోలు). 2. బోరన = శీఘ్రముగా.

పలసే; లోకగురుండు దాన; తనకున్ భావింప నన్యుల్ గురు
ల్గలరే? లోకవిడంబనార్థ మగు లీలల్ గావె యస్మేటికిన్? 121

ఉ. మించి, ప్రభాసతీర్థమున మృత్యువశంబునఁ బొంది, పోయి, యా
[1]పంచజనోదరస్థుఁ డగు బాలకు, దేశికునందనుం, బ్రభో
దంచితలీలఁ దెచ్చి గురుదక్షిణగా నతిభక్తియుక్తి న
ర్పించె గురుండు చిత్తమునఁ బెంపెసలార మురారి వెండియున్. 122

సీ. ఘనుఁడు విదర్భేశుఁ డన నొప్పు భీష్మకు వరసుతామణి, నవవారిజాక్షిఁ,
బద్మాసమానరూపశ్రీవిభాసితఁ, గమనీయభూషణఁ, గంబుకంఠిఁ,
జతురస్వయంవరోత్సవసమాగతచైద్యసాల్వమాగధముఖ్యజనవరేణ్య
నికరసమావృతఁ, బ్రకటసచ్చారిత్ర, రుక్మిణి, నసమాన [2]రుక్మకాంతి
తే. నమరగుప్తామృతంబు విహంగవిభుఁడు-గొనినకైవడి మనుజేంద్రకోటిఁ దోలి,
కమలనాభుండు నిజభుజాగర్వ మలరఁ-దెచ్చి వరియించె నతని నుతింప వశమె?

చ. పరువడిఁ బట్టి సప్తవృషభంబుల ముక్కులు గుట్టఁ, దద్బల
స్ఫురణ సహింపఁజాలక నృపుల్ దలపడ్డ, జయించి, నగ్నజి
ద్ధరణిపునందనన్, వికచతామరసాక్షిఁ బ్రమోదియై స్వయం
వరమునఁ బెండ్లియాడె గుణవంతుఁ, డనంతుఁ, డనంతశక్తితోన్. 124

మ. ప్రతివీరక్షయకారి నాఁ బరఁగి, సత్రాజిత్తనూజాహృదీ
ప్సితముం దీర్పఁ దలంచి, నాకమునకుం బెంపారఁగా నేఁగి, వ
ర్ణితశౌర్యోన్నతిఁ బారిజాత మిలకున్ లీలాగతిం దెచ్చె ను
ద్ధతి దేవేంద్రు జయించి; కృష్ణుఁ డన నేతన్మాత్రుఁడే చూడఁగన్? 125

సీ. మానితాఖిలజగన్మయదేహమునఁ బొల్చు ధరణిదేవికిఁ బ్రియతనయుఁ డైన
నరకదానవుని సునాభాఖ్యఁ జెన్నొందు ఘనచక్రధారావిఖండితోత్త
మాంగునిఁ జేయ, నయ్యవనీలలామంబు వేఁడినఁ దత్పుత్త్రు విపులరాజ్య
పదమున నిల్పి, లోపలిమందిరంబులఁ జిరముగ నరకుండు సెఱలఁ బెట్టి
తే. నట్టి కన్యలు నూఱుఁ బదాఱువేలు-నార్తబాంధవుఁ డైన పద్మాక్షుఁ జూచి,
హర్షబాష్పంబు ధారాప్రవర్ష మొదవఁ-బంచశరబాణనిర్భిన్నభావ లగుచు. 126

చ. లలితతదీయసుందరవిలాసవిమోహిత లైన, వారి నిం
పొలసిన కోర్కిఁ దీర్చుటకు నొక్కముహూర్తమునన్ వరించి, క
న్యల లలితావరోధభవనంబుల నందఱ కన్నిరూపు లై
కలసి, సుఖస్థితిం దనిపెఁ గాంతల, భక్తినితాంతచిత్తలన్. 127

1. పంచజనుఁడు = ఈ పేరుగల ఒక రాక్షసుఁడు. 2. రుక్మము = బంగారు.

క. చతురతతో నం దొక్కొక-యతివకుఁ బదురేసి సుతుల, నాత్మసముల, ను
న్నతభుజశక్తులఁ గాంచెను-వితతంబై కీర్తి దిశల వినుతికి నెక్కన్. 128

సీ. మధురాపురముఁ జతుర్విధబలౌఘములతో నావరించిన కాలయవన సాల్వ
మగధభూపాలాదిమనుజేంద్రలోకంబు సైన్యయుక్తముగాఁగ సంహరించి,
తన బాహుశక్తిఁ జిత్తముల నర్థించిన భీమపార్థులకు నుద్దామవిజయ
మొసఁగి, తద్వైరుల నుక్కడంగఁగఁ ద్రుంచి, బాణ శంబర ముర పల్వలాది

తే. దనుజనాయకసేనావితానములను-హలధరాదిసమేతుఁడై హతులఁ జేసె;
దంతవక్త్రాదిదైత్యులు దన్ను [1]నెదుర-భండనములోనఁ ద్రుంచె దోర్బలము మెఱసి.

వ. వెండియుం గృష్ణుండు కౌరవపాండవభండనంబునకుం దోడ్పడి, రాజన్యు లన్యోన్యమాత్సర్యోత్సాహసమేతులై, సైనికపాదఘట్టనంబుల ధరాచక్రంబు గంపింప, ననన్యసామాన్యంబు లయిన శంఖభేరీప్రముఖతూర్యఘోషంబులు నింగి మ్రింగఁ, దురంగమరింఖాసముద్ధూతధూళిపటలపరిచ్ఛన్నభానుమండలంబునుంగాఁ జనుదెంచి, కురుక్షేత్రంబున [2]మోహరించిన, నుభయపక్షబలంబులం దునుమాడి నిఖిలరాజ్యవైభవమదోన్మత్తుం డయిన సుయోధనుండు నిఖిలరాజసమక్షంబునఁ గర్ణ శకుని దుశ్శాసనాదుల దుర్మంత్రంబున నిరంతరంబుఁ గుంతీనందనుల కెగ్గు సేసిన దోషంబునం జేసి సంగరరంగంబున భీమగదాఘాతంబునం దొడలు విఱిగి, పుడమిం బడి, గతాయుశ్శ్రీవిభవుండై యుండఁ జూచినం గదా పరితుష్టచిత్తుండ నగుదు నని యపరిమితబాహుబలోత్సాహులైన భీష్మ ద్రోణ భీమార్జునులచేత నఖిలధరాధిపతుల నష్టాదశాక్షౌహిణీబలంబులతోడం దునిమించి, మఱియు స్వసమానబలు లయిన యదువీరుల జయింప నెంతవారలకైనం దీఱదు; మధుపానమదవిఘూర్ణితతామ్రవిలోచనులై ప్రవర్తించు యాదవుల కన్యోన్యవైరంబులు గల్పించి పోరించి, యితరేతరకరాఘాతంబుల హతులై తన్నుఁ గలసినంగాని భూభారం బుడుగ దని చిత్తంబునం దలంచి, యంత ధర్మనందనుచే నిస్సపత్నం బగు రాజ్యంబు పూజ్యంబుగాఁ జేయించుచు, మర్త్యులకుం గర్తవ్యంబులైన ధర్మపథంబులు సూపుచు, బంధుమిత్త్రులకెల్లఁ బరితోషంబు నొందించుచుం, దత్పరోక్షంబున వారి వంశం బుద్ధరింపం దలంచి, యభిమన్యువలన నుత్తరయందు గర్భంబు నిలిపి, గురుతనయప్రయుక్తమహితబ్రహ్మాస్త్రపాతంబునం దద్గర్భదళనంబుగాకుండ నర్భకుని రక్షించి, నిజపదారవిందసేవారతుం డైన ధర్మసుతుచేఁ గీర్తిప్రతాపంబులు నివ్వటిల్లం దురంగమేధంబులు మూఁడు సేయించి, వెండియు,

సీ. వలనొప్ప లౌకికవైదికమార్గముల్ నడపుచు ద్వారకానగరమందు
నవిదితాత్మీయమాయాప్రభావమున నిస్సంగుఁడై యుండి, సంసారిపగిదిఁ

1. ఎదుర = ఎదుర్కొను, ఎదిరించు. 2. మోహరించు = వ్యూహముపన్ను.

జెంది, కామంబులచేత విమోహితుండై సుఖించుచు, ముదితాత్ముం డగుచు
నంచితస్నిగ్ధస్మితావలోకముల, సుధాపరిపూర్ణ సల్లాపములను,
తే. శ్రీనికేతన మైన శరీరమునను - బాండునందనయదుకులప్రకరములను
లీలఁ గారుణ్యమొలయఁ బాలించుచుండె-నార్తరక్షాచణుండు నారాయణుండు,

సీ. సంపూర్ణపూర్ణిమాచంద్రచంద్రిక నొప్పు రమణీయశారదరాత్రులందు,
సలలితకాంచనస్తంభసౌధోపరిచంద్రకాంతోపలస్థలములందు,
మహితకరేణుకామధ్యదిగ్గజముల గతిని, సౌదామినీలతల నడిమి
నీలమేఘంబులలీల, ముక్తాఫలలలితమధ్యస్థనీలములభాతి
తే. సతతయౌవనసుందరీయుతవిహారుఁ-డగుచు, సతులెంద, ఱందఱ కన్నిరూప
ములను గ్రీడించెఁ బెక్కబ్దములు సెలంగి-నందనందనుఁ డభినవానందలీల. 132

వ. అంత నొక్కనాఁడు. 133

చ. మునివరు లేఁగుదేర, యదుభోజవరేణ్యులు గూడి ముట్టఁ బ
ల్కినఁ, [1]గన లొంది, వారు దమకించి శపించినఁ, గొన్నిమాసముల్
సనునెడ, దైవయోగమున జాతరఁ బో సమకట్టి, వేడుకల్
మనములఁ దొంగలింప, గరిమన్ నిజయానము లెక్కి యాదవుల్. 134

ఉ. కోరి ప్రభాసతీర్థమునకుం జని, తన్నదిఁ గ్రుంకి, నిర్మలో
దారత నందు దేవమునితర్పణముల్, పితృతర్పణంబులున్
వారనిభక్తిఁ జేసి, నవవత్సలతోఁ బొలుపారు గోవులన్
భూరిసదక్షిణాకముగ భూసురకోటికి నిచ్చె వెండియున్. 135

క. అజిన పట రత్నకంబళ-రజత [2]మహారజత తిల ధరా వరకన్యా
గజ తురగ రథములను స-ద్ద్విజకోటికి నిచ్చెఁ బెంపు దీపింపంగన్. 136

వ. ఇట్లు సఫలంబులయిన భూదానంబు మొదలుగాఁ గల దానంబు [3]లనూనంబులుగా
భగవదర్పణబుద్ధిం జేసి, యనంతరంబ. 137

తే. ఎసఁగు మోదంబు సంధిల్ల, నిష్ట మైన-రసికమృదులాన్న మర్థిఁ బారణలు సేసి,
మంజులాసవరసపానమత్తు లగుచుఁ-గడఁగి యన్యోన్యహాస్యవాక్యములఁ గలఁగి.

వ. ఇట్లు దమలోన మదిరాపానమదవిఘూర్ణితతామ్రలోచనులయి, మత్సరంబుల
నొండొరులం బొడిచి, సమస్తయాదవులును వేణుజాతానలంబునఁ దద్వంశపరం
పరలు దహనంబు నొందుచందంబునం బొలిసి; రది యంతయుం గనుంగొని,
శ్రీకృష్ణుం డప్పుడు. 139

1. కనలు=కోపము, మంట. 2. మహారజతము=బంగారు. 3. అనూనములుగా=వెలితిలేకుండ.

క. చతురతతో నిజమాయా - గతిఁ జూచి, లసద్విలోలకల్లోలసమం
చితవిమలకమలసార - స్వతజలముల విహితవిధులు సలిపినవాఁ డై. 140

క. ఒక వృక్షమూలతలమున - నకలంకగుణాభిరాముఁ డాసీనుం డై,
యకుటిలమతి బదరీవని-కిఁక నీ వరుగు మని [1]మొఱఁగి యేఁగిన నేనున్. 141

క. క్రమమున నిజకులసంహా - రము సేయఁ గడంగు టెఱిఁగి, రమణీయశ్రీ
రమణు చరణాబ్జయుగవిర - హమునకు మది నోర్వలేక, యనుగమనుఁడ నై.

క. హరి నరయుచుఁ జని చని, యొక-తరుమూలతలంబునందుఁ దన దేహరుచుల్
పరఁగఁగ నున్న మహాత్మునిఁ,-బరునిఁ, బ్రపన్నార్తిహరుని, భక్తవిధేయున్.

వ. మఱియును. 144

సీ. అస్మత్ప్రియస్వామి, నచ్యుతుఁ, బరు, సత్త్వగుణగరిష్ఠుని, రజోగుణవిహీను,
సురుచిరద్వారకాపురసమాశ్రయు, ననాశ్రయు, నీలనీరదశ్యామవర్ణు,
దళదరవిందసుందరపత్త్రనేత్రు, లక్ష్మీయుతుఁ, బీతకౌశేయవాసు,
విలసితవామాంకవిన్యస్తదక్షిణచరణారవిందు, శశ్వత్ప్రకాశు,
తే. ఘనచతుర్బాహు,సుందరాకారు,ధీరుఁ,-జెన్ను గల లేఁతరావిపై వెన్ను మోపి
యున్నవీరాసనాసీను, నన్నుఁ గన్న-తండ్రి, నానందపరిపూర్ణు, దనుజహరుని.

మత్తకోకిలము. కంటిఁ గంటి భవాబ్ధి దాఁటఁగఁ; గంటి నాశ్రితరక్షకుం;
గంటి యోగిజనంబు డెందముఁ; గంటిఁ జుట్టముఁ; గంటి ము
క్కంటికిం గనరాని [2]యెక్కటిఁ; గంటిఁ దామరకంటిఁ; జే
కొంటి ముక్తివిధానముం; దలకొంటి సౌఖ్యము లందఁగన్. 146

వ. అయ్యవసరంబునం బరమభాగవతోత్తముండును, మునిజనసత్తముండును, ద్వై
పాయనసఖుండును, బరమతపోధనుండును, నఘశూన్యుండును, నఖిలజన
మాన్యుండును, బుధజనవిధేయుండును నగు మైత్రేయుండు దీర్ఘాచరణంబు
సేయుచుం, జనిచని. 147

మ. కనియెం దాపసపుంగవుం డఖిలలోకఖ్యాతవర్ధిష్ణు, శో
భనభాస్వత్పరిపూర్ణయౌవనకళాభ్రాజిష్ణు, యోగీంద్రహృ
ద్వనజాతైకచరిష్ణుఁ, గౌస్తుభముఖోద్యద్భూషణాలంకరి
ష్ణు, నిలింపాహితజిష్ణు, విష్ణుఁ, బ్రభవిష్ణుం, గృష్ణు, రోచిష్ణునిన్. 148

క. తదనంతరంబ హరిఁ దన-హృదయాబ్జమునందు ముకుళితేక్షణముల స
మ్మదమునఁ జూచుచు, నానత-వదనుండై యుండె ముదము వఱలఁగ ననఘా!

1. మొఱఁగు=వంచించు, మోసగించు, 2. ఎక్కటి=అసహాయ శూరుఁడు.

వ. అంత దగ్గఱ నేతెంచియున్న మైత్రేయుండు వినుచు !నుండ దరహాసచంద్రికా సుందరవదనారవిందుండును, నానందసుధానిష్యందకందళితహృదయుండును, భక్తానురక్తదయాసక్తవిలోకనుండును నగు పుండరీకాక్షుండు నన్ను నిరీక్షించి యిట్లని యానతిచ్చెఁ: "బూర్వభవంబున వసుబ్రహ్మలు సేయు సత్త్రయాగంబున వసువై, భవదీయహృదయంబున నితరపదార్థంబులు గోరక మదీయపాదారవింద సేవం గాంక్షించితివి గావునం దన్నిమిత్తంబున నేను నీ హృదయంబున వసియించి సమస్తంబును గనుచుండుదు; నాత్మారాముండ నైన నన్ను నెవ్వరేని సదసద్వివేకులై యెఱుంగంజాలరు; వారలకు నేను నగోచరుండ నై యుండుదు; మత్పరిగ్రహంబు[1] గల నీకు నీజన్మంబ కాని పునర్భవంబు నొందకుండుటకు భవదీయపూర్వజన్మకృత సుకృతవిశేషంబుకతంబున నియ్యాశ్రమంబున మత్పాదారవిందసందర్శనంబు గలిగె; నదియునుం గాక పద్మకల్పంబునందు మన్నాభిపద్మమధ్యనిషణ్ణుండయిన పద్మసంభవునకు జన్మమరణాదిసంసృతినివర్తకంబును, నవిరతానశ్వరసౌఖ్యప్రవర్తకంబును నగు మన్మహత్త్వంబుఁ దెలియఁ జేయు నద్దివ్యజ్ఞానంబు నీకు నెఱింగింతు"నని యమ్మహనీయతేజోనిధి యానతిచ్చిన, సుధాసమానసరసాలాపంబులు కర్ణకలాపంబులై మనస్తాపంబులం బాపిన, రోమాంచకంచుకితశరీరుండను, నానందబాష్పధారాసిక్తకపోలుండను, బరితోష సాగరాంతర్నిమగ్నమానసుండను నయి యంజలిపుటంబు నిటలతటంబున ఘటియించి, యిట్లంటి : 150

క. "పురుషోత్తమ! నీపదసర-సిరుహధ్యానామృతాభిషేకస్ఫురణం
గర మొప్పిన నాచిత్త మి-తరవస్తువులందు వాంఛఁ దగులునె యెందున్? 151

చ. జననము లేని నీవు భవసంగతి నొందుట కేమికారణం
బనియును, గాలసంహారుఁడ వై జగముల్ వెలయించు నీవు పా
యని రిపుభీతికై సరిదుదంచితదుర్గము నాశ్రయించు టె
ట్లనియును దేవ! నామనమునందుఁ దలంతు సరోజలోచనా! 152

వ. అదియునుం గాక. 153

క. శ్రీరమణీశ్వర! నీ వా-త్మారాముఁడవయ్యు లీలఁ దరుణీకోటిం
గోరి రమించితి వనియును-వారక యేఁ దలఁతు భక్తవత్సల! కృష్ణా! 154

క. పరతత్త్వజ్ఞులు కరుణా-కర! నిను సంసారి వనుచుఁ [2]గడఁకఁ దలంపన్,
అరసి ననుఁ గాచు టెల్లను-గర ముదు తలంచి చూడఁ గమలాధీశా! 155

వ. దేవా! నీ వఖండితవిజ్ఞానరూపాంతఃకరణుండ వయ్యును ముగ్ధభావంబునఁ బ్రమత్తునిచందంబున, విమోహికై వడిం బ్రవర్తించుచు నెందేని నొదిఁగి యుండుటం దలంచి నా డెందంబు గుందుచుండు; నరవిందలోచన! సురవందిత!

1. పరిగ్రహము = ఆశ్రయము, అండ. 2. కడఁక = పూనిక.

ముకుంద! యిందిరాసుందరీరమణ! సరస్వతీరమణునకుం గరుణించిన సుజ్ఞానంబు ధరించు శక్తి నాకుం గలదే? నీ కృపసేయుము; భవదీయశాసనంబు ధరియించి, భూరిసంసారపారావారోత్తరణంబు సేయుదు'' నని విన్నవించి, బహుభంగులం బ్రస్తుతించిన, భగవంతుండును, బ్రసన్నపారిజాతంబును నైన కృష్ణుండు పరతత్త్వనిర్ణయంబు నెఱింగించిన. 156

క. సరసిజలోచనకరుణా - పరిలబ్ధజ్ఞానకలితభావుఁడ నగుటం
బరతత్త్వవేది నై, త - చ్చరణసరోజముల కెఱఁగి సమ్మతితోడన్. 157

క. హరిపదజలరుహవిరహా - తురతన్ దుర్దాంతదుఃఖతోయధిఁ గడవన్
వెర వేది తిరుగవలసెను-సరసిజభవకల్పవిలయసమయము దాఁకన్. 158

వ. ఇట్లు దిరుగుచు. 159

మ. నరనారాయణతాపసాశ్రమపదానన్త్యంబునం బొల్చు భా
సుర మందార [1]రసాల సాల వకు ళాశో కామ్ల పున్నాగ కే
సర జంబీర [2]కదంబ నింబ కుట జాశ్వత్థ స్ఫురన్మల్లికా
[3]కరవీరక్షితిజాభిరామ బదరీకాంతార సేవారతిన్. 160

క. చన్నుచున్న వాఁడ'' నని ప - ల్కిన పలుకుల కులికి, కళవళించుచు, విదురుం
డనుపమశోకార్ణవమున-మునిఁగియు నిజయోగసత్త్వమునఁ దరియించెన్. 161

వ. ఇట్లు విదురుండు శోకపావకునిం దన వివేకజలంబుల నార్చి, యుద్ధవున కిట్లనియె:

మ. "అనఘా! యుద్ధవ! నీకుఁ గృష్ణుఁ, డసురేంద్రారాతి మన్నించి చె
ప్పిన యధ్యాత్మరహస్యతత్త్వవిమలాభిజ్ఞానసారంబు బో
రన నన్నుం గరుణించి చెప్పినఁ గృతార్థత్వంబునం బొందెదన్;
విను, పుణ్యాత్ములు శిష్యసంఘముల నుర్విం బ్రోవరే వేండియున్? 163

క. భగవద్భక్తులు సుజనులు - దగ వెఱిఁగి పరోపకారతాత్పర్యవివే
కగరిష్ఠులై చరింతురు - జగతిం బొగ డొంది వృష్ణిసత్తమ! యెందున్.'' 164

క. అనవుడు నుద్ధవుఁ డవ్విదు - రున కిట్లను: "నసఘ! మునివరుఁడు సాత్త్వా
ష్ణునిభుం డగు మైత్రేయుఁడు - దనవున నమ్మనుజగతి వదలఁ దలఁచి తగన్. 165

క. హరి, మురభేదిఁ, బరాపరుఁ,-గరుణాకరుఁ దలఁచునట్టి ఘనుఁ, డమ్మునికుం
జరుకడ కేఁగిన నాతఁడు-గర మర్థిం దెలుపు సాత్త్వికజ్ఞానంబున్.'' 166

వ. అని యుద్ధవుండు విదురుం గూడి చని చని. 167

ఉ. ముందటఁ గాంచె నంత బుధముఖ్యుఁడు హల్లకఫుల్లపద్మని
ష్యందమరందపానవిలసన్మదభృంగఁ, జలత్తరంగ, మా

---

1. రసాలము=మామిడి. 2. కదంబము=కడిమిచెట్టు. 3. కరవీరము=గన్నేరు.

కంధ ళవంగ లుంగ లతికాచయసంగ, సురాంగనాశ్రితా
నందితపుణ్యసంగ, యమునన్, భవభంగ, శుభాంగ నర్మిలిన్. 168

క. కని, హాయ నేఁగి, మోదం - బునఁ దత్సరిదమలపులినభూములఁ దగ నా
దిన శేషము నివసించెను - వనజోదర పాదపద్మవశమానసుఁ డై. 169

క. మఱునాఁడు రేపకడ భా - సురపుణ్యుఁడు, ఘనుఁడు, మధునిషూదనచరణ
స్మరణాక్రీడాకలితుఁడు - దరియించెం గలుష[1]గహనదహనన్, యమునన్. 170

వ. ఇట్లుద్ధవుండు యమునానది నుత్తరించి, బదరికాశ్రమంబునకుం జనియె'' ననిన
విని రాజేంద్రుండు యోగీంద్రున కిట్లనియె : 171

క. ''శౌరియు నతిరథవరులు మ - హారథసమరథులు యదుబలాధిపు లెల్లం
బోరి మృతిఁ బొంద నుద్ధవుఁ - డేరీతిఁ బ్రదికె? నాకు నెఱిఁగింపు తగన్.'' 172

సీ. నావుడు రాజేంద్రునకు శుకయోగీంద్రుఁ డిట్లను: ''మున్ను లోకేశుచేత
సంప్రార్థితుం డైన జలరుహనాభుండు వసుమతిపై యదువంశమందు
నుదయించి, తనుఁ దాన మదిలోనఁ జింతించి, తెలివొంది, యాత్మీయకులవినాశ
మొనరించి, తాను బంచోపనిషన్మయ మగు దివ్యదేహంబునందుఁ జెందఁ

తే. దలఁచి, విజ్ఞానతత్త్వంబు ధరణిమీఁదఁ-దాల్చి జనకోటి కెఱిఁగింపఁ దగినధీరుఁ
డుద్ధవుఁడుదక్క నితరు లేనోప; రితఁడు-నిర్జితేంద్రియుఁ డాత్మసన్నిభుఁ డటంచు.

క. క్షితిపై నిలిపినకతమున - నతనికి మృతి దొరక దయ్యె నవనీశ! రమా
పతియభిమానము గలిగిన - యతిపుణ్యుఁడు సనియె బదరికాశ్రమమునకున్.

వ. అంత. 175

క. ఉద్ధవుఁ డరిగినపిదప స-మిద్ధపరిజ్ఞాను, సుజనహితు, మైత్రేయున్,
వృద్ధజనసేవ్యుఁ, దాపస-వృద్ధశ్రవుఁ జూడఁగోరి విదురుఁడు గడఁకన్. 176

వ. యమునానది దాఁటి, కతిపయప్రయాణంబులఁ బుణ్యనదుల, హరిక్షేత్రంబుల
దర్శించుచు, నతిత్వరితగమనంబున. 177

క. చని చని, ముందటఁ గనుఁగొనె-ఘనపాపతమఃపతంగఁ, గరుణాపాంగం,
గనదుత్తుంగతరంగన్,-జనవరనుతబహుళపుణ్యసంగన్, గంగన్. 178

క. అందు నరవిందసౌరభ-నందితషట్పదమానధూతనటదూర్మిపరి
స్పందితకందళశీకర-సందోహాళసత్ప్రవాహజలమజ్జనుఁ డై. 179

సీ. ఘనసారరుచివాలుకాసముదంచితస్సైకతవేదికాస్థలమునందు
యమనియమాదియోగాంగక్రియానిష్ఠఁ బూని, పద్మాసనాసీనుఁ డగుచు,

1. 'గహనదమనన్' అని పూ. ము. 'దమునన్' అని యుండఁబోలును. అప్పుడే 'యమునన్' పదముతోడి ప్రాసము పరిపుష్టమగును. 'దమునన్' అనఁగా 'అగ్ని' యైనదని యర్థము.

హరిపాదసరసీరుహన్యస్తచిత్తుఁ డై, బాహ్యేంద్రియవ్యాప్తిఁ బాఱఁదోలి,
సకలవిద్వజ్జనస్తవనీయసముచితాచారవ్రతోపవాసములఁ గ్రుస్సి
తే. యున్న పుణ్యాత్ము, విగతవయోవికారు,-వినుతసంచారు, భువనపావనవిహారు,
యోగిజనగేయు, సత్తతిభాగధేయు,-నాశ్రితవిధేయు, మైత్రేయు నచటఁ గాంచె.

### విదురమైత్రేయుల సంవాదము

వ. ఇట్లు గనుంగొని యమ్మునీంద్రుని పాదంబులకుం బ్రణమిల్లి, ముకుళితహస్తుండై యి ట్లనియె: "మునీంద్రా! లోకంబున సకలజనంబులు మనంబుల ఘనంబు లగు సౌఖ్యంబు లందందలంచి, తత్ఫలప్రాప్తిహేతువు లైన కర్మంబు లాచరించి, దైవోపహతు లై, తత్కర్మంబులచేత నిష్ఫలారంభు లగుదురు; కర్మంబులు బంధకంబులును,దుఃఖహేతువులునుంగాని సౌఖ్యదాయకంబు లై పాప[1]నివృత్తిఁ జేయనోప; వది యట్లుండె; భూరిదుఃఖానుసారం బైన సంసారచక్రంబునందుఁ బరిభ్రమించుచుం గామవిమోహితు లై, పూర్వకర్మానుగతంబు లైన శరీరంబులు దాల్చుచుం, జచ్చుచు, మరలం బుట్టుచు, నెంతకాలంబునకుం బాప[1]నివృత్తిఁ గానక, మాతృయౌవనవనకుఠారులై జనియించి వర్తించు మూఢాత్ములం, బశుప్రాయుల రక్షించుకొఱకుఁ గాదె నారాయణపరాయణు లైన మీవంటి పుణ్యాత్ములు లోకంబునం జరియించుట; యదియునుం గాక. 181

మ. అవివేకానుగతస్వకార్యజలవేలాకీర్ణ మై, మిత్రబం
ధువధూపుత్త్రజలగ్రహోగ్రయుత మై, దుర్దాంత మైనట్టి దు
ర్భవపాథోధిఁ దరించువారె హరిసంబంధక్రియాలోలభా
గవతానుగ్రహనావ లేని యధముల్ గారుణ్యసంధాయకా! 182

క. మునినాథచంద్ర! ననుఁ గై-కొని కాచుతలంపు బుద్ధిఁ గూడినయేనిన్
వినుము మదీప్సిత; మది నా-చనవునఁ గావింపవయ్య! సజ్జనతిలకా!" 183

వ. అని వెండియు విదురుండు మైత్రేయుం జూచి, "మునీంద్రా! త్రిగుణాత్మకమాయానియంత యగు భగవంతుండు స్వతంత్రుం డయ్యు, నవతరించి, యేయే యవతారంబుల, నేయేకర్మంబు లాచరించె, నదియు, నిష్క్రియుం డగు నీశుండు మొదలం బ్రపంచంబు నేవిధంబునం గల్పించె, నేపగిదిం బాలించె, మఱియు నీవిశ్వంబు నాత్మీయహృదయాకాశగతముం జేసి నివృత్తవృత్తి యగుచు, యోగమాయయం దెట్లు వసియించె, బ్రహ్మాండంబునందు నేలీల వర్తించె, నందు బ్రహ్మాదిరూపంబులం బొంది బహుప్రకారంబుల నెట్లు క్రీడించె, భూసురగోసురాదులఁ బరిరక్షించుటకై మత్స్యాద్యవతారంబులు ధరియించి యేయే ప్రయోజనంబులం దీర్చెఁ, [2]బయోరుహగర్భాండకటాహాంతర్గతంబు లై లోక

1. 'నిష్కృతి'యని పాఠాంతరము. 2. పయోరుహగర్భాండకటాహము=బ్రహ్మాండ మనెడికప్పెర.

పాలసహితంబు లైన లోకంబులను, లోకాలోకపర్వతంబులను, బహిర్భాగం
బులను, నేయేతత్త్వభేదంబులను నెత్తెఱంగునం బుట్టించె, నందుం బ్రతీతం
బగు జీవకోటి యెవ్వనిం గొల్చి బ్రదుకు, జనులకుం గర్మనామరూపభేదంబు
లెట్లు నిర్దేశించె, నింతయు సవిస్తరంబుగా వివరింపు; ముత్తమశ్లోకమౌళిమండ
నుండును, యోగేశ్వరేశ్వరుండును నైన పుండరీకాక్షుని చరిత్రశ్రవణంబునం
గాని జన్మమరణాదిసకలదుఃఖాకరంబులును, దుష్కర్మప్రాప్తంబులును నగు
భవబంధంబులు దెగ''వని, వెండియు నిట్లనియె : 184

తరలము. ''సతతమున్ సరసీరుహోదరసత్కథామృతపూరమున్
శ్రుతిపుటాంజలిచేత [1]నిమ్ముల జుఱ్ఱియుం దనివోదు భా
రతకథామిష మూని విష్ణుఁ బరాశరప్రియసూతి స
న్మతి నుతించిన చోట సన్మునినాథ! నామది నుబ్బుదున్. 185

క. ఇతరకథావర్ణనముల-నతిహేయత నొందెఁ జిత్త మనఘాత్మ! రమా
పతిచరితామృతరతి సం-సృతివేదన లెల్లఁ బాయఁజేయు మునీంద్రా! 186

తే. భూరివిజ్ఞాననిధు లగు నారదాది-నిర్మలాత్ముల కయిన వర్ణింపరాని
హరికథామృతపానంబునందు విసివి-యొల్లననువాఁడెవో వెఱ్ఱిగొల్లఁ డనఘ! 187

వ. అదియునుం గాక. 188

సీ. అరవిందనాభుని యపరావతారమై జననమందిన పరాశరసుతుండు
చతురవర్ణాశ్రమాచారధర్మంబులు [2]తవణింప లోకవిడంబనంబు
లగు గ్రామ్యకథలు పెక్కర్థిఁ గల్పించుచు, హరికథావర్ణన మందులోన
నించుకించుక గాని యేర్పడఁ జెప్పమి నంచితవిజ్ఞాన మాత్మ నిలువ
తే. కున్నఁ జింతించి, మఱి నారదోపదిష్టుఁ-డగుచు, హరివర్ణనామృత మాత్మఁ గ్రోలి,
విమలసుజ్ఞాననిధి యన వినుతికెక్కి-ధన్యుఁడయ్యెను లోకైకమాన్యుఁ డగుచు.

వ. కావున. 190

క. సరసిరుహోదరు మంగళ-చరితామృత మాత్మఁ గ్రోలు జనుఁ డితరకథా
గరళముఁ గ్రోలునె! హరిసం-స్మరణము జీవులకు నఖిలసౌఖ్యద మనఘా! 191

క. శ్రీవనితాధిపనామక-థావిముఖుల కిహముఁ, బరము దవ్వై, పిదపం
బోవుదురు నరకమునకున్-వావిరి నే వారిఁ జూచి వగతు మునీంద్రా! 192

క. ఏనరుఁడే నొకనిమిషం-బైన వృథావాదగతిని హరిపదకమల
ధ్యానానందుఁడు గాఁడే-నానరునకు నాయు వల్ప మగు మునినాథా! 193

1. ఇమ్ములన్ = తృప్తితో. 2. తవణించు = ప్రవర్తిల్లు, ఒప్పు.

చ. మృదుగతిఁ బువ్వుఁదేనియ రమించుచుఁ బానముసేయఁ బాఱు ష
ట్పదమును బోలి యార్తజనబాంధవు విశ్వభవస్థితివ్యయా
స్పదమహితావతారుఁ డగు పంకరుహోదరు నిత్యమంగళ
ప్రదగుణకీర్తనామృతముఁ బాయక క్రోలెదఁ; జెప్పవే దయన్." 194

క. అని విదురుఁడు మైత్రేయుం - డను మునినాయకుని నడిగె" నని వేదవ్యా
సుని తనయుం డభిమన్యుని - తనయునకుం జెప్పి, మఱియుఁ దగ నిట్లనియెన్: 195

వ. "ఇట్లు విదురుండు మైత్రేయు నడిగిన, నతం డతనిం గని, యతిమృదుమధురవచన రచనుం డై యిట్లనియె: "ననఘా! కృష్ణకథాశ్రవణతత్పరుండవై నీవు నన్నడిగితివి గావున భద్రం బయ్యె; నీవు భగవద్భక్తుండవు గావున హరికథాసక్తుండ వగుట విచిత్రంబుగా; దదియునుం గాక మాండవ్య శాపంబున సాత్యవతేయు వలన భ్రాతృక్షేత్రంబున శూద్రయోనిం బుట్టినట్టి ప్రజాసంయమనుండవగు యముండవు, పరమజ్ఞానసంపన్నుండవు, నారాయణునకుం బ్రియతముండవు, గావునఁ గృష్ణుండు నిర్యాణకాలంబునం దనసన్నిధికిం జనిన నన్ను డాయం జీరి, విజ్ఞానం బెల్ల నుపదేశించి, నీకు నెఱింగింపు మని యానతిచ్చుటంజేసి యవశ్యంబును నీకు నెఱింగింతు, దత్తావధానుండ వై వినుము: 196

క. వనజాక్షుయోగమాయా - జనితం బగు [1]విశ్వజననసంస్థానవినా
శనముల తెఱఁ గెఱిఁగించుచు - ననఘా!విష్ణుని మహాత్త్వ మభివర్ణింతున్. 197

సీ. సకలజీవులకెల్లఁ బ్రకటదేహము, నాత్మ, నాథుండుఁ, బరుఁడు, నానావిధైక
మత్యుపలక్షణమహితుండు నగు భగవంతుండు సృష్టిపూర్వంబునందు
నాత్మీయమాయ లయంబు నొందిన, విశ్వగర్భుఁ డై తాన యొక్కటి వెలుంగు;
పరమాత్ముఁ డభవుం డుపద్రష్ట యయ్యు వస్త్వంతరపరిశూన్యుఁ డగుటఁ జేసి
తే. ద్రష్టగాకుండు; మాయాప్రధానశక్తి-నతులచిచ్ఛక్తిగలవాఁడు నగుచుఁ దన్ను
లేనివానిఁగఁ జిత్తంబులోనఁ దలఁచి - ద్రష్ట యగుఁ దన భువననిర్మాణవాంఛ. 198

తే. బుద్ధిఁ దోఁచిన నమ్మహాపురుషవరుఁడు - గార్యకారణరూపమై, ఘనత కెక్కి,
భూరిమాయాభిధానవిస్ఫురితశక్తి - వినుతి కెక్కినయట్టి యవిద్యయందు. 199

క. పురుషాకృతి నాత్మాంశ - స్ఫురణము గల శక్తి నిలిపి, పురుషోత్తముఁ డీ
శ్వరుఁ డభవుం డజుఁడు నిజో - దరసంస్థితవిశ్వ మపుడు దగఁ బుట్టించెన్. 200

సీ. ధృతిఁబూని, కాలచోదితము, నవ్యక్తంబుఁ, బ్రకృతియు నను పేళ్లఁబరఁగు మాయ
వలన మహత్తత్త్వ మెలమిఁ బుట్టించె; మాయాంశకాలాదిగుణాత్మకంబు
నైన మహత్తత్త్వ మచ్యుతదృగ్గోచర మగుచు విశ్వనిర్మాణవాంఛ
నందుటఁ జేసి రూపాంతరంబునఁ బొందినట్టి మహత్తత్త్వమందు నోలిఁ

1. విశ్వజనన సంస్థాన వినాశనములు = ప్రపంచముయొక్క ఉత్పత్తి స్థితి నాశములు.

తే. గార్యకారణకర్త్రాత్మకత్వ మైన - మహితభూతేంద్రియకమనోమయ మనంగఁ
దగు నహంకారతత్త్వ ముత్పన్నమయ్యెఁ - గోరి సత్త్వరజస్తమోగుణకమగుచు.

వ. వెండియు రూపాంతరంబులం బొందుచున్న సాత్త్వికాహంకారంబు వలన మనంబును, వైకారిక కార్యభూతంబు లైన దేవతాగణంబులును సంభవించె; నింద్రియాధిష్ఠాత లైనవానివలన శబ్దంబు పూర్వంబునఁ బ్రకాశం బగుటంజేసి జ్ఞానేంద్రియంబు లయిన త్వక్చక్షుశ్శ్రోత్రజిహ్వాఘ్రాణంబులును, గర్మేంద్రియంబు లయిన వాక్పాణిపాదపాయూపస్థములును దైజసాహంకారంబున నుత్పన్నంబు లయ్యెఁ; దామసాహంకారంబువలన శబ్దస్పర్శరూపరసగంధంబు లుదయించె; నందు శబ్దంబు నిజగుణం బయిన శబ్దంబువలన నాకాశంబుఁ బుట్టించె; గగనంబు గాలమాయాంశయోగంబునం బుండరీకాక్షు నిరీక్షణంబున స్పర్శతన్మాత్రంబువలన వాయువుం గలిగించెఁ; బవనుండు నభోబలంబున రూపతన్మాత్రంబువలన లోకలోచనం బైన తేజంబు నుత్పాదించెఁ; దేజంబు గాలమాయాంశయోగంబున నుత్తమశ్లోకుని విలోకనంబునఁ బవమానయుక్తం బగుచు రసతన్మాత్రంబువలన నంబువులం బుట్టించె; సలిలంబు గాలమాయాంశయోగంబునం బరమేశ్వరానుగ్రహంబు గలిగి, తేజోయుక్తం బైన గంధగుణంబువలనఁ బృథివిఁ గలిగించె; నందు గగనంబునకు శబ్దంబును, వాయువునకు శబ్దస్పర్శంబులును, తేజంబునకు శబ్దస్పర్శరూపంబులును, సలిలంబునకు శబ్దస్పర్శరూపరసంబులును, బృథివికి శబ్దస్పర్శరూపరసగంధంబులును గుణంబు లై యుండుఁ; గాలమాయాంశలింగంబులు గలిగి మహదాద్యభిమానంబును నొందిన దేవతలు విష్ణుకళాకలితు లగుదు; రట్టి మహదాదితత్త్వంబు లైక్యంబు సాలమిఁ బ్రపంచంబులు గల్పింప సమర్థంబులుగాక కృతాంజలు లై యోగేశ్వరేశ్వరుం డైన నారాయణు నిట్లని స్తుతియించె: 202

దండకము. "శ్రీనాథ, నాథా, జగన్నాథ, నమ్రైకరక్షా, విపక్షక్షమాభృత్సహస్రాక్ష, నీరేజపత్త్రేక్షణా, దేవదేవా, భవద్దాసవర్గోపతాపంబులం బాపఁగా నోపు దివ్యాతపత్త్రంబునాఁ బొల్చు యుష్మత్పదాంభోజమూలంబు పుణ్యాలవాలంబుగాఁ బొంది, యోగీంద్రు లుద్దామసంసారతాపంబులం బోవఁగా మీఁటి వర్తింతు; రో తండ్రి! యీశా! సమస్తాఘనిర్ణాశ! యీ విశ్వమందెల్ల జీవుల్ భవోదగ్రదుర్వారతాపత్రయాభీలదావాగ్నిచేఁ గ్రాఁగి, దుఃఖాబ్ధిలోఁ దోఁగి, యే కర్మముక్త ధర్మముం బొందఁగా లేక, సంసారచక్రంబునందుం బరిభ్రామ్యమాణాత్ము లై యుందు; రమ్మూఢచేతస్కులం జెప్పఁగా నేల? యో దేవ! విజ్ఞానదీపాంకురం బైన మీ పాదపంకేరుహచ్ఛాయఁ బ్రాపింతు; మబ్జాక్ష! సన్న్యాసిసంఘంబు లైకాంతికస్వాంతతం జేర్చి

దుర్దాంతపాపౌఘనిర్నాశకాంబుప్రవాహాభ్రగంగానివాసంబు గా నొప్పు నీ పాద
యుగ్మంబు యుష్మన్ముఖాంభోజసద్గతంబైన వేదాండజశ్రేణిచేతన్ ¹గవేషించి
సంప్రాప్తులై యుందు; రోనాథ! వైరాగ్యశక్తిస్ఫుటజ్ఞానబోధాత్ములైనట్టి ధీరోత్త
ముల్ నిత్యనైర్మల్యభవ్యాంతరంగంబులం దేపరంజ్యోతిపాదాబ్జపీఠంబు గీలించి,
కైవల్యసంప్రాప్తులై; రట్టి నిర్వాణమూర్తిం బ్రశంసింతు; మింద్రాదివంద్యా! ముకుం
దా! సమస్తంబుఁ గల్పింపఁ, బాలింపఁ, దూలింపఁగాఁ బెక్కు దివ్యావతారంబులం
బొందు నీ పాదపంకేరుహధ్యానపారీణసుస్వాంతులై యొప్పు భక్తాళికిన్ మోక్ష
దంబైన నీ పాదకంజాతముల్ గొల్తు; మీశా! రమాధీశ! పుత్రాంగనా
మిత్రసంబంధబంధంబులం జెంది, నిత్యంబు దుష్టక్రియాలోలురై, దేహ
గేహంబులం దోలి వర్తించు దుర్మానవశ్రేణులం దంతరాత్ముండవై యుండియున్,
దూరమై పోఁచు నీపాదపద్మంబు లర్చింతు; మో దేవ! బాహ్యేంద్రియవ్యాప్తి
నుద్వృత్తులైనట్టి మాహాత్ము లధ్యాత్మతత్త్వప్రభావాఢ్యులై నీపదాబ్జాత
విన్యాసలక్ష్మీకళావాసముం గన్న యయ్యుత్తమశ్లోకులం గానఁగాఁజాల;
రప్పుణ్యు లాదుష్టులం జూడఁగానొల్ల; రంభోధిరాట్కన్యకాకాంత! వేదాంత
శుద్ధాంతసిద్ధాంతమై యొప్పు నీ సత్కథాసారచంచత్సుధాసారపూరంబులం
గ్రోలి, సౌఖ్యోన్నతిన్ సోలి, ధీయుక్తులై వ్రాలి, తాపంబులం దోలి, మోదం
బులం దేలి, సంపన్నులై యున్న నిత్యప్రపన్నుల్ మహోత్కంఠతం బేర్చి,
వైకుంఠధామంబు నల్పక్రియాలోలురై కాంతు! రద్దివ్యవాసైకసంప్రాప్తికిం గోరు
చున్నార; మో దేవ! వైరాగ్యవిజ్ఞానబోధాత్మయోగక్రియాయూథి నంతర్బహి
ర్వ్యాప్తిఁ జాలించి, శుద్ధాంతరంగంబు గావించి, హృత్పద్మవాసుండవై, చిన్మ
యాకారమై యున్న నీ యున్నతానంతతేజోవిలాసోల్లసన్మూర్తిఁ జిత్తంబులం
జేర్చి; యానందలోలాత్మతం బొల్చు యోగీశ్వరశ్రేణికిం బావకీనానుకంపాను
లబ్ధస్ఫుటజ్ఞానముం గల్గుటం జేసి యాయాసముం జెంద; రో దేవతాచక్రవర్తీ!
సదానందమూర్తీ! జగద్గీతకీర్తీ! లసద్భూతవర్తీ! భవద్దాసులైనట్టి మమ్మున్
జగత్కల్పనాసక్తచిత్తుండవై నీవు త్రైగుణ్యవిస్ఫూర్తిఁ బుట్టించినం బుట్టుటే
కాక నీభవ్యలీలానుమేయంబుగా సృష్టినిర్మాణముం జేయ నే మెంతవా రాదు?
మీశక్తియుక్తిన్ భవత్పూజఁ గావింతు; మట్లుండె; నీసత్కళాజాతులైనట్టి
మమ్మెన్నఁగానేల? యధ్యాత్మతత్త్వంబ వన్నం, బరంజ్యోతి వన్నం, బ్రపంచంబ
వన్న, న్నధిష్ఠాత వన్నన్, ²సదాసాక్షి వన్నన్ గుణాతీత! నీవేకదా? పద్మ
పత్రాక్ష! సత్త్వాదిత్రైగుణ్యమూలంబు నానొప్పుమాయాగుణంబందు నుద్యన్మహా
తత్త్వమైనట్టి నీ వీర్యముం బెట్టుటం జేసి నీ వింతకుం గారణంబౌదు; వాయాయి
కాలంబుల న్నీకు సౌఖ్యంబు నే మెట్లు గావింతు? మేరీతి నన్నంబు భక్షింతు?

1. గవేషించు = అన్వేషించు, వెదకు. 2. సదాసాక్షి = నిరంతరసాక్షి.

మెబ్భంగి వర్తింతు ? మేనిక్కడ నున్నందు ? మీజీవలోకంబె యాధారమైయుండి
భోగంబులం బొందుచున్నన్న యిక్కార్యసంధాను లైనట్టి మాకుం జగత్కల్పనా
శక్తికిఁ దేవ! నీశక్తిఁ దోడ్పాటు గావించి, విజ్ఞానముం జూపి, కారుణ్యసం
ధాయి వై, మమ్ము రక్షింపు; లక్ష్మీమనఃపల్వలక్రోడ! యోగీంద్రచేతస్సరోహంస!
దేవాదిదేవా! నమస్తే నమస్తే నమః.'' 203

సీ. అనినఁ బ్రసన్నుఁడై, హరి, మహదాదుల కన్యోన్యమిత్రత్వ మందకున్న
కతమున నిఖిలజగత్కల్పనాశక్తి వొడమకుండుటఁ దనబుద్ధి నెఱిఁగి,
కైకొని, కాలవేగమున నుద్రేకంబు నొందిన ప్రకృతితోఁ బొంది, నిజబ
లము నిల్పి, తా నుపక్రముఁ డన సప్తవింశతితత్త్వములయందు సమత నొక్క
తే. పరి ప్రవేశించి, యాత్త్వాభవ్యగుణము-నంతఁ జేష్టానురూపంబు లలరఁజెంది,
యొకటినొకటినిగలయక యుండివిశ్వ - రచన నెఱుఁగనియాత్త్వనిచయమునకు.

వ. ఇట్లు విశ్వనిర్మాణనిపుణత్వంబు నెఱుంగం జూపుచు, నన్నింటికి నన్యోన్యతం
గల్పించి, తన యనుగ్రహంబునం బ్రేరితం బై కానంబడి క్రియాసామర్థ్యంబునం
జెన్నొందిన తత్త్వవితానంబు దేవప్రేరితం బయి, స్వకీయంబు లగు నంశంబుల
చేతం బుట్టించిన విరాడ్విగ్రహం బై, తత్త్వవితతి దమయందుఁ జెందిన పుండరీ
కాక్షుని కళాంశంబున నొకటి కొకటికి నైక్యంబు వాటిల్లి, పరిణతం బై
రూపాంతరంబునుం జెందె; నేతత్త్వంబున నేని జరాచరలోకపుంజంబులు నిండి
యుండు, నా హిరణ్మయం బైన విరాడ్విగ్రహంబు నొందిన పురుషుండు సర్వ
జీవసమేతుం డై యుండె; నంత. 205

క. జలములలోపల నిమ్ముల - జలరుహజాతాండమందు సాహస్రాబ్దం
బులు నిలిచెఁ గార్యరూపా - కలితం బగు నవ్విరాట్పుగర్భము వరుసన్. 206

తే. దైవకర్మాత్మశక్తివితానములను - దగిలి,తన చేతఁ దనుఁ దాన దైవశక్తి [మొంది.
యగుచు వెలుఁగొందుచును,బ్రకారాంతరమునఁ-దనువువితతంబుగాని చైతన్య

తే. రూపసంసక్తిఁ జేసి నిరూఢకర్మ - శక్తియును వృత్తిభేదసంసక్తి దశవి
ధములు గలిగిన ప్రాణరూపమున నాత్మ-శక్తి బోధత్వ మగుచున్న శక్తి గలిగి.

క. త్రివిధం బగుచును నాధ్యా-త్మ్యవిభేదంబులను బాపి, మఱి యధిభూతా
త్మ విరాడ్రూప మ్మగు నిది - వివిధప్రాణులకు నాత్మవిధ మై, మఱియున్. 209

క. జీవం బై, పరమాత్మకుఁ - దావలమై, యాదిమావతారం బగు న
ద్దేవుని గర్భంబున భూ - తావళితోడం బ్రపంచ మర్థిం దోఁచెన్. 210

వ. ఇట్లు దోఁచిన, విరాట్పురుషుం డాధ్యాత్మికాధిదైవికాధిభౌతికంబు లను

భేదంబులచేఁ బూర్వోక్తక్రమంబున వెలుఁగొందు" ననుచు విదురునకు మైత్రే
యుం డెఱింగించె" నని చెప్పి వెండియు ని ట్లనియె : 211

చ. "హరి, పరమాత్ముఁ, డీశుఁ, డజుఁ, డాఢ్యుఁ, డనంతుఁ, డనంతమూర్తి, సా
గరతనయాహృదీశుఁడు, వికారవిదూరుఁడు, నిత్యమంగళా
కరుఁడు, కృపాపయోనిధి, యకల్మషచిత్తుఁడు, సర్వశక్తి, దా
మరసవిలోచనుండు, బుధమాన్యచరిత్రపవిత్రుఁ డిమ్ములన్. 212

వ. ఇత్తెఱంగున నీశుం డగు నధోక్షజుండు మహదాదితత్త్వంబుల మనంబుల ఘనంబు
లగు తలంపులు దా నెఱిఁగి, యత్తత్త్వంబుల వివిధవృత్తిలాభంబునకై స్వకీయ
చిచ్ఛక్తిచే నిట్టు లొనర్తు నని చింతించి, నిజకళాకలితం బగు విరాడ్విగ్రహంబు
నందు నగ్నిప్రముఖం బగు దేవతావళికెల్ల నివాసం బగుచుఁ గానంబడిన వైరాజ
పురుషుని యాస్యాద్యవయవంబుల వినిపింతు; దత్తావధానుండవై వినుము: 213

సీ. నరనుత! యాదివ్యపురుషోత్తముని పృథగ్భావంబు నొంది, ముఖంబువలన
భువనపాలకుఁ డైన పవమానసఖుఁ డంతరాత్ముఁ డీశ్వరునంశ మైన వాశి
కనయుంబు ననుకూల మగుచు, నిజస్థానమునఁ బ్రవేశించిన ముఖమునందుఁ
బరఁగు జీవుండు శబ్దము నుచ్చరించుఁ; బృథగ్భావములగు నేత్రముల నినుఁడు
తే. చక్షురింద్రియయుక్తుఁ డై [1]సరవిఁ జెంది-రూపవిజ్ఞానమహిమ నిరూఢి నొందు;
మఱియుఁ జర్మంబునను బవమానుఁ డీశ్వ-రాంశమై త్వగింద్రియమందుఁ గూడి.

వ. నిజవాసంబు నాశ్రయించిన, జీవుండు స్పర్శేంద్రియగతుం డై పృథగ్భావంబయ్యె; శ్రోత్రంబుల దిక్కు లచ్యుతకళాంశంబులగు శ్రవణేంద్రియయుక్తంబు లై నిజస్థానంబునం బొందిన జీవుండు శబ్దజ్ఞానగతుం డగు; వెండియుఁ దాలువు నిర్భిన్నం బయిన లోకపాలుం డగు వరుణుం డందుఁ బ్రవేశించి, రసనేంద్రియంబుచేఁ బ్రకాశించినం బ్రాణి రసంబులం గ్రహించెఁ; బరమేశ్వరు నాసికేంద్రియంబు పృథగ్భావంబు నొంది, యాశ్వినేయాధిష్ఠానం బై ఘ్రాణాంశంబు నొందిన జంతువు గంధగ్రహణసమర్థం బయ్యె; వెండియు భిన్నం బయిన చర్మంబును, నోషధులును, బరమపురుషాంశంబులయిన కేశంబులం గూడి, నిజనివాసంబు నొందిన జీవుండు గండూయమానుం డగు; భిన్నభూతం బైన మేఢ్రంబునం బ్రజాపతి రేతంబున నిజస్థానంబు నొందిన జీవుం డానందంబునం బొరయు; భిన్నభావం బైన గుదంబున మిత్రుం డచ్యుతాంశంబును బొందు; పాయువుం గూడి, నిజాధిష్ఠానంబు నొందెడు జీవుండు విసర్గంబుఁ జెందు; వేఱువేఱైన బాహువులం ద్రిదశాధీశ్వరుండయిన పురందరుండు క్రయవిక్రయాదిశక్తియుక్తుం డగుచు నిజస్థానంబు నొందిన జీవుండు వానిచేత జీవికం బొందు; మఱియుఁ బాదంబులు నిర్భిన్నంబు

1. సరవి = క్రమము, అనుక్రమము. 2. విసర్గము = త్యాగము, విసర్జనము.

లయిన విష్ణుండు స్వావాసంబు గైకొని గతిశక్తిం బొందిన జీవుండు గమనాగమనార్హుం డయ్యె; వెండియు భిన్నభావంబయిన హృదయంబును మనంబుతోడం గలసి, నిజాధిష్ఠానంబుగం జంద్రుండు ప్రవేశించిన, జీవుండు శరీరసంకల్పాదిరూపం బగు వికారంబునుం బొందు; భిన్నభావంబైన యహంకారంబున నహంప్రకృతియుక్తుం డై రుద్రుండు నిజస్థానంబుగా వసియించు; నాయహంకృతిచే శరీరి కర్తవ్యంబులు నడపు; బుద్ధి వాగీశ్వరావాసం బై, హృదయంబుతోడం గలసి, నిజాధిష్ఠానంబున బోధాంశంబుచే వెలింగిన, శరీరి బోద్ధవ్యతం బొందు; భిన్నంబైన చిత్తంబు బ్రహ్మావాసం బై, చేతనాంశంబు నొందినం, బ్రాణి విజ్ఞానంబునుం బొందు; నట్టి విరాట్పురుషుని శీర్షంబున స్వర్గంబును, జరణంబుల వసుమతియు, నాభియందు గగనంబునుం గలిగె; సత్త్వాదిగుణపరిణామంబుల నమరు లై; యూర్జితసత్త్వ గుణంబున నద్దేవతలు త్రిదివంబును బొందిరి; రజోగుణంబున మనుజులును, గవాదులును ధరణిం బొందిరి; తామసంబున భూతాదు లైన రుద్రపారిషదులు ద్యావాపృథివ్యంతరం బగు వియత్తలంబునుం బొందిరి; ముఖంబువలన నామ్నాయంబు లుత్పన్నంబు లయ్యె; వెండియు. 215

క. ధరణీదివిజులు, శ్రుతులును - నరవర! యమ్మేటిముఖమునం బొడముట భూ
సురుఁ డఖిలవర్ణములకును - గురుఁడును, ముఖ్యుండు నయ్యె గుణరత్ననిధీ! 216

క. ధర బ్రాహ్మణాదికము ద - స్కర బాధలఁ బొందకుండఁ గైకొని కావం
బురుషోత్తము బాహువులను - నరనాథకులంబు పుట్టె నయతత్త్వనిధీ! 217

క. గణుతింపఁగఁ గృషిగోర - క్షణవాణిజ్యాదికర్మకలితంబుగ నా
గుణనిధియూరువులందుం - బ్రణుతింపఁగ వైశ్యజాతి ప్రభవం బయ్యెన్. 218

తే. తివిరి సేవకధర్ము లై, దేవదేవు - పదములను శూద్రసంతతు లుదయ మైరి;
వీరలందఱుఁ దమతమ విహితకర్మ - మలరఁ జేయుచు, జనకుండు, నాత్మగురుఁడు.

క. అగు సర్వేశు, పరాత్పరు, - జగదేకప్రభుని పాదజలజాతంబుల్
దగిలి భజింతురు సతతము - నిగమోక్తిన్ భక్తియోగనిపుణాత్మకు లై. 220

తే. మహిమ దీపింపఁ గాలకర్మస్వభావ - శక్తిసంయుక్తుఁ డగు పరేశ్వరుని భూరి
యోగమాయావిజృంభణోద్యోగ మెవ్వఁ - డెఱిఁగి నుతియింపఁగా నోపు విద్ధచరిత!

ఉ. అన్యకథానులాపము లహర్నిశముం బఠియించి, చాల మా
లిన్యము నాత్మ శోభనవిలీనత నొందు మదీయజిహ్వ సా
జన్యము నొందె నేఁడు హరిసద్గుణదివ్యకథామృతంబు స
న్మాన్యచరిత్రమై నెగడు మద్గురువాక్యపదంబుఁ జెందఁగన్. 222

మ. హరినామాంకితసత్కథామృతరసవ్యాలోలుఁ డైనట్టి స
త్పురుషశ్రేష్ఠుఁ డసత్కథాలవణవారిపూరంబుఁ దాఁ గ్రోలునే?
వరమందారమరందపానకుతుకస్వాంతద్విరేఫంబు స
త్వరమై పోవునె [1]చేఁతివేములకుఁ దద్గంధానుమోదాత్మమై? 223

క. హరిమహిమముఁ దన్నాభీ-సరసిజసంజాతుఁ డైన చతురాననుఁడుం
బరికించి యెఱుఁగఁ డన్న, ని-తరమనుజులఁ జెప్ప నేల తత్త్వజ్ఞనిధీ! 224

తే. శ్రుతులుఁ దమలోన వివరించి చూచి, పుండ-రీకలోచను, నుత్తమశ్లోకచరితు,
నమరగణవంద్యమానపాదాబ్జయుగళు-వెదకి కనుఁగొన లేవండ్రు విమలమతులు.

క. హరియుం దన మాయాగతిఁ-బరికించియుఁ గానఁ డయ్యెఁ బరిమితి లేమిన్;
మఱి మాయావిని మోహిని-చరితముఁ గనుఁగొందు రెట్లు చతురాస్యాదుల్?

క. ఆ దివిజాధీశుఁడు, మహా-దాదులు, దిక్పతులుఁ, బంకజాసనుఁడున్, గౌ
రీదయితుఁడుఁ గనఁజాలని-శ్రీదేవుని పదయుగంబుఁ జింతింతు మదిన్." 227

క. అని మైత్రేయుం డవ్విదు-రున కెఱిఁగించిన తెఱంగు రుచిరముగా న
ర్జునపౌత్రునకుఁ బరాశర-మునిమనుమం డెఱుఁగఁ జెప్పి ముదము దలిర్పన్. 228

వ. వెండియు ని ట్లనియె: 229

క. "భూమీశ్వర! మైత్రేయమ-హాముని విదురునకు నట్లు హరిగుణశుభలీ
లామాహాత్మ్యముఁ జెప్పిన,-నా మైత్రేయునకు విదురుఁ డనియెన్ మఱియున్: 230

క. "అగుణునకు, నిర్వికారికి-జగదవనోద్భవవినాశసత్కర్మములుం
దగులీల లెట్టు? లాతఁడు-సగుణుం డై యుండు టెట్లు సౌజన్యనిధీ!" 231

సీ. అని యర్భకునిగతి ననఘుని మైత్రేయమునిఁ జూచి విదురుఁ డిట్లనియె: మరల:
"బాలుఁడు క్రీడావిలోలమానసమున దీపించు లీలానురూపుఁ డగుచుఁ;
గానిచోఁ గామానుగతుఁ డై రమించును; నర్భకుఁ డర్థి వస్త్వంతరమున,
నర్భకాంతరమున నైనను బాలకేళీసంగుఁ డగుచు నోలిని జరించు;
తే. హరియు నెపుడు నివృత్తుఁ, డత్యంతతృప్తుఁ-డగుట వర్తించు టెట్లు క్రీడాదులందు?
మఱియుఁ ద్రిగుణాత్మకం బైనమాయఁ గూడి-యఖిలజగములఁ గల్పించె ననుట యెట్లు?

సీ. అమ్మాయచేత నీ యఖిలంబు సృజియించి, పాలించి, పొలియించి పరమపురుషుఁ
డనఘాత్మ! దేశకాలావస్థలందును నితరులయందు నహీన మైన
జ్ఞానస్వభావంబుఁ బూని, యాప్రకృతితో నెబ్బంగిఁ గలసెఁ దా నేకమయ్యెఁ?
గోరి సమస్తశరీరంబులందును జీవరూపమున వసించియున్న

---

1. చేఁతివేములు = చేఁదుగల వేఁపచెట్టు.

